# షా వాలెస్ సమర్పించు

## సూపర్ పవర్ రీగల్

డిటర్జెంట్ సబ్బు

## మురికిని నిర్మూలిస్తుంది

## బట్టలను కాపాడుతుంది



రీగల్ యొక్క ఉతుకు శక్తి, మీ బట్టలందలి
విడవనటువంటి మురికిని నిర్మూలించి
తరుముతుంది

మీయొక్క బట్టలను అత్యంత తెలుపుగా
ప్రకాశవంతముగా ఉతుకుతుంది

అదికాకుండా రీగల్ మన్నికనిచ్చే ఉతుకునిస్తూ,
మీ బట్టలను సున్నితంగా, సౌమ్యంగా
ఉంచుతుంది క్రొత్త పరిమళము
కూడినదియును




షా వాలెస్ వారి
విశిష్ట ఉత్పాదన

Shaw Wallace

ACIL/0592/83 Tel

అద్భుతమైన
బాలల మాసపత్రిక

కేమెరో



సంధ్యనుండి






మాయలూ,
మంత్రాలూ,
మహిమలతో
కలగాపులగమయి
బాలల్ని
నిర్వీర్యులిగా
తయారుచేసే
పత్రిక
కాదు ఇది!



సాహసం,
ఆత్మవిశ్వాసం,
ఆధునికతను
నింపుకుని
బాలల్ని
యోధులిగా
తీర్చిదిద్దే
కొంగ్రొత్తతరహా




పత్రిక ఇది!

# విడుదలయి మార్కెట్‌లో ఉంది!

## ముఖచిత్రాలు

ఇకపై వచ్చే పత్రికల ముఖచిత్రాలు, మహాపురుషుల, మహావ్యక్తుల, మరియు కొన్ని కొన్ని పుణ్యక్షేత్రలవి వేస్తూ, కవరుపేజీకు చిన్న భావుకతలుగాని, చరిత్రలు గాని యిస్తే చాల బాగుంటుంది. నటీనటుల బొమ్మలు ప్రతి పత్రికలపై చూస్తూ విసుగెత్తుతున్నాయి! శీర్షికలు కూడ ఎక్కువ విజ్ఞానవంతంగా వున్నవి మరిన్ని ప్రచురణచేస్తే పత్రిక యొక్క విలువ శిఖారగ్రతను అధిగమిస్తుంది

శివప్రసాద్ (బరంపురం)

## ఇప్పుడయితే....

24–6–83 ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని "ఇలాగ ఎందరో" శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రంగారి కథ చదివాక ఇది వ్రాయకుండా ఉండలేక పోతున్నా

"ఇలాగ ఎందరో" కథలో హీరోయిన్ సీతకి లోకజ్ఞానం ఉందంటూనే మరీ బేల్రకింద సృష్టించి, ఆమె జీవితాశయాన్ని నాశనం చేశాదు అంటే ఆడవారంతా అలా బలి కావలసిందేనా ?

అసలు ఈనాటి పరిస్థితులు వేరు ఇప్పుడైతే అటువంటి యీవ్ టీజర్స్‌గాని, మరెవడైనా రోడ్‌సైడ్ రోమియోగాని ఎదురైతే వారు వ్రాసిన పరిస్థితిని ఎదుర్కొనవలసివస్తే చూస్తూ ఊరుకోలేదు ఎడంకాలి చెప్పుతో దవడమీద ఒక్కటి అంటిస్తే, ఆ తర్వాత మిగతా కథ ప్రక్కవారే చూసుకొంటారు ఇలా ఉండాలి కాని, రచయితగారు మరీ పాతకాలపు భావాలతో కథలు వ్రాసి, యువత శక్తిని అణగద్రొక్క వద్దని నా మనవి ఆడది అబలకాదు, సబల అని నిరూపించినపుడే వారి జీవన సరళికి, దేశాభివృద్ధికి ఎంతో మేలు చేసినవారవుతారు

వెలమకన్ని వెంకటేశ్వర్లు (విజయవాడ)

## అతడు అడవిని జయించాడు

"అతడు అడవిని జయించాడు" సీరియల్ అయిపోవుటచే చాలా బాధ అనిపించింది నిజంగా డా॥ కేశవరెడ్డిగారు ముసలివాడితో సహా మమ్మల్ని కూడా అడవికి తీసుకుపోయి చెట్టుమీద నున్న తోటోడి పాటను వినిపించారు ఇందులో ముసలివాడొక్కడే పాత్ర కాదు వాడు కూర్చొన్న చెట్టు, తీంట్రపాద, తోటిగువ్వ, ఆల్మైటీ సుక్కపంది, సలుగులు ఇవన్నీ సజీవంగా కళ్ల ముందు కదిలాయి ముసలాడు నిజంగా హెర్క్యులెస్ "అతడు మా హృదయాల్ని జయించాడు" డాక్టరుగారి కలం నుంచి ఇటు వంటి వైవిధ్యమున్న రచనలు మరిన్ని రావాలని ఆశిస్తూ ..

కణుముల కృష్ణారావు (వాయల్పాడు)



## "గొప్ప అదృష్టం"

డాక్టర్ కేశవరెడ్డిగారి 'అతడు అడవిని జయించాడు' అనే గొప్ప 'సాలిలోక్వీ'ని చదవడం ఒక గొప్ప అదృష్టంగా భావిస్తున్నాను. ఓల్డ్ మాన్ అండ్ ది సీ రాసిన, హెమింగ్వే కంటే కూడా 'అతడు అడవిని జయించాడు' లో కథనం అపూర్వం, అనన్యం, అద్భుతం అనిపించేదిగా వుంది స్వగతానికిభాషలేదు ఏ భాషలోనైనా రాయొచ్చునని రచయిత నిరూపించారు.

గావుకేకలు పెట్టి, అరిచి, తిట్టి, గొడవ చేస్తూ, కత్తుల్లాంటి కలాల్ను పట్టామనుకునే అహంకారులు ఈ కేశవరెడ్డిగారి నుంచి నేర్చుకోవలసినది ఎంతో వుంది !

పురాణం సుబ్రహ్మణ్యశర్మ
పో. బా. 712 (విజయవాడ–520 010)

## వ్యాసాలు

15–7–83 గల మన వార పత్రికను చూచాము పత్రిక తెరచి చూచి ఎంతగానో మురిసిపోయాము దానికి కారణము– "పుట్టపర్తి తపోవనం" అనే వ్యాసం చూచి ఎంతో కాలంగా పుట్టపర్తిని గురించి, దాని ప్రాంతపు వింత, విషయాలను గురించి ముఖ్యంగా శ్రీ సాయిబాబా వారిని గురించి విన్నామేగాని, ప్రత్యక్షంగా చూచి ఎరుగని మాలాటి పాఠకులెందరికో యీ వ్యాసం వేదనలను చల్లని, చక్కని వివరణలతో ఆ తాపాన్ని ఆర్పింది సత్యం, ప్రేమ, జ్ఞానం, శాంతి, భక్తి, యోగ్య జీవితం పరమార్థమని ప్రబోధాన్ని చాటిచెప్పే శ్రీ సత్య సాయిబాబావారి భజన మందిరం పుట్టపర్తి ఆశ్రమ దృశ్యం, యోగ్య జీవితానికి మార్గదర్శికల చిత్రాలు, మమ్ము ఎంతగానో ఆకర్షించి, ముగ్ధులను చేశాయి సత్యసాయిబాబావారి సుభాషితాలను కూడా ప్రచురిస్తారని నమ్ముతూ, యిలాటి వ్యాసాలను తరచుగా మన వార పత్రికలో ప్రచురింప ప్రార్థన

షేక్ మస్తాను, గాలి బీబి, బేగం
(ముమ్మలనేనివారి పాలెం, రేపల్లె)

* * *

పుట్టపర్తి తపోవనముగూర్చి 15–7–83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించునందుకు డా॥ గుమ్మనూరు రమేష్‌బాబుకి నా యొక్క ధన్యవాదములు తెలియజేయవలయును.

చేబోలు సుబ్బారావు (ఆముదాలవలస)

పుట్టపర్తి శ్రీ సాయిబాబా జీవిత గాధన గూర్చి ఇంత వివరంగ తెలిపినందుకు, రచయితకు మేము చాలా ఋణపడి యుంటాము ! మరియు పుట్టపర్తిలోని సుందర దృశ్యాలను యోగ్య జీవితానికి మార్గ దర్శకులను తెలిపినందుకు మా ధన్యవాదాలు !! సపారె దేవరాజ్ (ఆదోని)

* * *

ఈ వారం ఆంధ్రపత్రికలో శ్రీ సత్యసాయి బాబా వారిపై వ్యాసం చాలా నచ్చింది ఇటు వంటి వ్యాసం ప్రచురించినందుకు డాక్టర్ రమేష్‌బాబుగారికి అభినందనలు ప్రస్తుత పరిస్థితులలో యువతరానికి ఇలాటి వ్యాసాలు చాలా అవసరం బి వి. పట్టాభిరావు

(ఐంద్రజాలికుడు, హైదరాబాదు)

## న్యూఢిల్లీ లేఖ

కొద్ది నెలల క్రితం ఆంధ్రసచిత్రవార పత్రికలో "వాస్తవాలను మరుగుపరచిన గాంధీ చిత్రం" డా॥ జయదుబాషీ రచించిన వ్యాసమును న్యూఢిల్లీ లేఖ శీర్షికను చదివాను, ఇటీవలే నేను గాంధీ చిత్రమును చూచుట తటస్థించినది ఈ చిత్రమును చూసాక నాకు గొప్ప ఆశ్చర్యం కలిగింది డా॥ జయదుబాషీగారు తన వ్యాసములో గాంధీ చిత్రం భారతదేశాన్ని గురించి అనటం కన్నా బ్రిటిషును గురించి, భారతదేశంలో బ్రిటిషువారి సంస్కృతి గురించి తీసింది అని చెప్పవచ్చు అని వ్రాసారు ఇది చాలా తప్పు ఎందుకంటే బ్రిటిషువారు గాంధీని గురించిన చర్చలనే చిత్రించారు కాని గాంధీ ప్రసక్తిలేని సన్నివేశం మచ్చుకైనా లేవు నాకొక్కటే అనిపించింది ఇంగ్లీషువారు కాబట్టి ఈ మాత్రమైనా తీయగలిగారు అదే భారతీయులు ఈ చిత్రాన్ని తీసి ఉంటే చిత్రంలో సహజ సన్నివేశం ఒక్కటీ ఉండదు గాంధీ పాత్రకు ఎవరైనా సరిపోగలరు అన్న ఒక అగ్రనటుని కామెంట్ అవాస్తవంగా ఉంది గాంధీ పాత్రను ధరించడానికి బెన్ కింగ్‌స్లే కొన్ని పౌన్లు బరువు తగ్గిపోయాడట చిత్ర నిర్మాణం పూర్తయ్యే వరకు డైటింగ్‌ను అవలంబించాడట రాజ్‌ఘాట్ సీనును తీయడానికని రిచర్డ్ అటెన్‌బరో ఎంతోసేపు శ్రమపడాల్సి వచ్చింది తను అనుకున్న వారికంటె తక్కువ సంఖ్యలో రావడం చేత, కొన్ని నెలల పాటు వాయిదా చేసాడు వీటిని నేనేమీ కల్పించి వ్రాయడం లేదు పత్రికలలో వచ్చిన యదార్థ వార్తలే ఇవి

గాంధీ చిత్రంలో కస్తూరిబా గాంధీ పాత్ర ఎంత చక్కగా ఉంది ! ఒక ఆంగ్ల నటి చేత అంత చక్కగా నటింప చేయడం ఎంత విశేషం అందు చేత నేను ఈ ఆంధ్రసచిత్రవారపత్రిక ద్వారా విన్నవించుకొనునదేమనగా, చేతనైతే ఆ పని చేసి చూపించాలి, అంతేగాని అర్థంలేని విమర్శలతో ఆ చిత్ర విలువను తీసిపారవేయడం హాస్యాస్పదం దీనిని దయచేసి ప్రచురింప ప్రార్థన

సి ప్రతాప్ (విశాఖపట్నం)

[66వ పేజీ చూడండి]

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
**దేశోద్ధారక కాశీనాథుని**
**వాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం 1908

*శివలెంక శంభుప్రసాద్*
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం 12–8–'83
రుధిరోద్గారి నామ సం. శ్రావణ శు. చవితి
**సంపుటము 75 సంచిక 50**

సంపాదకుడు :
*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు 1-50
ఆరు మాసాల చందా రు 42 90
పోస్టులో ఏడాది చందా రు 85 80

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం .
నటి మేనక
(ఫొటో జి కె నరసింహం)

న్యూఢిల్లీ లేఖ

# తారాపూర్ కేంద్రాన్ని మూసేస్తే ఏమి?



డా. జయదుబాషి

అమెరికా సంయుక్త రాష్ట్రాల సెక్రెటరీ ఆఫ్ స్టేట్ లేదా విదేశాంగమంత్రి జార్జిషుల్‌ట్స్ వచ్చి వెళ్లారు. అంతేకాదు, మనకి చక్కటి టోపీవేసి వెళ్లారు. ఇది ఎప్పుడూ జరిగేదే. విదేశాలవాళ్లు, అందులోనూ సంపన్నదేశాలవాళ్లు, మనకి ఎంత వడ్డించినా సహిస్తామనుకుంటారు, ఎంత అవమానపరిచినా ఊరుకుంటామను కుంటారు. ఇక మనమేమో అదే పనిగా తక్కిన వాళ్ల ఉమ్మి మొహాన పడినా తుడిచేసుకుంటూ ఉంటాము. భారతదేశం ఇతరుల ఉమ్మి స్వీకరించేందుకే ఉందా ?

మనం షుల్‌ట్స్‌ని ఏవేవో కావాలని వేడుకున్నాము. అన్నిటికీ "వీల్లేదు" అన్నాడాయన. ఆసియా అభివృద్ధి బ్యాంకు వద్ద అప్పు ఇప్పించమంటే వీల్లేదన్నాడు. తారాపూర్‌లో వాడే ఇంధనాన్ని బాగుచేసుకోవటానికి అనుమతి ఇవ్వమంటే వీల్లేదన్నాడు. తారాపూర్ యంత్రాలకి కావలిసిన విడిభాగాలు అమ్మమంటే వీల్లేదన్నాడు. [చిల్లర విడిభాగాలు కొన్ని ఏవో ఇస్తానన్నాడనుకోండి. ఇవి మరీ చిన్నవి.] పాకిస్తాన్‌వాళ్ల అణుబాంబుని అదుపులో పెట్టమంటే వీల్లేదన్నాడు.

అన్నిటికన్నా అవమానకరమయిన విషయం తారాపూర్‌కి సంబంధించింది. "తారాపూర్ రియాక్టర్ పాతబడిపోయింది, దానిని మరమ్మత్తు చెయ్యకపోతే అక్కడ పనిచేసే కార్మికులకి రేడియో ధార్మిక ప్రసారాల వలన ప్రమాదం రావచ్చు అందుచేత అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం వారు విడి యంత్రభాగాల ఎగుమతి నిబంధనలని సడలించాలి" అని మనం చెప్పుకున్నాము. మన అణుశక్తి సంస్థ (ఎటామిక్ ఎనర్జీ కమిషన్) వారు ఒక బొంబాయి జర్నలిస్టుని వాడి రేడియో ధార్మిక శక్తి ప్రసారాల కథని ఎన్నో పత్రికలలో ప్రచురింపచేశారు పత్రికలలో పడిన ఈ అంశం నిజంకాదని అధికారంలో ఉన్నవారు అన్నారు కాని అ. శ. సం. వారు మాత్రం రేడియో ధార్మిక శక్తి ప్రసారాలు (రేడియేషన్) ప్రమాదం హెచ్చుగానే ఉందని అంగీకరించారు. షుల్‌ట్స్ వస్తాడనగా ఈ నాటకం జరిగింది. కావలసిన ఫలితమూ దక్కినట్లు తోస్తుంది — ఎందుకంటే, షుల్‌ట్స్ అమెరికాకి తిరిగి వెళ్లి ఇక్కడ రేడియేషన్ అపాయానికి గురి అవుతున్న పనివారిని గురించి చెప్పవచ్చు.

జార్జి షుల్‌ట్స్



అసలు తారాపూర్ కేంద్రాన్ని ఎందుకు మూసెయ్యకూడదు ? మూసేసి దానిని తిరిగి అమెరికా వాళ్లకే ఇచ్చి "మీ ఇష్టం వచ్చిన చోటుకి తీసుకుపోయి అక్కడ పెట్టుకోండి" అనవచ్చుకదా ?

తారాపూర్ కేంద్రం అంత పెద్దదేమీకాదు, ఈమధ్య సరిగా పనిచెయ్యటమూ లేదు. ఒక్క తారాపూర్ కేంద్రమే కాదు, కోటలో ఉన్నదాని పరిస్థితీ అలాగే ఉంది. అలాగే ఉందనటంకన్నా బాగా చెడిపోయిందనటమే బాగా ఉంటుంది తారాపూర్ అణుశక్తి విద్యుత్ కేంద్రం సుమారుగా 10 సంవత్సరాలపాటు బాగానే పనిచేసింది. ఆ తరువాత అది చెడిపోవటం మొదలుపెట్టింది. దీనిని అమెరికా నుంచి 1965లో దిగుమతి చేసుకున్నారు. కొన్నప్పుడు అది కొత్తది కూడా కాకపోయి ఉండవచ్చు, ఏది ఏమయినా తారాపూర్ సాంకేతికంగా అత్యాధునిక కేంద్రం కాదు. దానిని ఒక మ్యూసియమ్‌లో పెడితేనే బాగా ఉంటుంది. దీనిలోనుంచి మహారాష్ట్రకీ, గుజరాత్‌కీ కావలిసిన కరెంటులో 5 లేదా 6 శాతం మాత్రమే వస్తోంది తారాపూర్‌లో వాడిన ఇంధనం చాలా ఉంది అమెరికావాళ్లని యంత్ర సామగ్రితోబాటు ఈ ఇంధనం అవశేషాలని సయితం పట్టుకుపొమ్మన వచ్చు.

ఈ ఇంధనాన్ని ఎంత కాలమని అలాగే పడేసి ఉంచుతాము అమెరికావాళ్లకి 3 లేదా 4 సంవత్సరాల గడువు ఇచ్చి — "దీనిని వెనక్కి తీసుకుపోతారా తీసుకుపొండి లేదా దానిని మా ఇష్టం వచ్చినట్లు బాగుచేసుకుని వాడుకో నివ్వండి" అని చెప్పెయ్యాలి. ఇక నానుడు పనికిరాదు

తారాపూర్ తాలూకు ఒప్పందం 1993లో రద్దు అయిపోతుంది. ఆ తరువాత ఎవరి ఇష్టం వాళ్లది. అందుకని ఇప్పటినుంచే మన ప్రయత్నాలు మనం మొదలుపెట్టడం మంచిది.

తారాపూర్‌లో పడి ఉన్న వాడిన — ఇంధనాన్ని మనం బాగుచేసుకుని మళ్లీ వాడము అన్న హామీ ఇస్తేగాని అమెరికావాళ్లు మనకి విడి యంత్ర భాగాలు ఇవ్వరని నాకు అని పిస్తోంది. ఈ మధ్యనే షుల్‌ట్‌స్ వచ్చివెళ్లిన తరువాతనే— "వాల్ స్ట్రీట్ జర్నల్" అనే పత్రికలో విక్టర్ గిలిన్‌స్కీ అనే అతడు "భారత దేశం ప్లూటోనియమ్ వ్యవహారాన్ని తేలిస్తేనే వాళ్లకి తారాపూర్ యంత్రసామగ్రి విషయంలో సాయం చెయ్యాలి" అంటూ రాశాడు. ఈయన అమెరికా సంయుక్త రాష్ట్రాల అణుకేంద్ర నియంత్రణ సంస్థ సభ్యుడు. భారతదేశం కోరికని సంస్థముందు పెట్టినప్పుడు ఆయన సాను భూతితో ప్రవర్తించగలడా ?

అమెరికా, ఫ్రాన్సు, బ్రిటన్ దేశాలవారు టపాకాయలు కాల్చినట్లు అణు బాంబులు పేలుస్తున్నప్పుడు మనమీద మాత్రం ఆంక్ష లేమిటి ? అమెరికా వాళ్లకి ఇది ఎందుకు అర్థం కాదు ? అమెరికా వాళ్ల చేతుల్లో చెడు చెయ్యని బాంబు భారతీయుల చేతుల్లో చెడు చేస్తుందా? మనం ఏమన్నా హీనజాతి మానవులమా ? ఇస్రాయిల్ సాయంతో దక్షిణ ఆఫ్రికా అణు బాంబుని పేల్చిందని వార్తలు సూచిస్తున్నాయి. అమెరికాకి తెలీకుండా ఇస్రాయిల్ ఏమయినా చెయ్యగలదా ? అసలు దక్షిణ ఆఫ్రికా బాంబుకి అమెరికా ప్రోత్సాహం ఎంత ఉందోమరి ! దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం నల్లవారిని అణచి వేస్తుంది. ఇది వాళ్ల విధానం. అయినా, బ్రిటన్‌గాని అమెరికాగాని ఈ ప్రభుత్వాన్ని ఖండించాయా ? ఖండించటం సంగతి అలాగ ఉంచండి — పయి రెండు దేశాలూ దక్షిణ ఆఫ్రికాతో స్నేహంగా లేవూ ?

దక్షిణ ఆఫ్రికా ఒక ఫాసిస్టుదేశం. వాళ్ల మీద లేని కోపం మనమీద ఎందుకు అమెరికాకి ? ఎందుకంటే — దక్షిణ ఆఫ్రికా తెల్లజాతివారిచేత పాలింపబడుతోంది, భారతదేశం నల్లజాతివారిది, నిక్సన్ మాటలని టేప్‌రికార్డు చేశారు. వాటిని వింటే ఆయన నల్లజాతివారిని ఎంత అసహ్యంగా తిట్టారో తెలుస్తుంది. నిక్సన్‌ని మించిపోయాడు రీగన్

ఇదంతా ఎలాగ ఉన్నప్పటికీ భారతదేశం తనకాళ్లమీద తను నుంచోవటం నేర్చుకోవాలి. అప్పుడే మనమీద వత్తిళ్లు తగ్గుతాయి. నేటి మన వెన్నుముక లేని పాలకులకి మన స్వాతంత్ర్యం మీద అంత నమ్మకం లేదు ★

లోకంపోకడ









# ఎన్సైక్లో పిడియా



## మొవ్వా బాబూరావు

"గుడ్ మార్నింగ్ సార్" ఎయిర్ కండిషన్డ్ రూంలో అడుగుపెడుతూ అన్నాడు సుబ్బారావు.

"వెరీ గుడ్ మార్నింగ్. ప్లీజ్ టేక్ యువర్ సీట్" ఆదరంగా ఆహ్వానించాడు త్రిమూర్తులలో ఒకరు.

మొదలుపెడదామా అన్నట్టు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ఇంటర్వ్యూ చేసే త్రిమూర్తులు.

ఒక చిన్న సైజ్ ఆవలింత ఆవలించి "వాటీజ్ ది డెప్త్ ఆఫ్ పసిఫిక్ ఓషన్" ఈ క్వశ్చన్ ఎంతమందికో వేసీవేసీ టయర్ అయిపోయినట్టు ఫీలయిపోతున్నాడు మధ్యగా కూర్చున్న పెద్దాయన.

"ఐదు లక్షల తొంభై వేల మూడొందల ఐదు" ఒకే మాథ్యులేషన్లో కచ్చితంగా చెప్పేసాడు సుబ్బారావ్.

"లెంగ్త్?"

"పదివేల రెండొందల ఇరవై మైళ్ళు సార్" ఎటువంటి ఆలోచనా ఆలోచించకుండా ఆశువులా వల్లించేసాడు.

"సౌత్ ఆఫ్రికాలోని ఓ చిన్న ఊరు పేరు చెప్పగలరా?"

"పీకీ సార్! ఆ ఊరి జనాభా కేవలం ఐదొందల చిల్లరే!" తడుముకోకుండా చెప్పేసాడు

"అలాగే సౌత్ కొరియాలోని ఓ నదిపేరు చెప్పండి?"

"సౌకానది సార్! ఆ నది నీళ్ళు మన కొబ్బరి నీళ్లలా ఉంటాయి" రెడీమేడ్ రిప్లై వచ్చింది సుబ్బారావు నోటనుంచి.

వీడిపని ఇలా ఉందా అని అనుకున్నారో ఏమో? ఇంటర్వ్యూ అధికారులు జనరల్ నాలెడ్జి క్వశ్చన్స్ వేయటంలో మరింత విజృంభించారు.

# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.**



నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. ఇది దురదను, మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది

నైసిల్ – చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2 చెమటను పీలుస్తుంది
3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4, శరీరానికి హాయినిస్తుంది.







మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

# ఎన్‌సైక్లోపిడియా!

"చైనాలో ఎరిపంట ఎక్కడ అధికశాతం తక్కువగా పండుతుంది ?"

"చింగియా—చింగియాలో సార్! అక్కడ వరి ఒకటినుంచి రెండున్నర శాతమే పండుతుంది మావో ఒకసారి అక్కడికి వెళ్లి పరిస్థితి తెలుసు కుని ఎంతగానో విచారించాడుకూడా!"

త్రిమూర్తుల తల తిరిగిపోతోంది సుబ్బారావు ఒకపట్టాన తమకి దొరకటం లేదని వర్రీ అయిపోతున్నారు సుబ్బారావుని ఎలా అయిన ఒక దారిన తేవాలని తెగ ప్రయత్ని స్తున్నారు

"భారతదేశంలో ఎక్కువగా దొరికే దేమిటి ?"

"చెత్త సార్. 1981 సంవత్సరపునాటి లెక్కల్నిబట్టి చూస్తే నూరుకోట్ల టన్నుల చెత్త పోగయిందని అంచనా. ఏయిటీటూలో మరింత ఎక్కువైందని అంటున్నారు"

"మీరుండండి. వీణ్ని నేను ఎలా బోల్తా కొట్టిస్తానో చూస్తూండండి" చివరగా కూర్చున్న బట్టతలాయన సుబ్బారావుపై లంకించుకున్నాడు.

"ఆ మిస్టర్ సుబ్బారావు! అమెరికా ప్రెసిడెంట్ భవనం వైట్‌హౌస్ ఎంట్రెన్స్ దగ్గిర ఎన్ని స్టెయిర్స్ ఉన్నాయో చెప్పగలవా ?"

"నూటయాభై రెండు మెట్లు సార్. క్రింద రెండు మెట్లు ఈ మధ్యన పాడయిపోతే మళ్ళీ కట్టించారు. పాలరాతితోనే సార్!"

"1947 నాటికి ఇథోపియా జనాభా ఎంత ?"

"యూ మీన్ మనకి స్వాతంత్ర్యం వచ్చి నప్పటికా సార్ ?"

'యా!'

"ఐదు లక్షల రెండు వందల నలభై సార్ అప్పటికీ, ఇప్పటికీ అంటే ముప్ఫయి అయిదేళ్ళకి వాళ్ళ జనాభా మరో లక్ష మాత్రమే పెరిగింది! రియల్లీ ఇటీజ్ ఎ గ్రేట్ థింగ్ కద్సార్ ?"

"ఎక్సాట్లీ" నీళ్ళు నములుతూ అన్నాడు బట్టతల దొర

ఇహ ఇలా వీడ్ని కొశ్చెన్స్‌వేస్తే లాభంలేదు నేనే వీడికి సరైన మొగుణ్ణనుకుంటూ గొంతు సవరించుకున్నాడు ఉలెన్ సూటులో ఉన్న మరో అధికారి.

"నయాగార జలపాతంలో ఉన్న చేప పేరు ఐమీన్ ఫిష్ పేరు చెప్పగలరా ?" మిగిలిన ఇద్దరివైపు ఓ చిన్నసైడ్ పోజిచ్చి సుబ్బారావుని ప్రశ్నించాడు

"క్యాన్ డ్రింక్లీ వెల్‌స్లీ సార్! లార్డ్ కర్జన్ ఈ పేరు ఆ చేపకు 1936లో పెట్టాడు సార్ ఈ చేప పొడవు ."

"ఓకే దట్సాల్! వెరీగుడ్ అమెజాన్ నదికి ఉపనది ఏది ? దాని వైశాల్యమెంత ?"

"సుజామా సార్! పదిహేనువేల చదరపు అడుగులు దానికి మరో ఉపనది కూడా ఉంది సార్ మెంజానది సార్"

ముగ్గురూ నిశ్చేష్టులై సుబ్బారావు వంకె చూస్తున్నారు గుడ్లప్పగించుకోని ఇహ ముగ్గురు కలవకపోతే కొంపలు మునిగేటట్లున్నాయి అను కున్నట్లున్నారు ఒకేసారి సుబ్బారావు మీద విరుచుకు పడ్డారు

"ఫాస్ఫరస్ పెంటాక్సయిడ్‌కి నైట్రిక్ ఏసిడ్ కలిపితే వాటీజ్ ది రియాక్షన్"

"నైట్రిక్ పెంటాక్సయిడ్ ఫాం అవుతుంది సార్ మన ఎరువులలో ఇది ఎక్కువగా ఉపయో గిస్తారు సార్!"

"వాటార్ ది డైమన్షన్స్ ఆఫ్ చార్మినార్ ?"

"500 × 250 × 200 ఫీట్ సార్!"

"గాలిలో గాని, ఎండలో గాని ఆరేస్తే బట్టలు ఐమీన్ తడసిన బట్టలు ఆరుతాయి కారణం ?"

"గాలిలో, ఎండలో క్షింకీ అనే వాయువు ఉంటుంది. దాన్ని బట్టే ఈ చర్య జరుగుతుంది మనం నిత్యజీవితంలో ఇదిచూస్తూంటాం సార్"

త్రిమూర్తులు విసిగిపోయారు

"మీరు ఫాలో అయ్యే జనరల్ నాలెడ్జి బుక్ పేరు ?" కుతూహలంగా అడిగారు

"ఎన్‌సైక్లోపిడియా వాల్యూం ఎయిట్! ఈ మధ్యనే గుయానా వాళ్ళు రిలీజ్ చేసారు"

"యూకెన్ గో" నీరసంగా అన్నారు ముగ్గురూ ముక్తకంఠంతో

సుబ్బారావు కాలర్ సవరించుకుంటూ బయట పడ్డాడు

"వెరీ ఇంట్రస్టింగ్ అండ్ ఇంటలిజంట్ ఫెలో! రియల్లీ హి ఈజ్ ఎ వర్దీ" తీర్మానిం చారు త్రిమూర్తులు

"దిస్ ఈజ్ ది కరక్టు ప్రొసీజర్ టుఫేస్ సచ్ ఇంటర్వ్యూస్" తన సమయస్ఫూర్తికి తనే మెచ్చుకున్నాడు సుబ్బారావు ఆ తర్వాత ఇంటర్వ్యూ అధికారులు కూడా మెచ్చుకోలుగా సుబ్బారావుకి అప్పాయింట్‌మెంట్ ఆర్డర్స్ పంపించారు

రియల్లీ ఇటీస్ ఎ వర్దీ ఇంటర్వ్యూ ★

# వ్యక్తిగతం



మార్క్ చాగాల్ తన 96వ జన్మ దినంనాడు తన మనవలు, మనవ రాండ్రు వగయిరాల వినోదం కోసం బుగ్గలు పీక్కుంటూ ఉండగా తీసిన ఫొటో ... చాగాల్ సర్రియలిసమ్ ఉద్యమం నాయకులలో ప్రథములు ..



జగదీష్‌రాయి ఛధా తూర్పు ఆఫ్రికాలోని కిన్యాలో ఒక పంజాబీ కుటుంబంలో పుట్టాడు. ఆయనకి బ్రిటన్ పాస్‌పోర్ట్ ఉండేది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో చదువుకుని బ్రిటన్‌కి వెళ్లపోయాడు. వీలు కాలేదు. కిన్యా ప్రభుత్వం వారు కూడా నీకు "బ్రిటిషు పాస్‌పోర్ట్ ఉంది" అన్నారు. అమెరికాకి తిరిగి వెళ్లి ఆ దేశం పౌరుడినవుదామనుకుంటే అక్కడి వారూ వీలులేదన్నారు. చివరికి సుప్రీమ్ కోర్టు ద్వారా తన కోరిక న్యాయమయినదే అనిపించుకున్నాడు ఛధా. ఆయన భార్య శెర్రీ అమెరికా వనిత.



మిస్ యూనివర్స్‌గా ఎంపిక అయిన 19 సంవత్సరాల లొరెయిన్ డవున్స్. ఈమె న్యూజిలాండ్ యువతి 'మాడెల్' వృత్తి చేస్తోంది. వనితల కీర్తికి అపకారం రాని విధంగా తను నడుచుకోగలనని ఈమె అంటోంది ...



సామంతా స్మిత్‌కి 11ఏళ్లు. ఏప్రిల్ నెలలో ఆమె సోవియెట్ అధ్యక్షుడు యూరీ ఆండ్రోపోవ్‌కి ఉత్తరం రాసింది. ఆయన సామంతాని సోవియెట్ యూనియన్ అతిథిగా తన దేశం రమ్మని ఆహ్వానించారు. సామంతా సోవియెట్ పర్యటన చేసింది .

# వారఫలం

12-8-1983 శుక్రవారం మొదలు 18-8-1983 గురువారం వరకు

♈ మేషం వ్యక్తిగతంగా మీరు చేసే ప్రయత్నాలు ఫలవంతం కాగలవు జాయింటు వ్యవహారాలలో యిబ్బంది కలుగుతుంది చాల రోజులుగా రాక నిలచిన డబ్బు చేతికందే మార్గ మున్నది స్త్రీలకు విద్యార్థులలో ఆశించిన 'కోర్సు' లభిస్తుంది (గాయపు మున్నది)

♉ వృషభం జాయింటు వ్యాపారం చేసే వారు ఎంతైనా జాగ్రత్త వహించు అవసరం నూతన సమస్యలు తల ఎత్తగలవు ప్రత్యర్థులు సాధించునకు దిగనున్నారు స్త్రీలకు నగలు సేకరించుటకు, ఉద్యోగ సంపాదనకు అనుకూలత చేకూర గలదు

♊ మిధునం: చాలమందికి ఈవారం ప్రయాణము కూల్యత, వ్యాపార లాభం, నూతన మిత్ర సందర్శనం, నూతనాంశాలు గ్రహించే అవకాశ మున్నది స్త్రీలకు. భూ సంపదనో, గృహ సంపదనో అభివృద్ధి చేసికో గల అవకాశ మున్నది అన్నింటా క్రమాభివృద్ధి చేకూరుతుంది.

♋ కర్కాటకం అన్ని విధాలా యోగ కాలం వారమంతా హడావుడితో, లాభ దాయకంగా జరిగి పోతుంది ఉత్తరాల మూలంగా కొన్ని విషయాలు గ్రహింప గలరు నూతన మిత్రసంపద అభివృద్ధి చెంద గలదు స్త్రీలకు ధన లోపం లేదు చాల కాలంగా రాక నిలచిన ధనం శీఘ్రంగా అందే మార్గ మున్నది

♌ సింహం చాలమందికి వ్యాపార రీత్యా ప్రయాణాలు చెప్పదగియున్నది చాలమందికి రాజకీయంగా మేలు చెప్పదగి యున్నది వ్యాపారం అనుకూల దాయకంగా నెరవేర నున్నది స్త్రీలకు గతకొన్ని వారాల కన్నా, వస్తు సేకరణకు అవకాశ మున్నది ఆదాయం గల వారమే వృత్తిలో పెంపు గలవారం

♍ కన్య. సంఘ సేవకు ఆయత్తం కావటం, విందు వినోదాలలో జోక్యం కలుగ జేసికోవటం, సత్కార్యాచరణ, ఇనుప వ్యాపారంలో, కలప వ్యాపారంలో లాభించే మార్గం ఏర్పడుతుంది స్త్రీలకు రాజకీయంగా అనుకూలత చేకూరటం, మిత్ర సహాయం లభించటం చెప్ప దగిన అంశాలు

♎ తుల చాల కాలంగా ఆశించిన అవకాశం ఈవారం లభించే మార్గ మున్నది వ్యాపార నిమిత్తం అప్పు చేయవలసి వస్తుంది అనుకున్న విధంగా వృత్తిలో పెంపు కనిపించదు స్త్రీలకు నూతనాంశాలు తెలుసుకోవటం, రాజకీయంగా మేలు జరగటం గమనించగలరు

♏ వృశ్చికం మీ శాంతికి, సహనానికి ఇది పరీక్షాదినం అవకాశ వాదులు వెంట బడకుండా గమనించండి వ్యాపారం నిమిత్తం మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు. డబ్బు నిమిత్తం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి అంద వలసిన రీతికి చేతి కందుతుంది, అప్పులుంటే కూడా వసూలవుతాయి

♐ ధనుస్సు: ధన ధాన్య సేకరణకు, భూసంపదను వృద్ధిచేసి కొనుటకు మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి భిన్న మార్గాలలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ప్రభుత్వోద్యోగులకు చాలమందికి యత్న కార్యాలలో ఆశా భంగమే. స్త్రీలకు నూతనాంశాలు గ్రహించటం, విద్యాభివృద్ధి యత్నాలు ఫలించటం గమనిస్తారు.

♑ మకరం ప్రభుత్వ మూలంగా కావలసిన పను లుంటే సుకరంగా నెరవేరుతవి. వస్తువాహనాలు సమకూర్చు కొనుటలో ఈవారం సర్వానుకూలం. స్త్రీలకు ఆదాయం, వస్తు సేకరణకు అనుకూలం.

♒ కుంభం: కొందరు దూర ప్రాంతాలకు ప్రయాణించే ప్రయత్నాలు చేస్తారు కొందరకు నూతన అవకాశాలు లభించే విధాన వార్త లందుతాయి 'సినీ రంగంలో', రంగస్థలంలో కొందరకు సదవకాశాలు లభిస్తాయి యత్నించండి. స్త్రీలకు కళా రంగంలో ఆదరణ, వృత్తిలో పెంపు, అధికారుల ఆదరణకు అవకాశ మున్నది

♓ మీనం: నూతన మిత్రులు చేరటం, నూతనాంశాలు గ్రహించటం, నూతనంగా వార్తలు లాభించే విధాన ఉత్తరాల మూలంగా అందటం గమనింప దగిన అంశాలు కోర్టు 'వ్యవహారాలుంటే ఆశాజనకంగా ఉంటాయి స్త్రీలకు సొంత మనుష్యుల మూలాన చిక్కులేర్పడటం, అనవసరంగా అపనిందలకు గురి కావటం గమనింప దగిన అంశాలు .

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రముల్ సమృద్ధి అయిన అమూల్ పాలు, ఎంచిన మాల్ట్, ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు, అత్యవసరమైన ఖనిజాలు, ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్ యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది







**మరింత పొడుగ్గా,**
**బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక

To Nutramul P O Box 10148 Bombay 400 001 nn

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి నేను రు 1-50 పోస్టేజి స్టాంపులూ న్యూట్రముల్ 500 గ్రా డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు

పేరు ______________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ______________________

మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001.



daCunha/GCM/76/TL/82

సీరియల్



# జీవన మురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

3

(గత సంచిక తరువాయి)

సముద్రం, ఎడారి, అడవి, చీకటి ఆకాశం, వంటరి బాట అందంగా వుంటాయి, అయినా భయాన్ని కలిగిస్తుంటాయి ఆ అందం నిర్వేదనకూ ఆ భయం వేదాంతానికీ దారితీస్తాయి మనిషిని వంటరితనంలో ముంచి, అంతశ్శోధనకు గురిచేస్తాయి మురళీకృష్ణ చుట్టూ వున్న అడవి వేపుకు చూశాడు లోలోపలకు రా అంటూ అది ఆహ్వానిస్తోంది పైన వున్న ఆకాశం వేపుకు చూశాడు నేనున్నాను నీకు నెత్తిమీది గొడుగులా అంటూ అది ధైర్యం చెబుతున్నట్లుగా వుంది చుట్టూ చూశాడు గాలి గొణుగుతోంది, చెట్లు గుస గుసలు పోతున్నాయి నడిచి నడిచి అలసి వో చోట కూచున్న మురళీకృష్ణ తన పెట్టెలోంచి అందమైన ఓ చిన్న ఫ్లూట్‌ను బయటకి తీశాడు అందంలో అందంగా, భయంలో భయంగా, వేదనలో వేదనగా, వేదాంత భాజకంగా వాయించుకోవడం మొదలుపెట్టాడు ఎవ్వరూ లేనిచోట, అనంతమైన వంటరి ఏకాంతంలో, ప్రకృతి ఉపగూహనంలో తన నాదానికి తనే మురిసిపోతున్నాడు సంగీత శక్తి ఎంత మహత్తరమైంది! ఎంతటి దివ్యమైంది అది! ఎప్పటివాడు సైగల్! ఆ సైగల్ అతని గొంతులో మరోసారి ప్రాణం పోసుకుంటున్నాడు

ఓ ఉడుతపిల్ల అతనికి దగ్గరగావచ్చి, వెనక కాళ్ళమీద నిలబడి కాసేపు అతని పాట విని సగం కొరికిన వో రాచ ఉసిరికాయను అతని ముందు బహుమతిగా పెట్టి వెళ్ళిపోయింది

ఓ చిలుక తల్లి దూరంగా చెట్టు కొమ్మ చివర కూచుని అతని రాగానికి గుండె కరిగిపోగా తనూ వో పాటనందుకుంది

పైన పావురాళ్ళెగురుతున్నాయి కింద రాయిలా తుప్పా స్పందనతో వూగుతున్నాయి అంతటి అందమైన సమయంలో, రోడ్డు గుండెను కిరాతకంగా నలిపేస్తూ, అడవి ప్రశాంతతను ఘోరంగా చికాకుపరుస్తూ, వుఫ్ మని పొగను నల్లగా ఉమ్మేస్తూ ఎత్తుమీది నుంచి పల్లంలోకి జారుకుంటూ ఆ బాటమీదిగా వచ్చిన వో లారీ మురళీకృష్ణకు అల్లంత దూరంలోకి వచ్చి, దడ దడలాడుతూ ఆగిపోయింది లారీలో నుంచి, డ్రైవరు దగ్గరున్న డోరు తెర్చుకుని జలీల్ పాషా కిందకు దిగాడు ఈ పక్కనున్న తలుపును ఒక్క తన్ను తన్ని క్లీనర్ బుజ్జిగాడు కిందకు దూకాడు

జలీల్ పాషా బాయ్‌నెట్ ఎత్తి, లారీ మిషన్ని తనిఖీ చేస్తున్నాడు

"ఏం గురూ! ఏమైంది?" అన్నాడు బుజ్జిగాడు బీడీముక్కను నోట్లో పెట్టుకుంటూ

"దీని సిగ దరగ, హీటెక్కిపోయింది నీళ్ళుపొయ్‌రా!" అన్నాడు పాషా

బుజ్జిగాడు పళ్ళికిలించాడు "దానికీ తెలుసు గురూ! మనం హీటెక్కిపోయ్ వున్నామని! అందుకే అదీ హీటెక్కిపోయింది!"

"పరాచికా లాడకు రొరే – నాకు ఒళ్ళు మండిందంటే నిన్ను కైమా చేసేస్తాను" బుజ్జిగాడు బకెట్టు తీసుకుని దూరంగా పరుగెత్తాడు అలలు అలలుగా తేలివస్తోంది మురళీ స్వరం ఆట్టే నిలబడిపోయాడు కింద నున్న పచ్చిక తివాచీమీద అరవిచ్చిన గులాబీ రేకు పడినంత మెత్తగా వుంది ఆ స్వరం, ఆగిపోతున్న రాగం!

"గురూ, ఆ ఫ్లూటిన్నావా?"

పాషా నొసలు చిట్లించాడు చెవులు రిక్కించాడు "ఈ అడవి మధ్యలో ఈ పాటేందిబే?" బుజ్జిగాడు అటుయిటూ చూశాడు మురళీకృష్ణ ఫ్లూట్‌ని జేబులో పెట్టుకుని, సామాన్లు తీసుకుని, వాళ్ళవేపే వస్తున్నాడు

**జరిగిన కథ — 1 :** మురళీకృష్ణ, ఇంద్రసేన్, పాటల మాలచ్చి ఒకే రైల్లో ప్రయాణం చేసి దిగవలసిన స్టేషన్లో దిగుతారు ఆ స్టేషన్‌లో తప్పించుకొని పారిపోయిన తన కూతురుని వెతుకుతూ ఒక పిల్ల తండ్రి, అతని అల్లుడు మురళీకృష్ణకు తటస్థపడతారు తన తండ్రిని, బామ్మను తలచుకుంటూ ఆనందపురం పోవడానికై స్టేషన్ బయటికి వస్తాడు మురళీకృష్ణ

"గురూ! ఎవరో ఆఫీసరులా వుంది చెకింగ్‌కేమో!" బుజ్జిగాడు కీచుమంటూ అరిచాడు మురళీకృష్ణ వాళ్ళ దగ్గరకు వచ్చాడు "నా పాట విని ఈ వనదేవత ఆనందించి మిమ్మల్ని పంపించినట్లుంది ఆనందపురం వెళ్ళాలి, ప్లీజ్, లిఫ్ట్ ఇస్తారా?"

పాషా దగ్గరకు బుజ్జిగాడు వచ్చాడు వాళ్ళకూ, మురళీకృష్ణకూ బాయ్‌నెట్ అడ్డంగా వుంది వాళ్ళు గుసగుసలుగా మాట్లాడుకోవడం మొదలెట్టారు

"గురూ! అతగాడెవరనుకున్నావ్, ఆఫీసర్, సందేహం ఏం లేదు ఆనందపురంలోనే కదా మనకు చెకింగ్ ఆఫీసుంది మెల్లగా లారీలోకి ఎక్కినట్టే ఎక్కి, అవీ యివీ తనిఖీచేసి, స్మగుల్డ్ గూడ్స్‌ను లెక్కరాసేసుకుని, హేండ్సప్అనేస్తాడు ఆనక మనకు నెత్తిన ముసుగులూ, చేతులకు బేడీలూ ఏవంటావ్?"

"ఎక్కించుకోటానికి వీల్లేదని చెప్పేయ్!" పాషా కంఠంలో కాఠిన్యం

"లిఫ్ట్ కుదరదయ్యా ఎళ్లెళ్ళు!" బుజ్జిగాడు దర్పంగా అన్నాడు

"ప్లీజ్!" మురళీకృష్ణ ఎంతో అనునయంగా, వినయంగా మళ్ళీ అడిగాడు

"నీకు కాదటయ్యా చెప్పేది? మాబండిలో ప్యాసింజర్లని ఎక్కించుకోం! అది మా రూలు"

ఈసారి పాషా కలుగజేసుకున్నాడు గబగబా ఇంజన్ని స్టార్టు చేశాడు "నీళ్ళు జంక్షన్‌లో పోద్దువుగానిలే! ఎక్కెక్కు!" అంటూ బుజ్జిగాణ్ణి తొందరపెట్టాడు వెళ్ళిపోతున్న లారీవేపు చూస్తే, ఎంతో బాధ కలిగింది మురళీకృష్ణకు సహాయం చేయటానికి వెనుకాడిన వాళ్ళ మూర్ఖత్వాన్నిచూస్తే కోపం వచ్చింది నీరసంగా వెళ్ళిపోతున్న ఆ లారీనిచూస్తూ నడవడం మొదలెట్టాడు, వంటరి బాటమీద, చేతుల్లో బరువులతో

"గురూ! బలే ప్రమాదంలోంచి బయట పడ్డాంలే!" అన్నాడు బుజ్జిగాడు

"వాడాఫీసరే నంటావా?" సందేహంగా అడిగాడు జలీల్‌పాషా, చార్మినార్‌ని అందుకుంటూ




''డౌటు పడకు గురూ! ఆఫీసర్లే మధ్య రకరకాల వేషాలు వేస్తున్నారని పేపర్లో చదవలా? వీడూ- ఆవేషాల్లో ఒకటి, మన్ని పట్టడానికి, తెలిసిందా?''

''ఆఫీసరు కాకపోతే అడవిలో వొదిలిపెట్టినందుకు ఆ అల్లామన్ని శిక్షిస్తారురా వెర్రి వెధవా!''

''వాడు ఆఫీసరే అయితే అప్పుడు ఆ అల్లా కూడా మన్ని రక్షించలేడు!''

లారీ అవునన్నట్లుగా మూడు వణుకులు వణికింది డబడబ అంటూ పెద్దమోత బుస్సున పొగ ఇంక లాగలేనంటూ మొరాయింపు ఆగిపోయింది

''దానియవ్వ ఏందిబే ఇది?'' జలీల్ పాషాకు తిక్కెత్తుకొచ్చింది కిందకు దిగి మిషన్ని నాలుగు తన్నులు తన్నాడు ప్లగ్‌లు పీకి బయట పెట్టాడు నట్లు సరిచేసాడు తీగలు సవరించాడు ''పానీ లావ్!'' అంటూ కేకవేశాడు నీళ్లకోసం బుజ్జిగాడు బకెట్టు తీసుకుని దూరంగా పరుగెత్తాడు

లారీ ఆగడం చూసిన మురళీకృష్ణ వడివడిగా నడుస్తూ దాని దగ్గరకు వచ్చాడు క్లీనర్ లేడు. డ్రైవరు చెకింగ్‌లో వున్నాడు మంచి తరుణము, మించిపోవును అనుకున్నాడు హోల్డాలు, పెట్టె వీపుమీద వేసుకుని, ఎడం చేత్తో వాటిని పట్టుకుని, కుడిచేత్తో కమ్మి పట్టుకుని వెనకచక్రం మీద కాలువేసి లారీ లోపలకు ఒక్క గెంతు గెంతాడు లోపలకు పడ్డాడు పెట్టె, హోల్డాలు అంత దూరంలో పడ్డాయి అతనికింద మెత్తగా వుంది చుట్టూ బూరుగుదూది బస్తాలు ఆ బస్తాల మధ్యగా ఖాళీస్థలం ఆ స్థలంలో ఖరీదైన ఎర్రచందనం చెక్కలు ఆ చెక్కలమీద కనిపించకుండా పరిచిన లేడిచర్మాలు ఆ చర్మాలమీద వెల్లికలా, తలకింద చేయి పెట్టుకుని పడుకున్న ఇరవై ఏళ్ల యవ్వనవతి ఆ అమ్మాయి గుండెలమీద వెళ్ళి పడ్డాడు మురళీకృష్ణ

''ఆ య్ !'' అంటూ అరవబోయింది ఆ అమ్మాయి

''సా రీ !'' అంటూ పెద్దగా అనబోయాడు మురళీకృష్ణ

ఆ అమ్మాయి తనను తాను నిభాయించుకుంది మురళీకృష్ణ తనను తాను నిగ్రహించుకున్నాడు ఆ అమ్మాయి గభాలున మురళీకృష్ణ పెదవులపై తన సుతారమైన వేళ్ళనుంచింది మురళీకృష్ణ కిందకు దొర్లి ఆ అమ్మాయి పెదవులపై తన అరచేయి నుంచాడు వాళ్ళిద్దరూ ఒకళ్ళ కళ్ళల్లోకి ఒకళ్ళు చూసుకుంటున్నారు ఇకరి శరీరం మరొకరికి వెచ్చగా తగులుతోంది ఎవరా అమ్మాయి? మురళీకృష్ణ ఆమెవైపే చూశాడు

బుగ్గన చుక్క వుంది నొసటన బాసికం వుంది తల్లో వత్తుగా పూలున్నాయి పట్టు







చీర మిసిమిలో, యౌవనంలో ఆ పిల్ల ధగధగ మెరిసిపోతోంది కానీ ఆ పిల్ల కళ్ళ భయంతో నీలజలదాల్లా వున్నాయి. సందేహం లేదు, ఆ అమ్మాయి ఓ పెళ్ళికూతురు ! ఆశ్చర్యమే !! అడవిలో ఆగిపోయిన లారీలో, ఓ పడుచుపిల్ల !! ఓ నూతన వధువు !! మెడలో పూలదండతో ఓ అందాల భామ !!!

ఆ నూతనవధువు, భయంతో, ఉద్వేగంతో, సిగ్గుతో మురళీకృష్ణవేపుచూస్తోంది ఎవరీయువకుడు? ఎంత అందంగా వున్నాడు ! వంకీలజుత్తు, విశాలమైన నుదురు, భయంలేదని అభయం ఇస్తున్నట్లున్న నల్లని కళ్ళు, పట్టుదలను సూచించే పెద్ద ముక్కు, ఆడపిల్ల ముద్దుకోసం కలవరిస్తున్నట్లున్న ధనుస్సులాంటి నోరు, కౌగిలిని ఎరగినట్లున్న బలిష్టమైన చేతులు, విశాలమైనవక్షస్థలం ఆ అమ్మాయి బలవంతంగా అతనినుండి తన కళ్ళను అవతలకు తిప్పుకుంది.

లారీ స్టార్టయినట్టుగా గుర్రు గుర్రు మంటోంది. "ఓకే గురూ — ఇహా గదు తోలేసేయ్ !" పాషా క్లచ్ రిలీజ్‌చేసి గేరు మార్చాడు. లారీ ఒక్క జర్కుతో ముందుకు గెంతింది. ఆ అమ్మాయి అతనివేపుకు దొర్లి అతనిమీద పడ్డది. 'సా...రీ... !" అంటూ సిగ్గుతో ముడుచుకుపోతూ సర్దుకుంది.

లారీ ముందుకు పోతున్నది. బుజ్జిగాడు వో లొల్లాయిపదం అందుకున్నాడు.

'కాకినాడ రేవుకాడ
ఆకలేసి తొంగుంటే
అద్దరేతిరికాడ
అద్దాల రైక పిల్ల
ముద్దెట్టి నవ్వినాది
చెయ్యెట్టి నాగినాది
కన్నుగొట్టి పిల్చినాది.' అంటూ పెద్దగా పాడుతున్నాడు.

ఆ పాట విని జలీల్‌పాషా పకపకా నవ్వాడు. "అరే వెధవా, ఆపరా నీ పాట. అర్ధరాత్రికాడ అదెవత్తో కన్నుగొట్టే నీకెట్టా కనుపించిందారే !"

## జీవన మురళి

" అదంతేలే గురూ, ఆకలేసి తొంగుంటే అన్నీ అట్లాగే అవుపిస్తాయి!" అన్నాడు అనుభవపరుడిలా బుజ్జిగాడు వాడు మరో బూతుపదం అందుకున్నాడు. ఆ బూతు వింటూ మురిసిపోతూ, మహా స్పీడుగా లారీ తోలుతున్నాడు జలీల్‌పాషా

"నా పేరు జీవన" అన్నదా అమ్మాయి లోగొంతులో.

"నా పేరు మురళీకృష్ణ" అన్నాడు తనను తాను పరిచయం చేసుకుంటూ అతను

"అమ్మలేని నన్ను, పింతల్లి పెంచింది నిప్పుల్లోపెట్టి పింతల్లి మాటలు విని ఇంటిమీద అప్పుతీరడం కోసమనీ మా నాన్న నన్నో ముసిలాడికిచ్చి పెళ్లి చెయ్యబోయేడు అది పెళ్ళి కాదు. నా గొంతుక్కు వురికాదూ ? అందుకనే పెళ్ళిపందిట్లోనుంచి పారిపోయొచ్చేశాను. పరుగెత్తుకువస్తుంటే ఈ లారీ కనిపించింది ఎక్కేశాను." అన్నది జీవన గద్గదికంగా.

"నేను మా వూరు వెళ్తున్నాను. లాస్టు బస్సుకూడా తప్పిపోయింది. నన్ను వీళ్ళు ఎక్కించుకోలేదు. వేరే మార్గంలేక ఎక్కేశాను ఇట్లా వెనగ్గా !" అన్నాడు మురళీకృష్ణ అపాలజిటిక్‌గా.

"నన్ను వీళ్ళు చూస్తే ఎంతప్రమాదమో!" అన్నది జీవన భయంగా

"నన్ను చూస్తే దింపేస్తారు !" అన్నాడు మురళి ఆలోచనగా

"మీరూ నేనూ ఇద్దరం దిగొద్దు. ఇందులోనే వుందాం, ముందుకు పోదాం" అన్నది జీవన ధైర్యం తెచ్చుకుంటూ

మురళీకృష్ణ మనోహరంగా నవ్వాడు. నవ్వుతున్నప్పుడు ముత్యాల్లాంటి అతని పలువరుస బయటపడింది. ఈ అమ్మాయి అప్పుడే 'మనిద్దరం' అంటోంది. 'ఈ ఆడవాళ్ళు ఎంత తొందరగా అల్లుకుపోతారో' అన్న వూహకు అతనికి నవ్వొచ్చింది.

తనను చూసి అతను అపహాస్యం చేశాడా అనిపించింది జీవనకు ఉడుక్కుంటూ దూరంగా జరిగింది "తప్పకుండా ముందుకే పోదాం, కానీ ఈ లారీ మన్ని మనం వెళ్ళవలసిన చోటువరకూ తీసుకు వెళ్తుందో లేదో మరి !" అన్నాడు మురళీకృష్ణ మళ్ళీ ఈ జీవన దాపత్రయంలో ఎవరి తాపత్రయాలు వారివి, ఎవరి ఆసక్తి, బాధ్యత, బాధ వారిది, అనిపించింది ఆ మాటలు వింటుంటే

లారీ గతుక్కుల్లో పడి లేచినప్పుడల్లా వాళ్ళిద్దరికీ వొకరిమీద మరొకరు పడక తప్పడం లేదు పడ్డప్పుడల్లా శరీరాలు కలుసుకుంటున్నాయి. గుండెలు కొట్టుకుంటున్నాయి లేచినప్పుడల్లా మళ్ళీ పడితే బావుండుననిపిస్తోంది. పడ్డప్పుడల్లా లేవకుండా వుండిపోతే చాలనిపిస్తోంది.

ఒకసారి అట్లా పడ్డప్పుడు ఆమె వక్షస్థలం మీద చీర చెరగులో అతని మొహం చిక్కుకుంది.

అతన్ని మొహాన్నీ, ఆమె చీర చెరగునూ కప్పేస్తూ చుట్టూతా వత్తుగా పువ్వుల దండ.

"దండలో చిక్కడ్డాది నా చెరగు !" అన్నది జీవన బెదురుగా.

"ఆ చెరగులో చిక్కడ్డది నా మనసు !" అనుకున్నాడు మురళీకృష్ణ లోలోపల పైకి మాత్రం మెల్లగా దండనూ, చీర చెరుగునూ తప్పించుకుని దూరంగా జరిగాడు.

"చిక్కులేమీ వుండవు జాగర్తగా మనం విడదీసుకుంటే !" అన్నాడతను అర్థాంతరంగా.

జీవన అతనివేపు బేలగా చూసింది. అవునన్నట్టుగా అతను తలపంకించాడు.

లారీ కీచుమంటూ ఒకచోట ఆగిపోయింది. దూదిబస్తాల గుండా, లారీ బాడీ పలకల సందుల గుండా బయటకు చూసింది జీవన. అటు పక్కగా చిమ్మచీకటి. ఇటువైపున రోడ్డు పక్కన ఓ గుడిసె హోటలు. ముందు నాలుగైదు నులక మంచాలు. మంచాలమీద కొందరు మగమహారాజులు కూచుని బీడీలు కాలుస్తోనో, చాయ్ తాగుతోనో, బూతుమాటలు చెప్పుకుంటోనో, కాలక్షేపం చేస్తున్నారు.




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

## నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి...మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

# గ మ ని క

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే వంటలా ?" అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని— సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

—సం.







# జీ వ న ము ర ళి

లారీలోనుండి దిగి జలీల్‌పాషా, బుజ్జిగాడూ వాళ్ళ దగ్గరకు వచ్చారు.

"రా భాయ్ రా! చాలరోజులకు కనిపించావ్ ?" అన్నాడు ఆ మంచాలమీద కూచున్న వాళ్ళల్లో ఒకరు.

"ఏరా బుజ్జిగాడా, కిందటిసారికన్నా లావెక్కావ్, ఆడగాలి బాగా వంటపట్టిందేట్రా?" మరొకడన్నాడు.

పాషా, బుజ్జిగాడూ సమాధానం చెప్పలేదు. ఓ మంచం మీద కూచున్నారు.

"డబుల్ స్ట్రాంగ్, దో చాయ్!" అంటూ బుజ్జిగాడు కేకేశాడు.

చాయ్‌వాలా చాయ్ తెచ్చిచ్చాడు.

"సాదా ఛాయ్‌యేనా, గానా నహీఁ ?" అన్నాడు జలీల్‌పాషా.

"అందర్ ఆవోనా ?" అన్నాడు వాడు "లోపలున్నయ్ పిట్టలు !"

"చీకట్లో ఎందుకు బే! బయటకు రమ్మను నజరానా ఇస్తా !" పాషా కంఠంలో మొగలు సామ్రాజ్య కాలం నాటి పాదుషాల రీవి.

గాజులు గలగల లాడాయి. పాదాల పట్టాలు కుసకువలాడేయి. ముక్కుల కున్న బేసర్లు తళ్తళ లాడేయి. ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు లోపల్నుండి బయటకు వచ్చారు దుపట్టాలు వేసుకుని ? బయటకు వచ్చిం తర్వాత, ప్యాసింజర్లను చూసి ఆ దుపట్టాలను వయ్యారంగా గిరవాటు వేశారు.

"ఏం పాషా బావా కులాసాయేనా?" అంటూ అతని బుగ్గ గిల్లింది ఒకత్తె.

"ఏరా బుజ్జి కన్నా, ఎంత లావు మొగాడి వేటి ?" అతణ్ని రెచ్చగొట్టింది మరొకత్తె.

సరసమాడే మగసిరి రేడా
బేరాలెందుకు రేతిరికాడా

అంటూ గిరగిరాలు తిరుగుతూ జాకెట్లు విప్పేసి లోపల బ్రాసియర్లు కనబడేట్టు చేశారు. కట్టుకున్న సిల్కు చీరలు విప్పేసి లంగాలతో నిలబడ్డారు.

"రేయ్ బుజ్జీ ! నేను లోపలకెళ్ళొస్తాను కానీ నువ్వు బండీ దగ్గరుండరా !" అంటూ పాషా వో డ్యాన్సర్ను పట్టుకుని, "రావే బుల్ బుల్ !" అంటూ గుడిసెలో దూరాడు.

అతనటు పోగానే, "ఏం కన్నా, నువ్వు తక్కువ తిన్నావేటి, తొంగోవేటి" అన్నది బయట నిలబడ్డ వాళ్ళలో వో మధ్యవయసురాలు, కన్ను కొట్టి.

"అమ్మో, నీతోనా?!" భయం నటించాడు బుజ్జిగాడు. "తెలిస్తే గురూగారు చంపేస్తారు!"

ఆ మధ్యవయసు జాణ పకపక నవ్వింది. "నాతో కాదురా కుర్రగాడా, అదిగో దాన్తో !" అంటూ వో పదారేళ్ళ పసిదాన్ని చూపింది బుజ్జిగాడు కూచో లేక, నుంచో లేక కాసేపు తన గురువుగారి భయం మర్చిపోయాడు.

## మొసలి కన్నీరు

బీటలువారిన నేల గుండెను చూసి
గుండె లవిసిన ఆకాశానికి
కన్నీళ్లు ఇంకిపోయాయి !
పేదవాని ఆకలి కడుపును చూసి
అలమటించిన గొప్పవానికి
ఆకలి మందగించింది ! !

— చక్కిలం విజయలక్ష్మి

ఆ దృశ్యం చూస్తున్న జీవనకు సిగ్గుతో చచ్చిన చావైపోయింది 'ఛీ ! ఛీ !' అనుకుంది సైకే. మురళీకృష్ణ జీవన వైపు 'ఈ మాత్రం తెలీదా నీకు ?' అన్నట్టు చూశాడు "ఇది జీవితం జీవనా ! బతుకు కోసం పడేపాట్లు. ఆకలి తీర్చుకోడం కోసం నాలుగు క్షణాలు ప్రాణాన్ని చంపుకుని కళ్ళు మూసుకోడం ! ఇక్కడ మాతాలూ, కులధర్మాలూ, ధర్మపన్నాలూ ఇవేమీ అడ్డురావు !"

"ఇట్టా బ్రతక్కపోతే ఏం ?" అన్నది జీవన కోపంగా.

"ఒక ప్రశ్న అడుగుతాను, నీకు కోపం రాదు కదా ?" మురళీకష్ణ అన్నాడు.

"అడగండీ."

"పెళ్ళిపీటలమీద నుండి నువ్వెందుకు పారిపోయి వచ్చావూ ?"

"ఆ ముసలివాణ్ని నేనెందుకు చేసుకోవాలీ?"

"ఏం చేసుకుంటే ?"

జీవన కళ్ళముందు రకరకాల దృశ్యాలు తిరిగాయి. తనకు తిండి పెడతాడు. కోరిన నగలిస్తాడు. కనుపడ్డ గుడ్డలిస్తాడు. తరవాత ?. ఆడపిల్ల వీటికోసమే బ్రతుకుతుందా ? వీటికన్న అతీతమైంది మరేదో వుంది. ఏమిటది ? జీవనకు ఆ విషయం లీలగా మాత్రమే స్ఫురిస్తోంది. రెండు శరీరాలు ఒకటైంతర్వాత, ఆ శరీరాల్లో ఒకటే రాగం వినిపించాలి ఒకటే లయ మహానదిలా ప్రవహించాలి ఆ లయ, ఆ రాగం ముసలి మొగుడేం అందించగలడూ తన పడుచు పెళ్ళానికి ? అందుకోసంకాదూ తను పారిపోయి వచ్చింది.. !

"నీకు తింటానికి తిండి వుంది కాబట్టే ప్రేమ, యౌవనం, ముసలితనం, శృంగారం మొదలైనవాటిని గురించి నీ మనసు ఆలోచించింది. తినడమే ఒక సమస్యగా వున్నవాళ్ళకు, ఒక రోజు తిండి దొరికితే మరోరోజు తిండి దొరుకుతుందోలేదో తెలియనివాళ్ళకు, శరీరమూ, దాని పావిత్ర్యమూ జ్ఞాపకం వుండవు జీవనగారూ ! తిండి సంపాదనకు, ఆకలి తీరడానికి శరీరం ఒక సాధనం అవుతుంది. అంతే !"

జీవన ఆశ్చర్యంతో కళ్ళు మిటమిట లాడిస్తూ, "అయితే ఆ పని తప్పుకాదంటారా?" అని అడిగింది.

"వాళ్ళది కాదు తప్పు ఆ పరిస్థితుల్ని పోషిస్తున్న ఈ సంఘానిది. అందుచేత మన సంఘాన్ని దండించండి. వాళ్ళను చూసి జాలిపడండి !"

మురళీకృష్ణ మాట్లాడుతుంటే జీవనకు ఎంతో ముచ్చటగావుంది వినడానికి "అబ్బో, చాలా సంగతులు తెలుసునే మీకు! ఏం చదువుకున్నారో ?" అని అడిగింది ప్రశంసగా.

"యం. ఎ. సోషల్ వర్క్‌లో ఫస్ట్‌క్లాస్! మువ్వేమన్నా చదువుకున్నావా ?"

"మావూళ్ళోనే అప్పర్ ప్రైమరీ స్కూలు వుంటే, సెవెన్త్ క్లాస్ పూర్తి చేశాను. ఆ తర్వాత పైకి చదూతానంటే మా పింతల్లి ఒప్పుకోలేదు !"

"సెవెన్త్ క్లాసుకే ఇంత సాహసం చేశావ్, డిగ్రీయేవుంటే దేశాన్నే ఏలేదానివి !"

పకపక నవ్వింది జీవన "నవ్వకు నవ్వకు. నవ్వితే నవరత్నాలు రాలుతాయి. ఆ నవరత్నాల కోసం మగవాళ్ళు నీ వెంట బడతారు"

"తప్పించుకోడం నాకు తెలుసు."

"అన్ని వేళలా ఆ ధైర్యం పనికిరాదు."

"అప్పుడు మీలాంటి వాళ్ళెవరో దొరక్కపోదురులెద్దురూ !"

"డ్రైవరూ, క్లీనరూ వస్తున్నారు, గప్ చిప్ !"

లారీ బయల్దేరింది, అలసిపోయినట్టు, ఆకలి తీరినట్టు. మెత్తగా తారురోడ్డుమీద జారిపోతోంది. పాషాకు నిద్రమత్తుగా వుంది. కొద్దిగా బడలికగా వుంది.

"ఏరా బండి తోల్తావేమిటి కొంతసేపు!" పాషా అడిగాడు.

"బద్ధకంగావుంది గురూ, నువ్వే తోలు!" బుజ్జిగాడన్నాడు.

"ఏరా, నువ్వు కూడా ఏవన్నా..." పాషా అడిగిన ప్రశ్నకు బుజ్జిగాడు సమాధానం చెప్పటానికి సిగ్గుపడ్డాడు.

"కక్కుర్తిదవా ! బండి నడుస్తున్నప్పుడు ఇద్దరూ తొంగుంటే, బండి బోల్తా పడుతుందిరా ! నువ్వే హుషారెక్కిపోయుంటే, నీకే ఛాన్సు ఇచ్చుండేవాణ్ని కదురా ! సరేలే ! రవంత సేపు రెప్పలు మూసుకో జంక్షన్‌లో లేపుతా !"

జంక్షన్‌లో బండి ఆగగానే అక్కడ కనబడ్డ దృశ్యం పాషాకు రవంత భయం కలిగింది. ఎక్కడపడితే అక్కడ ఎర్ర బట్టలు. ఎస్ ఐ సైదులు బూట్లు టక టకలాడిస్తూ ప్రతి బండీ చెక్‌చేసి పారేస్తున్నాడు. లారీలో డ్రైవర్లనూ, క్లీనర్లనూ దబాయించేస్తున్నాడు.

జంక్షన్‌లో మామూలుగా కనిపించే దృశ్యాలన్నీ అదృశ్యమైనాయి. ఆటపాటల మనుషులు లేరు సారాబుడ్లు అమ్మకంలేదు. పేకముక్కల జోరులేదు ఒకటి రెండు కిళ్ళీకొట్లు మాత్రం బుడ్డి దీపాలు పెట్టుకుని అయిన యింటి ఆడవాళ్ళల్లా గుట్టుగా వ్యాపారం చేసుకుంటున్నాయి

బట్టతల ఉంగరాల అల్లుడూ, ఆయన మామగారూ, వాళ్ళ మనుషులూ పోలీసుల వెనకాల వుండి వెతుకుతున్న బళ్ళవేపు ఆత్రంగా చూస్తున్నారు. జీవన వాళ్ళను చూసింది. ఆమె నుదురంతా చెమటపట్టింది. "మీ నాన్నా, నన్ను పెళ్ళిచేసుకోవాలనుకొన్న . " ఆమె మాట పూర్తిచెయ్యలేకపోయింది

"కాదు జీవనా ! నిన్ను కొనుక్కోవాలనుకున్న అను, అదీ కరెక్టు మాట !"

" వాళ్ళు వాళ్ళు !" వేలితో అటుగా చూపించింది.

"నీ కోసం పోలీస్ హెల్ప్ తీసుకొన్నారు నువ్వు రైల్లో కనబడకపోయేసరికి ఇహ లారీలు వెతుకుతున్నారు.. !"

"నేను కనిపిస్తే !" జీవనకు ఎంత దాచుకుందామన్నా దుఃఖం ఆగడంలేదు

"నా జీవితాన్ని ముక్కలు ముక్కలు చేస్తారు. నా బతుకును బద్దలు కొడతారు వాడింట్లో నేనో బానిసనవుతాను వాడి పిల్లలకు వంటలక్కనవుతాను వాడి కోర్కెలకు బలైపోతాను. ఓరి భగవంతుడా ! ." జీవన పమిట

చెంగులో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

ఆ పిల్ల దుఃఖం హృదయపు లోతుల్ని చీల్చుకుని వస్తున్నట్లు మురళీకృష్ణకు స్పష్టమౌతున్నది. ఆమె దయనీయమైన స్థితి ఆమెపై అతని జాలిని ద్విగుణీకృతం చేస్తున్నది. జాలి ప్రేమ భావనతో కలసి అతనిని కర్తవ్యోన్ముఖుణ్నిగా మారుస్తున్నది

అసంకల్పితంగానే మురళీకృష్ణ చెయ్యెత్తి, ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. మునివేళ్ళతో ఆమె కన్నీటిని తుడిచాడు. "భయపడకు జీవనా! నేనున్నాను నీకు! నేనుండగా వాళ్ళు నిన్నేం చెయ్యలేరు!" అన్నాడు ధైర్యం చెబుతూ.

"అరుగో పోలీసులు .." అన్నది జీవన అతని గుండెల్లో తల దాచుకుంటూ, యస్. ఐ. సైదులు మందీ మార్బలంతో లారీ దగ్గరకు రావటం చూసి.

"ఎవర్రా డ్రైవరు దీనికి ?" యస్. ఐ అడిగాడు లారీ ఝూడిస్తూ.

"నేనే సార్! జలీల్‌పాషాని!" పాషా ఎక్కడలేని వినయాన్ని అరువు తెచ్చుకున్నాడు.

"ఏవిట్రా సరుకు, బండిలో ?"

"బూరుగు దూది సార్ !"

"దూదేనా, లేకపోతే సాండల్ వుడ్ ... రెడ్‌వుడ్. . వగైరా వున్నాయా ?"

"మీకు తెలియకుండా ఎట్లా వుంటయ్ సాబ్, మీ మెహర్బానీ .. !"

"స్మగుల్డ్ గుడ్స్ సంగతి తర్వాత ... ముందిది చెప్పు పెళ్ళికూతురెవరైనా దార్లో కనిపించిందా ? బండికి లిఫ్టు అడిగిందా ? నువ్విచ్చావా ?"

"ఆడకూతురడిగితే తప్పకుండా ఇచ్చి వుండేవాణ్ణే సార్! కానీ వో ఆఫీసర్లాంటి కుర్రాడడిగాడు 'చుప్‌రహో' అంటూ మేం లారీని తోలుకొచ్చేశాం !"

"నిజమే చెబుతున్నావా ?" సైదులు అతని కళ్ళల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ అడిగాడు.

"అల్లామీద వొట్టు సాబ్! హమ్ ఝూటా ఏప్పుడు చెప్పం !"

సైదులు కానిస్టేబిల్స్‌ను కేకేశాడు. "ఒరేయ్ ఫోర్‌ట్వంటీ, చెక్ చెయ్‌రా !"

ఫోర్‌ట్వంటీ ఒక పొడుగాటి ఇనుప వూచను పట్టుకొచ్చాడు. ఓ స్టూలు వేసుకుని నిలబడి అది పెట్టి బూరుగు దూది బస్తాలను పొడవడం మొదలెట్టాడు.

ఆ వూచ లోపలకు పొడుచుకు వచ్చి నప్పుడల్లా కాలయముడి లోహపాశంలా కనిపించసాగింది జీవనకు ఆమె జరిగి జరిగి, వో మూలకు నక్కి కిందకు పడుకుని వుండిపోయింది మురళీకృష్ణ జీవన తలను కిందకు వంచి పైన జుట్టుమీద, ఆమె వీపుమీద అడ్డంగా వుండిపోయాడు. కాళ్ళకు అడ్డంగా కాళ్ళు. వీపుకు అడ్డంగా వీపు, చేతులకు అడ్డంగా చేతులు, ఆమె పువ్వులకు అడ్డంగా అతని మొహం.

వాళ్ళిద్దరూ వెనక్కు వెనక్కు జరుగుతున్నారు. కానీ జరగడానికి చోటేదీ ? జరుగుతున్నామన్న భావన అది ఆ వూచపోటు నుండి తప్పించుకోవాలన్న తపన అది. కానీ వాళ్ళ ప్రయత్నం ఎంతోసేపు ఫలించలేదు. ఆ వూచ రెండు మూడు సార్లు అటూ ఇటూ తిరిగి చివరకు జీవనవేపు రానేవచ్చింది అడ్డంగావున్న మురళీకృష్ణ చేతిని జబ్బ దగ్గర చీల్చుకుంటూ అవతలకు వెళ్ళింది మురళీకృష్ణ పెదిమను గట్టిగా బిగించాడు. బాధ నోర్చుకుంటూ పళ్ళు గిట్టగరిచాడు పిడికిళ్ళు మూసుకున్నాడు

"చెకింగ్ కంప్లీటెడ్ సార్, నో బడీ !" అన్నాడు ఫోర్‌ట్వంటీ

"బ్లడీ కేస్ !" యస్ ఐ సైదులుకోపంగా లారీ బాడీని ఒక్క తన్ను తన్నాడు. బట్టతల ఉంగరాల పెళ్ళికొడుకు వేపు తిరిగి, "లాభం లేదండీ! మీ ఆవిడ తప్పించుకుపోయినట్టే వుంది!" అన్నాడు కసిగా. "పాషా, లారీని పోనీ!" ఆ మాట అతని నోటినుండి ఇంకా పూర్తిగా రాకుండానే పాషా లారీని ముందుకు దూకించాడు. బుజ్జిగాడు డోరు లాగుతూ, "మన బండిలోనే ఆ పిల్లుంటే, ఆ గుడిసెలో కెందుకెళ్తాం గురూ మనం ?" అన్నాడు అమాయకంగా మొహం పెట్టి

"ఉంటే గింటే ఎట్టాగుండేదంటా ?"

ఇద్దరూ ముతక హాస్యంలో పడ్డారు. లారీ రన్నింగ్ మూడ్‌లో పడ్డది జీవనకు భయం తగ్గి ఇవతలకు తిరిగేసరికి బుజంమీద గాయంతో, కారుతున్న రక్తంతో బాధకోర్చుకోడానికి పట్టు బలవంతం మీద గాథ ప్రయత్నం చేస్తున్న మురళీకృష్ణ కనిపించాడు.

"ఓ !" అంటూ ఆమె కేకవేయబోయింది. ఆ పెదిమలకు అడ్డంగా జాగర్తసుమా అంటూ తన చెంపను ఆనించాడు మురళీకృష్ణ జీవన ప్రరున తను కట్టుకున్న పట్టుచీర చింపింది అతని చేతికి అడ్డంగా, గాయమైన చోట కట్టుకట్టింది ఎర్రని పట్టుచీర చెంగు ఎర్రని రక్తంతో తడిసి మరింత ఎర్రగా కనిపిస్తోంది అది చూసి ఎర్రని ఆమె పెదిమలు నల్లబడ్డాయి, నల్లని ఆమె కన్నులు ఎర్రబడ్డాయి

అతని అభిమానం, తనకోసం అతను చేసిన త్యాగం, అతను తన మాటకు కట్టుబడ్డ విధానం ఆమెను విచలితనుచేశాయి కళ్ళల్లో కృతజ్ఞతతో, అతని గాయపు కట్టుమీద అలా మెల్లగా సవరిస్తూ అట్టే కూర్చుండిపోయింది

"గండం గడచింది ఇకేం భయం లేదు!" అన్నాడు మురళీకృష్ణ "ఏం చేయదల్చుకున్నావ్ ఎక్కడికి పోదల్చుకున్నావ్ ?"

మొణుకులమీద తలపెట్టుకుని, ఆ ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేక, కాసేపు అట్టే కూర్చుండిపోయింది జీవన కొంత సేపైంతర్వాత మెల్లగా ఆమె నోట్లోంచి వెలువడ్డాయి మాటలు

"నాకో వరుసకు మేనమావున్నాడు తల్లి చచ్చి మేనమావను బతకమని కదా సామెత ? నిజంగా ఆయనటువంటి వాడే! నా మీద ఎంతో ప్రేమ, ముసలాడికిచ్చి పిల్ల గొంతు కోయొద్దే అంటూ ఎంతగానో చెప్పాడు తన చెల్లెలికి! చివరకావిడ వినకుండా పెళ్ళి నిశ్చయం చేసేసరికి చేసేదేంలేక, పెళ్ళికి రావడమే మానుకున్నాడు ఆయన వూరు దారిలోనే వుంది అక్కడ దిగిపోతే బావుంటుందేమో !"

మురళీకృష్ణ సందేహంగా అడిగాడు. "ఆ వూళ్ళో లారీ ఆగకపోతే ?"

"ఆగేట్టు చెయ్యలేరా మీరు ?"

"నేనా ?!"

"అవును మీరే! ఇంతవరకూ నా రహస్యాన్ని కాపాడారు ఆపదలో నుండి



# పెరిగే పిల్లలకి కావాలి కాంప్లాన్



## కేవలం కాంప్లాన్®

## లోనే వాళ్లకు ప్రతి రోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి

పెరిగే పిల్లల పోషణకి, ప్రత్యేకంగా కొన్ని ఆహార పదార్థాలు అవసరమవుతాయి. ఎందుకంటే సామాన్యంగా వారి పెరుగుదల 15, 16 ఏళ్ళొచ్చేసరికి రమారమి పూర్తవుతుంది గనక

అందుకే, మీ పిల్లలకు అవసరం కాంప్లాన్— యిప్పుడే. కాంప్లాన్‌లో ప్రోటీన్లు (20%) వుండటమేగాకుండా, పిల్లలకు లభించగల అత్యుత్తమమైన ప్రోటీన్లు (పాల ప్రోటీన్లు) ఉన్నాయి మరి. పెరిగే వయస్సులో వారికి అవసరమయ్యే 22 యింకా యితర కీలక ఆహార పదార్థాలున్నాయి కూడాను గుర్తుంచుకోండి, కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదా)గా కూడా.






GLC/6-2314-TL (R)

# కాంప్లాన్®

**—సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం**

## ఉచితం!

32 పేజీల పుస్తకం

"కుటుంబానికంతటికీ శరీర పోషణకు సలహాలు"

50 పైసల స్టాంపును జతపరిచి వీరికి రాయండి :

పోస్ట్ బ్యాగ్ నం. 19119 (కాంప్.) G-94

బొంబాయి—400 025



# డాక్టర్ సలహాలు



## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### సి. హెచ్. బి. — గర్షకుర్తి

నా వయస్సు 24 సం॥లు. నేను పవర్ లూమ్స్‌లో పనిచేస్తాను ఇలా పనిచేస్తున్నప్పుడు 2 లేక 3 గం॥లు కడుపునెప్పి వస్తుంది.

★ పవర్ లూమ్స్‌లో పనిచేయటానికీ కడుపునెప్పికీ సంబంధంలేదనే చెప్పవలసిఉన్నది— ఒకవేళ ఒకే పొజిషన్‌లో వంగి పని చేయవలసి వస్తే కడుపు భాగంమీది కండరాలు నలిగి నెప్పి కలిగే అవకాశం మాత్రం ఉంటుంది.

మీకు పెప్టిక్ అల్సర్ ఉన్నదేమో పరీక్ష చేయించుకోవటం అవసరం (ఎఫ్- టి-ఎం- టెస్టు, బేరియంమీల్ సీరీస్) వీటి ఫలితాల ననుసరించి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది.

### బి. వి. — నెల్లూరు

మా అబ్బాయి వయస్సు 15 సం॥ లు. ఈ మధ్య చెస్టు పెరుగుతున్నది. ఇలా ఎందుకు జరుగుతుంది. దీని కేమైనా మందులు ఉన్నాయా ?

★ స్త్రీ పురుషు లిరువురిలోనూ స్త్రీ-పురుష హార్మోనులైన ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్‌లు ఉంటాయి. యుక్త వయస్సు (ప్యూబర్టీ) వచ్చే సందర్భంలో వీటి నిష్పత్తిలో కొద్దిగా మార్పు లేర్పడినప్పుడు ఇలా జరిగే అవకాశం ఉంటుంది. కాలక్రమేణా మామూలు పరిస్థితి ఏర్పడుతుంది. ప్రత్యేకచికిత్స అవసరం లేదు.

### ఎల్. ఎల్. — మద్రాసు

విస్‌డం టూత్ (జ్ఞాన దంతం) దవడలోనే బహిర్గతం కాకుండా ఇరుక్కుపోయే ఉవకాశం ఉందా ? అలా జరిగితే అవాంతరాలేర్పడతాయా?

★ ఈ అవకాశం తప్పకుండా కొందరికి ఉంటుంది. దవడ ఎముకకి చీము పట్టడం, సిస్ట్‌లు పెరగటం, కేన్సర్ మొదలయిన అవాంతరాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. ఇలా ఇరుక్కుపోయిన దంతాన్ని శస్త్రచికిత్స ద్వారా తీసివేయవలసి ఉంటుంది. ఆపరేషన్‌ని దంత వైద్యులు చేస్తారు. ఎంత త్వరగా చేయించుకొంటే అంత మంచిది.

## జీవన మురళి

రక్షించారు ఇప్పుడు మా మేనమామ దగ్గరికూడా నన్ను చేర్చి పుణ్యం కట్టుకుంటే !''

''ఊఁ! కట్టుకుంటే ?''

''అబలా సంరక్షణ వ్రతం సర్వం సంపూర్ణం !'' ఫక్కున నవ్వింది జీవన.

ఆ నవ్వు ముల్లులా గుచ్చుకుంది మురళీకృష్ణ ఎడదలో ! ఇంతే ఆడవాళ్ళు !! ''మగివాణ్ణి ఉపయోగించుకున్నంత వరకూ వుపయోగించుకుంటారు, ఆ తర్వాత కరివేపాకులా తీసి అవతల గిరాటేసేస్తారు. వాళ్ళ అవసరాలే వాళ్ళవి'' అనిపించింది అతనికి అంతలోనే తన ఆలోచనకు తనమీద తనకే కోపం వచ్చింది. అసలు ఎవరి అమ్మాయి ? ఆ పిల్లకూ తనకూ ఏంటి సంబంధం ? ఆవిడ దిగవలసినచోట ఆవిడ దిగిపోతుంది. తను డిగిపోవలసినచోట తాను దిగిపోతాడు ఎవరి స్టేషన్లలో వాళ్ళు దిగిపోవడమే కదా జీవితం అంటే ?

ఆ భావమూ అతనికి అంతగా సంతృప్తి నీయలేదు ఏ సంబంధమూ లేకుండానే తామిద్దరూ ఇంత దూరం ప్రయాణం చేశారు. కానీ ఈ సంబంధం ఒక రమ్యమైన అనుబంధానికి దారితీయడం లేదా ? తన మనసు ఆమె వైపుకు ఆకర్షింపబడడం లేదా ? ఈ ఆకర్షణకు తాను తట్టుకోలేకపోతున్నాడు. ఆమెను తాను చూడకుండా వుండలేడు. ఆవిడ సాన్నిహిత్యం, ఆవిడ స్పర్శ, ఆవిడ మాటలు అన్నీ మధుర మధురంగా వున్నాయి, ఎంత సేపున్నా తిరిగి తిరిగి కానాలనిపిస్తున్నాయ్.

''కొంపతీసి మీ మేనమామ ఇంటిదాకా వచ్చి దిగబెట్ట మన్నంటం లేదు గదా ?'' మురళీకృష్ణ తన మనసులోని కోరికకు ప్రశ్నా రూపం ఇచ్చేడు.

''సరిగ్గా వూహించారు. అట్లాగే చెయ్యమని అభ్యర్థిస్తున్నా !''

''అంతవరకూ వచ్చిం తర్వాత, తిరిగి మళ్ళీ నాతోనే వచ్చేస్తానంటే...''

''ఆ అవసరం రాదు. మా మేనమామ దేముడు !''

''అయ్యో !'' అంటూ అతని హృదయం మూగగా మూలిగింది.

''గురూ ! చందర్నగర్ వచ్చేస్తున్నట్టుంది !'' క్లీనర్‌బుజ్జి హెచ్చరించాడు.

''రేయ్ బుజ్జీ ! ఇక్కడ నైట్ హాల్ట్ వేద్దాంరా ! నిద్దరొస్తోంది !'' ఆవులిస్తూ అన్నాడు జలీల్‌పాషా.

''పక్కకు బండీని లాగేయ్ గురూ ! మన్ని కాదనే వోడెవడు ?''

లారీ రోడ్డుపక్కకు జరిగి నింపాదిగాఆగింది. దూరంగా చందర్నగర్ వూళ్ళోనిదీపాలు మిణుకు మిణుకు మంటూ కనిపిస్తున్నాయి. అడవి వెనక బడింది.

''ఇప్పుడెట్లా ? బండీ ఆగిపోయింది !'' మురళీకృష్ణ అడిగాడు.

''చందర్నాగూర్‌కు దగ్గర్లోనే మా మేనమామ వూరు. ఇక్కడ్నుంచి నడిచి పోదాం. మీకు అక్కడే రెస్టు !''జీవన ఉత్సాహంతో అంది.

''ఈ పెట్టె, బెడ్డింగు తీసుకుని...''

''బెడ్డింగ్ మీరు తీసుకోండి. పెట్టె నేను తీసుకుంటాను. కబుర్లు చెప్పుకుంటూ నడిచి పోదాం. ప్లీజ్ !''

''సరే కానీ ! ఎట్లాగైనా సరే ఈరాత్రికి మా ఇంటికి వెళ్ళి తీరాలనుకొన్నా నువ్వు కలిసావు !''

లారీ బాడీకింద పాషా చాపవేసుకు పడుకున్నాడు. ఇంజను క్యాబిన్‌లో బుజ్జిగాడు పడుకున్నాడు. వాళ్ళ గురకలు వుండుండి పెద్దగా వినిపిస్తున్నాయి. మురళీ, జీవన ఒకరి తర్వాత ఒకరు ముందూ వెనకా చూసుకుని జాగర్తగా కిందకుదిగారు. ఏదో జైల్లోంచి బయట పడ్డట్లుగా వుంది ప్రకృతి నిశ్శబ్దంగా వుంది.

''రోడ్డు గుర్తుపట్ట గలవా ?'' అడిగాడు మురళీకృష్ణ.

''ఎన్ని సార్లొచ్చానో ఇక్కడికి. బాగా గుర్తు.''

''సరేపద అయితే !'' ఇద్దరూ నడవడం మొదలు పెట్టారు సామాన్లు తీసుకుని.

(ఇంకా వుంది)

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.

Colgate DENTAL CREAM

Colgate

STOPS B

కోల్గేట్ తాలూకు నమ్మకమైన
ఫార్ములా మీ నోటి శ్వాస
శుభ్రంగా, తాజాగా వుండేలా
చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా,
దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL




"కథ రాయాలని వుంది. కాయితాలు, కలం తెచ్చిపెట్టరా ?" వరండాలో కూర్చుని చదువుకుంటున్న కొడుకుని కేకేసింది తులసి.

ఆ మాట వాడికి వినపడిందో లేదో, సమాధానం చెప్పలేదు. పది నిముషాల తర్వాత మళ్ళీ పిల్చింది. అప్పుడూ ఉలుకూ, పలుకు లేదు. "ఛీ... వెధవ పిల్లలు." విసుక్కుంటు వచ్చి చూస్తే వాసు పుస్తకాలమీద తల పెట్టి నిద్రపోతున్నాడు. గడియారంవైపు చూసింది తులసి. తొమ్మిది కావొస్తున్నది. "నా ఆలోచనల్లో వుండి పిల్లాడికి అన్నం పెట్టలేదు. పాపం, మధ్యాహ్నం ఎప్పుడో తిన్నాడు. సాయంకాలం టిఫినుకూడా చెయ్యలేదు." అనుకుంటు వాడ్ని లేపి తీసుకువెళ్ళి అన్నంపెట్టి, పక్కేసి పడుకోబెట్టింది. మధ్యాహ్నం వచ్చిన ఉత్తరం మళ్ళీ గుర్తొచ్చింది తులసికి. తను వెంటనే కథ రాసి పంపించాలి. పాపం మరీ మరీ అడిగారు. ఆలోచిస్తునే ఉయ్యాల్లోకి తొంగి చూసింది. నాలుగునెల్ల పసికందు రాణి పక్క తడుపుకుని నిద్రపోతున్నది. చెప్పటంరాదు. ఇది కావాలని అడగలేదు. ఆ పసిగుడ్డుమీద జాలితోకూడిన ప్రేమ పెల్లుబికింది తులసికి.

తులసి భర్త శ్రీధర్ ప్రయివేటు కంపెనీలో పని చేస్తున్నాడు. పొద్దున పది గంటలు అయినా కాకుండానే ఇంటి నుండి వెళ్ళిన వాడు రాత్రి తొమ్మిది గంటలు దాటిన తరువాత ఎప్పుడో వస్తాడు. ఈ లోపుగా తులసికి క్షణం తీరిక వుండదు. ఇరుకుగా వుండే రెండు గదుల ఇల్లు. అస్తమానం సర్దినా పిల్లలు నానా ఖంగాళా చేస్తారు. పెద్దపిల్ల శశి శలవులిచ్చారని నాయనమ్మ దగ్గర కెళ్ళింది. వాసు రెండో తరగతి చదువుతున్నాడు. చంటిది రాణి. చాలీచాలని జీతం పని మనిషిని, చాకలిదాన్ని పెట్టుకుంటే సరిపోదు. అందుకనే కుడితిలో బడ్డ ఎలుకలాగా అస్తమానం చాకిరీతో కొట్టుకుపోతుంది.

తులసి చదివింది టెన్త్ క్లాసే అయినా మంచి ఆలోచనా శక్తి వుంది. పెళ్ళికాక ముందు ఒకటి రెండు కథలు రాసినా తల్లి తండ్రి ఏ పత్రికలకు పంపనివ్వలేదు. తన కూతురు తెలివి తేటలమీద నమ్మకం వున్నా, పటిష్టమైన సాంప్రదాయల ఆసరాగా జరిగే పెళ్లికి ఎక్కడ అవరోధం కలుగుతుందోనని ఆ పేద తండ్రి ఆరాటం. అందుకనే, "మనకెందుకమ్మా కథలు గ్రటా హాయిగా, కుట్లు, అల్లికలు నేర్చుకో ! వంట పని, ఇంటి పని సర్దుకో!" అనేవాడు. తులసి మనసులో ఎన్నో ఊహాలు మెదులుతున్నా స్వతంత్రించి వాటిని కాయితం మీద పెట్టలేక పోయింది. తులసికి భవిష్యత్తు మీద మంచి నమ్మకం వుంది. "తనకు అనుకూలుడైన భర్త దొరుకుతాడు. తన ఆశయాలు నెరవేరుస్తాడు తను చక్కగా కథలు రాసుకోవచ్చు." రచయిత్రిగా ఎదగాలని తనకెంతో కోరిక.

తన కోర్కెలు నెరవేరేరోజు అంత త్వరలో వస్తుందని అనుకోలేదు. పెళ్లయిన మొదటి రోజు, శ్రీధర్‌ని అడిగిన మొదటి ప్రశ్న "నేను కథలు రాయటం మీ కిష్టమేనా ?" అని

శ్రీధర్ ఆశ్చర్యంగా తన వైపు చూసి, "ఏమిటి ? కథలు రాస్తావా ?" అన్నాడు.

జరిగింది చెప్పింది తను. అందుకు అత నెంతగానో మెచ్చుకుని, "ఇకనుంచి తప్పకుండా రాయి. రైటర్స్ అంటే నాకు చాలా ఇష్టం. గౌరవం" అన్నాడు.

ఆ మాటలు తను చేరబోయే శిఖరానికి సోపానాల్లాగా తోచాయి. కాపరానికి వచ్చినరోజే చెప్పాడు, "ఇహనుంచి ఎటువంటి సంకోచం లేకుండా కథలు రాసుకో ! నీ ఇష్టంవచ్చినన్ని" అని.

ఆ మాటకు తులసికి నవ్వు వచ్చింది. "ఇష్టంవచ్చినన్ని రాసుకోవటానికి ఇవేం ఉత్తరాలా ?" అనుకున్నది మనసులో

"తులసీ !" తులసి ఆలోచన్లకు అంతరాయంగా శ్రీధర్ పిల్చాడు.

"వస్తున్నా" పక్క ఉదుటునవెళ్లి తలుపు తీసింది.

# అందని ద్రాక్ష

"ఏంచేస్తున్నావ్ ? ఎంత పిలిచినా పలక లేదు. అప్పుడే నిద్రపోయావా ?"

"లేదండి ! కథ రాద్దామని ... "

"కథ సంగతి తరువాత. ముందు నా ఆత్మా రాముణ్ణి సంతోషపెట్టు."

"అలాగేలెండి. పొద్దుటేనుంచి ఈ పని అయిన తరువాత కలం తీద్దాం అనుకుంటూనే రాత్రి అయిపోయింది. ఇప్పుడిక తొందరేముంది. పదండి వడ్డిస్తాను" అంటూ వంట ఇంట్లోకి నడిచింది తులసి.

* * *

తులసి రాసిన కథకి ప్రైజు వచ్చింది. ఈ విషయం శ్రీధర్‌కి చాలా సంతోషం కలిగించింది. కించిత్ గర్వంగా కూడా ఫీలయ్యాడు. కానీ ... ఆ సంతోషం నలుగురికీ చెప్పుకోవటానికిలేదు. తననో వాజమ్మకింద కట్టేస్తారు. తను ఒక్కసారి గట్టి వార్నింగు ఇచ్చివుంటే ఇవ్వాల్టి తన ఆనందం నలుగురితోనూ పంచుకునేవాడు. కానీ, ఆనాడు, తనీ పని చెయ్యలేకపోయాడు.

"ఏమిటండీ ! మీలో మీరే నవ్వుకుని మహా ఆనందపడిపోతున్నారు" పక్కసీట్లో పనిచేసే ప్రసాదు అడిగాడు.

"ఏంలేదు. ఏదో కథలో సంఘటన గుర్తొచ్చి"

"కథ ఏమిటండోయ్! అన్నట్లు మీ ఆవిడ కథలు రాసేవారటగా ?"

"ఇప్పుడు కాదులెండి. ఒకప్పుడు" నాలిక్కరుచుకున్నాడు శ్రీధర్. ఇప్పుడు కూడా నిజం చెప్పలేకపోయాడు. ఆ వేళ ఇంతే ... వరసగా తులసి రాసిన రెండు కథలు పత్రికల్లో వచ్చినయ్ ! ఆనందంగా ఆఫీసులో వాళ్ళందరికీ చెప్పాడు.

ఆ మాట వినగానే, "వురేయ్ ! కథలు రాసేవాళ్ళు భూమ్మీద నిలవర్రా ? ఊహల ప్రపంచంలోనే వుంటారు" అన్నాడు గిరి.

"అబ్బాయ్! నువ్వా చిన్నవాడివి, అనుభవం తక్కువ. కథలు రాసేవాళ్ళ మనసులూ తిన్నగా వుండవ్ ?" నర్మగర్భంగా అన్నాడు అవధాని.

"వురేయ్ ! నువ్వు ఇహ ఊరిమీద పడి పూటకూళ్ళ ఇల్లు వెతుక్కోవలసిందే ! మీ ఆవిడకు అన్నంవండే తీరిక ఎక్కడిదిరా" శర్మ వ్యంగ్యంగా అన్నాడు. తనకు తల కొట్టేసినంత పనయింది. మర్నాడు ఆఫీసుకు వెళ్ళగానే, "తులసిగారి భర్తకు కాఫీ కావాలేమో అడిగిరా" అంటూ ప్యూన్ను పంపించారు తన దగ్గరకు.

తనకోసం ఎవరో వస్తే "ఎవరూ ! తులసి మొగుడా ?" అన్నారెవరో ! "అదేమిటండీ ! శ్రీధరంగారు కావాలంటీ." అన్నాడు వచ్చినతను.

"అదేనయ్యా ! ఆయన భార్య కథలు రాస్తుంది. తులసి అని..."

"ఏమిటండీ!? తులసి ఈయనగారి భార్యా ! నిన్నేదో పత్రికలో కథ పడ్డదని మా వాళ్ళందరూ వంతులేసుకుని చదివారు. చాలా బాగుందిట."

ఈ సంభాషణ అంతా వింటునే వున్నాడు శ్రీధర్. అయినా పెద్దగా పట్టించుకోలేదు.

మర్నాడు ఆఫీసుకు వచ్చీరాగానే, "ఏంవాయ్ ! ఎక్కడ మన మీల్సు. అప్పమ్మ హొటల్లోనా ? బుచ్చయ్య కేఫ్‌లోనా ?"

"ఎందుకండీ ! మనవాడికి వంట రాకపోతే కదా ! వీడే వండి ఇంత తిని, వాళ్ళావిడకింత మూతపెట్టి వచ్చుండాలి."

"ఎక్కడ తింటే మనకేంల్లే ! ఆఫీసుకు వచ్చాడు."

ఇలాంటి మాటలతో జరిగిపోయాయి రెండు రోజులు. ఎందుకనో తనకూ చిన్నతనమనిపించింది. వాళ్ళన్న మాటలు చులకనగా తోచాయి. కానీ తులసి కథలు రాయాలి. ఆమె కథలంటే తనకూ ఇష్టమే! మరి ఆఫీసులో... శ్రీధర్‌కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఇంటికి వెళ్ళగానే భార్యకు చెప్పాడు. మొదట్లో అందుకు ఆమె అంగీకరించలేదు. కానీ భర్త ప్రోత్సాహం తనకుండగా మరేదీ అక్కర్లేదనుకుని అందుకు ఒప్పుకున్నది.

"కసి" ఎన్నో కథలు, నవలలు రాసింది. ఆమె సీరియల్స్ అంటే ఆడ, మగ, పిల్లా, పెద్దా, ముసలీ ముతకా అందరూ పడి పడి చదువుతారు. తులసి భర్తగా కాకుండా శ్రీధర్ శ్రీధర్‌గానే మిగిలాడు ఆఫీసులో.

"శ్రీధర్‌గారూ ! చూశారా ఈ కథ. 'కసి' రాసిందండీ ! ఈమధ్య ఆమె తెగ రాసేస్తున్నది. అయినా ఎంత వెరైటీ."

"ఈమధ్య బహుమతి కథలు బాగుండటం లేదు అనుకుంటున్నాం. కానీ... ఈ కథ వుంది చూశారూ! ఎంత సామాజిక స్పృహతో రాసిందో. ఇటువంటి కథలకు బహుమతులిచ్చి అప్పుడప్పుడు పత్రికలవాళ్ళు మంచివాళ్ళమనిపించుకుంటారు."

"ఆమె" అంటున్నారు. ఇంతకీ ఆడో, మగో తెల్సుకున్నారా ?"

"ఎవరైతేనేం. చక్కని కథలు వస్తున్నాయి."

"ఆ ! చూడండి శ్రీధర్‌గారూ ! ఆమధ్య మీ ఆవిడ రెండు కథలు రాసి అంతటితో ఆపేసిందేమిటి ? "కసి"కి పోటీగా తనూ రాయొచ్చుగా ! ఈనాడు రచయిత్రులంటే పాఠకుల కెంత అభిమానం, గౌరవం, సంఘంలో ఎంత మర్యాద. ఏమైనా అదో అదృష్టం. దేనికైనా పెట్టిపుట్టాలండీ !" నలుగురూ నాలుగు మాటలన్నారు.

"అందని ద్రాక్ష పుల్లన" అన్నారుగానీ, "అందని ద్రాక్ష తియ్యన." అంటే బాగుండేది అనుకున్నాడు. "కసి" మొగుడు శ్రీధర్ కసిగా! ఈ శ్రీధర్ భార్యే "కల్యాణతులసి" అని ఎవరికి తెలును పాపం !



# కొత్త గొంతులు

— టి.యస్. కాంతారావు

కవిత – చంద్రుని మచ్చపైకి
ప్రాకే సుధాలత
సూర్యుని గుండెలోంచి
చీకటి సిరలలోకి దూకే కాంతి
జలపాతం
విప్లవాన్ని వెన్నుతట్టే ఝంఝా
మారుతం
ఇంద్రచాపం జారవిడుచుకున్న
పూల బాణాల తుణీరం
మురికి కాల్వలో సైతం
ప్రతిఫలించే ఆకాశం.

— అమ్మంగి వేణుగోపాల్

వృత్తిరీత్యా ఆంధ్రోపన్యాసకుడు; కవిత్వరీత్యా ఆధునికుడు; దృక్పథం దృష్ట్యా సామాజికుడు, శిల్పంలో విశిష్టమైన వ్యక్తిత్వం, పదబంధంలో అపూర్వమైన నిర్మాణ శక్తి, కంఠధ్వనిలో తనదైనతనం కల వచన గేయ కవి అమ్మంగి వేణుగోపాల్. మిణుగురు అతని కావ్యం చీకటి వెలుగులకు, ఆశా నిరాశలకు సంకేతం మిణుగురు. "మంచి కవిత్వం నిన్ను నిలబెట్టి నీ చేత చదివిస్తుంది" అని రాచమల్లు రామచంద్రారెడ్డిగారు అన్నట్లుగా మిణుగురు కవితా సంకలనం కవిత్వం చదివే ఇచ్ఛగల ఏ పాఠకుణ్ణి అయినా నిలబెట్టి చదివిస్తుంది. ఇందులో ప్రాపంచిక వేదన ఉంది; వ్యక్తి దుఃఖం ఉంది; సమాజ స్తబ్ధతమీద తిరుగుబాటు దృష్టి ఉంది; అగ్గిరవ్వలూ ఉన్నాయి; మంచుముద్దలూ ఉన్నాయి; ప్రేమ ఉన్నది; విషాదం ఉన్నది. ఈ సమాహార రూపమే ఆయన కవితా స్వరూపం. కవిత్వం చెప్పటంలో వచనత్వం లేదు; వినాదం లేదు; ఉపన్యాస లక్షణం లేదు. కవిత్వం ఎట్లా చెప్పాలో, ఎట్లా చెప్పితే మనస్సును, మేధను కదిలిస్తుందో అట్లానే చెప్పాడు ఈ కవి. ఆరిపోతున్న మానవతా జ్యోతికి అండగా అవధులు లేని అంతరంగ చైతన్యాన్ని నింపటానికి, ఘనీభవించిన హిమాలయ ధ్రువాలలో అగ్ని పర్వతాలను ప్రేల్చటానికి, ఆకాశానికి స్వార్థపరులు గీస్తున్న సరిహద్దు రేఖల్ని చెరపటానికి, కొత్త కొత్త గ్రహాల స్వర్గాలయాల మీద వైజ్ఞానికి ధ్వజం యెగర వేయటానికి, భావిచరిత్రకు ఈ తరం ప్రాణ వాయువు పొయ్యటానికి, ఈనాటి యువగళం ప్రపంచ గీతం పాడటానికి ఉపయుక్తమయ్యే కవిత్వం చెప్పుతున్నాడు వేణుగోపాల్.

'కవితా ప్రపంచంలో నాయకత్వాల పోరాటాలు జరుగుతున్నప్పుడు, కవిత్వం తాను నిర్వహించవలసిన కళాత్మక బాధ్యతను, చారిత్రిక బాధ్యతను విస్మరించి, గుంపుల గొంతులో, ముఠాల డప్పులతో దిగంబరంగా గణాచారి నృత్యం చేస్తున్నప్పుడు, ఒక్కొక్క కవికి మిగిలిన కవులంతా అల్పిష్టులు గానూ, అర్భకులుగానూ కనబడతున్నప్పుడు — ఒక్క వేణగోపాలే కాదు అట్లాంటి అనేకమంది ఈ తరంలో నామ మాత్రులుగానే మిగిలిపోవచ్చు; వారి అస్తిత్వానికి వర్తమానంలో గుర్తింపు లేకపోవచ్చు; కళ్ళు గాజుకళ్ళు అయితే అంతా అంధకారమే గదా! అయినా వర్తమానం కంటె భవిష్యత్తు ఎప్పుడూ తెలివైంది. బలమున్న అక్షరానికి క్షయం ఉండదు. తాత్కాలికంగా మూర్ఛపోతుంది; అంతే.

పూల గుండెల్లోని మధువును ముళ్ళు తాగుతున్న దృశ్యాన్ని, మాల మాదిగల కన్నీళ్ళను గాలి తుడుస్తున్న దృశ్యాన్ని, ప్రజాస్వామ్యపు కుంటి నడకను, మానవత్వపు కంటి తడిని చూసి, పేదల వేదనను వర్ణించే వేదాల కోసం, ఉన్నత శిఖరాలకు దారివేసే పాదాల కోసం సాగించిన అన్వేషణలోంచి ఈయనలో కవిత్వం పుట్టింది. మేడల్ని వెలిగిస్తూ కాలిపోతున్న గుడిసె దీపాలు, తెగిపడ్డ పడగల కోరల్లో మొలకెత్తిన నాగజెముళ్ళు, రచ్చబండమీద పులిపంజా



నీడలో గోవులు, సగం పశువు — సగం మనిషి అయిన మేధావులు, గడ్డివాముల నడుమ పస్తులు పండే పల్లెటూళ్ళు, గుండెలు యంత్రాలుగా మారిన నగరాలు, కాలింగ్ బెల్లులో కాపురముంటున్న పూ్యన్లు, కర్టెన్ మాటున చేతులు మారుతున్న కరెన్సీ, ఆర్తనాదాలైన అనురాగబంధాలు, దుమ్ములో, ధూళిలో కలిసిపోతున్న పచ్చని జీవితాల ప్రాణ వాయువులు, చితికిపోయిన గుండెలు, చెదరిపోయిన నవ్వులు, మాడిపోయిన చూపులు, వాడిపోయిన పూలు— జీవితానికి ఎన్ని కోణాలున్నాయో, అన్ని దృశ్యాలు శబ్ద చిత్రాలుగా, భావచిత్రాలుగా వేణుగోపాల్ కవిత్వంలో రంగు రంగుల వలయాలుగా కనబడతాయి. ఈ దేశంలో — చీకట్లో బ్రతుకుతున్న అనేకమంది జీవితాల్లో ఏ ఒక్కడి జీవితం పుష్పపథం మీది రథం కాదని, పూర్ణిమజ్యోత్స్న జలపాతం కాదని, ఏ ఒక్కడి కన్నీరు ఆనంద హాసపు సెలయేరు కాదని, చందనం పరిమళించే తొలకరి కాదని, ఈ అస్తమించని అమవసలో, సుదీర్ఘమైన కాళరాత్రిలో ఒక్కొక్కడూ సుడిగాలి దాడిలో వెలుగును కోల్పోయిన దీపమని, చీకటి సముద్రం నడుమ దిక్కులు చూస్తున్న ద్వీపమని ఈ కవి చెపుతున్నాడు.

అమ్మంగి వేణుగోపాల్ కవిత్వంలో గుండెను గుప్పెట్లో నలుపుతున్న బాధ ఉంది. బలిపీఠంమీద రక్తం రాసిన అక్షరాలను చదువుకొని ఈ నేలమీద గాలి ఎర్రబడితే తప్ప ఈ బాధకు పరిష్కారం లేదనే ఒక భావం కావ్యం అంతటా నిశ్శబ్దంగా పరచుకుంది. పొలంలో ఇంకిన కన్నీరు, గనిలో ఆవిరైన స్వేదం అగ్నిజ్వాలగా లేచి వర్తమానాన్ని భస్మం చేస్తేనే గాని : ఉజ్వల భవిష్యత్తు ఉదయించదేమో! జడానికి చైతన్యం కలిగితే, పెను నిద్దరకు మెరుపు మెలుకువ కలిగితే, గడ్డ కడుతున్న రక్తం ప్రవహించే శక్తిగా మారితే, చూపులు తూటాలై, చేతులు బాణాలై శోకాల ఛాయలు లేని లోకం సృష్టింపబడుతుంది. శాంతి పతాకం కిరీటంగా విశ్వంభర నిత్య పౌర్ణమిగా వెలిగిపోతుంది.

వేణుగోపాల్ ఎవరి వెంటా పడ్డ కవి కాదు. అతనుపయోగించిన పదాలు, భావాలు మనకీ అతనికీ కూడా అర్థమయ్యేవే. జీవితంలో లేంది ఏదీ కవిత్వంలో ఉండటానికి అవకాశం లేదు. జీవితంలోంచే కళ పుడుతుందనుకుంటే మిణుగురు నిన్నటి, ఇవ్వాల్టి, రేపటి జీవితానికి చెందిన కావ్యం. ★

సీరియల్

# మూగ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సారధి నవ్వాడు మృదువుగా.

"నేను నీ అన్ననని నలుగురిలో సగర్వంగా చెప్పుకో నివ్వు! 'సారధీ! మిస్టర్! ఏయ్!' అని పిలవకు నన్ను! నానుంచి ఎక్కడికో పారిపోవాలని ప్రయత్నించకు!" అన్నాడతడు.

అతని మాటల్లో దాగివున్న ఆవేదన, ఆప్యాయత ఆమె గుండెల్ని తాకింది. ఒక్క క్షణం మనస్సుని శపించింది చెప్పినట్లు విననందుకు. కానీ ఆ తరువాత ఏదో అనుమానం తలెత్తింది మళ్ళీ —

అతని కళ్ళల్లోకే చూస్తూ అన్నది —

"సూర్యం అని ఒకతను యిట్లాగే నన్ను బాగా నమ్మించాడు. నీలాగే కాలేజి లెక్చరరు! అగ్రహారం నుంచి నువ్వు పనిగట్టుకుని నన్ను వెదుక్కుంటూ వచ్చినట్టే అతడూ ఓ పల్లెటూరు నుంచి నాకోసమే వచ్చానన్నాడు. నేనుంటూన్న చిన్న రూమ్ నుంచి పెద్ద భవనంలోకి మార్పించాడు నా స్థానాన్ని! అడిగినవాళ్ళకి మేనత్త కూతురని చెప్పాడు. చీరలనీ సారెలనీ వద్దన్నా కొన్నాడు నీలాగే! ఏదో మంత్రం కూడా నేర్పించాడు! సంధ్యావందనాలు, జపతాపాలు మొదలెట్టించాడు నాతో! నేమా నమ్మాను! మంచివాడన్న నమ్మకంతో ఆ రోజున గది తలుపులకి గడియపెట్టడం మరిచిపోయానని తెలిసే బద్ధకంతో నిద్రబోయాను. మరునాడే రిజిస్టరాఫీసుకు వెళ్ళి దండలు వేసుకుందామని చెప్పాడు. కానీ... ఆ రాత్రి వాడు పశువులా మారి నన్ను స్పృశించబోయాడు. కేకలు పెడుతూంటే నవ్వాడు. 'నువ్వు నాకు మూడో భార్యవి' అన్నాడు. అంతే! వాడి తల పగలగొట్టి నా రూమ్‌కి పారిపోయానా అర్ధరాత్రే. పాపం! రెండు నెలల వరకు హాస్పిటల్లోనే వున్నాట్ట! చచ్చాడనుకున్నాను. కాని ఓ కాలు విరిగి బ్రతికి బయటపడ్డాడని విని విచారించాను! మీ మగవాళ్ళకి ఆడదాన్ని చూస్తేనే నాశనం చేయాలన్న ఆలోచన ఎందుకు వస్తుందట! మీ అమ్మ ఆడది! మీ అక్క ఆడది! వాళ్ళ గురించి మరో మగవాడు యిలాగే ఆలోచిస్తాడని తెలిస్తే తల పగులగొట్టుకు ఛస్తారుగదా! మరి తోటి ప్రాణి గురించి రవ్వంతైనా ఆలోచించరేమిటి?"

(గత సంచిక తరువాయి)

శశిరేఖ కళ్ళెర్రబడిపోయాయి! నల్లని గిరిజాల జుట్టుని పైకి త్రోసుకుంటూ — ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంది! గుండెల్లో ఎప్పటినుంచో మండి పోతూన్న బాధని వెల్లడి చేయకుండా వుండలేక పోయింది. అతనిగొంతులో ధ్వనించిన ఆత్మీయానురాగాలామెవూహల్ని లాలించు తున్నట్లన్పించి బాధను దాచుకోలేక పోయింది ఎప్పటిలా. "అలసిపోయినట్టున్నావు! ముందు స్నానం జేసిరా! నీ ప్రశ్న లన్నింటికీ జవాబులు చెబుతాన్లే," సారధి లేచివెళ్ళి టవలు తెచ్చి అందించాడు.

శశిరేఖ "ఐ హేట్ దిస్ వర్ల్డ్!" అనుకుంటూ బాత్‌రూమ్‌కి వెళ్ళింది "హాయ్! డియర్‌సారధీ! ఐలైక్ యు వెరీమచ్! నాకు ఎగ్‌షాంపూ యిష్టమని నీ కెలా తెలుసునోయ్! వెరీనైస్! మెనీ థాంక్స్! కమ్మని కాఫీకూడా వుందనుకుంటానే! గుడ్!" స్నానంచేసి బయటికి వచ్చిందామె సంతోషంగా, పసిపిల్లలా ఏదో యింగ్లీషు పాట పాడుకుంటూ.

"తెలుగులో మాట్లాడమ్మా! నీ కిష్టమైనవే మరికొన్ని తెచ్చాను! ఇదిగో!" అతడేదో పేకెట్ ఆమె కందించాడు.

**జరిగిన కథ — 2:** సోమయాజులు గారి మనుమరాళ్ళు విజయ, రాజ్యలక్ష్మి. సారధితో విజయ పెళ్ళి ఆగిపోయింది. సోమయాజులుగారు ఇచ్చిన డబ్బులో 5 వేలు తక్కువగా సారధి సోమయాజులుగారికి తెచ్చి ఇస్తాడు. అతని ప్రవర్తనకు ముగ్ధులయ్యారు సోమయాజులుగారు. సారధి విజయ, రాజ్యలక్ష్మిల బాధ్యతను స్వీకరిస్తాడు. సోమయాజుల గారిచ్చిన డబ్బుతో తనకూతురు సీత పెళ్ళి చేస్తుంది అరుంధతమ్మ. తన వైవాహిక జీవితం సుఖంగా లేదని సారధి చెల్లెలు సీత అతనికి ఉత్తరం రాస్తుంది. సారధి తన స్వంత చెల్లెలు శశిరేఖను సన్మార్గంలో పెట్టటకు ప్రయత్నిస్తుంటాడు.

వేడిగావున్న కాఫీ త్రాగుతూ పేకెట్‌ని విప్పింది—

"హాయ్! డికెన్స్ నావల్స్! నా కెంత యిష్టమో! యూ ఆర్‌మై బ్రదర్! రీయల్లీ మై ఓన్ బ్రదర్!" సారధి చేతుల్ని అందుకుని వుత్సాహాన్ని పట్టలేక డాన్స్‌చేస్తూ ఆప్యాయంగా నవ్వింది. ఆమె కళ్ళనిండా వెలుగే! అణు వణువూ వుత్సాహంతో వూగిపోతోంది.

"కూర్చోమ్మా! నాకు నీలాగా డాన్స్ చేయడం రాదు. కాఫీ చల్లారిపోతుంది! త్రాగు. ఆ తరువాత నీ కిష్టంవచ్చిన పుస్తకం చదువుకో మాక్సిమ్ గోర్కీ వ్రాసిన 'మదర్' కూడా తెచ్చాను చూడు!" శశిరేఖ ఓ నవల తీసుకుని అందులో లీనమైపోయింది. కాఫీకప్పు క్రింద బెట్టడం కూడా మరిచిపోయింది.

సారధి కప్పునందు కున్నాడు. అప్పుడు తలెత్తిందామె— థేంక్స్ చెప్పబోయింది. కానీ అతడు కళ్ళలోనే వారించాడు.

"నాకెందుకమ్మా నీ థేంక్స్. నేను నీ అన్నయ్యని! నీ చిన్న కోరికల్ని తీర్చడంలోనే నా కానందం లభిస్తుంది! కుర్చీ వాల్చాను! వెళ్ళు! ఇక్కడ కూర్చోలేవు!" ఆప్యాయతనిండిన అతని స్వరం మధురంగా విన్పించిందామెకు

"సారధీ! నిజంగా నువ్వు నా అన్నవేనా? నమ్మమంటావా? నా కళ్ళల్లో మెరుస్తూన్న సంతోషాన్ని చూస్తున్నావుగదా! ఇలా నా మనస్సుకి నచ్చిన పుస్తకం కూడా కొనిచ్చిన ఆత్మీయులెవరూ నాకింతవరకూ లేరు! ప్రేమగా 'త్రాగమ్మా!' అని వేడి వేడిగా కాఫీ ఓ కప్పు నా కిచ్చినవాళ్ళే లేరంటే నువ్వు కంట నీరెట్టుకుంటావేమో! కానీ యిది నిజం! నాకు ఆత్మీయుల్లేరు! నిజమైన స్నేహితుల్లేరు! నన్ను నేనే ఓదార్చుకున్నా నిన్నాళ్ళూ" శశిరేఖ కళ్ళల్లో ఆవేదన కదిలింది. మౌనంగా లోలోని కధను విప్పి చెప్పాయామె చూపులు.

"రేఖా! నాకు నువ్వూ, నీకు నేనూ తప్ప యీ ప్రపంచంలో మన కయినవాళ్ళూ, కావలసినవాళ్ళూ ఎవ్వరూ లేరమ్మా! నీ గురించి తెలియగానే హైద్రాబాదు వచ్చేశాను దాదా తమ్ముడు రహీమ్‌గారి పుణ్యమా అని నిన్ను సులభంగానే వెదికి పట్టుకున్నాను. అరుంధతమ్మగారికి నీవు ఎక్కడున్నదీ తెలియపరుస్తూ మీ దాదా తమ్ముడు చాలాసార్లు వుత్తరాలు రాశాట్ట! కానీ నా కొక్కటీ అందనీయలేదామె ఆ వుత్తరాలు చూస్తే నే నా యింట్లో క్షణం వుండనని ఆమెకు తెలుసు. దాదా వున్నంతకాలం నీ గురించి నాకేమీ తెలియదు. ఆయన మరణించిన తరువాత రహీమ్‌గారు చిన్నాన్నగారికి లెటరు వ్రాశారట నిన్ను తీసుకువెళ్ళమని. కానీ అప్పటికే చిన్నాన్న చనిపోయారు. ఆ కుటుంబానికి నేనే ఆధారం అయ్యాను! అందుకే నన్నామె యిష్టం లేకపోయినా చదివించింది కానీ నన్నో బలిపశువుని చేసి ఎవరెవరికో అమ్మాలనిచూసింది: అది నాకు

నచ్చలేదు. ఎదురుతిరిగాను ! అప్పుడు నీ గురించి చెప్పిందమ్మా !''

''మీ చిన్నాన్నగారు నీ కెపుడూ చెప్పలేదా?''

''ఆయన నేను యింటర్లో వున్నపుడు పక్షవాతం వచ్చి పోయారు. రెండు మూడుసార్లు దగ్గరకు పిలిచి ఏదో చెప్పబోయారు. అంతలో అరుంధతమ్మగారొచ్చింది. 'ఆ మాట వాడి చెవిని వేస్తే వాణ్ణి యీ యింట్లో క్షణం వుండనివ్వను !' అన్నది. అంతే, ఆయన నాకేమీ చెప్పలేదు. ఒక్కమాట చెబితే రెక్కలు కట్టుకుని వాలేవాణ్ణి ! నన్ను నమ్ము ! నాకిదంతా తెలిసింది ఆ రోజునే !''

''ఈ ప్రపంచంలో నేను నమ్మనిది మనుష్యుల్నే ! అందులో మగవాళ్లంటే నా కసహ్యం ! భయం !''

సారధి మనస్సు ద్రవించిపోయింది. శశిరేఖ అలా నిరాశగా, జాలిగా చూస్తూ 'నేను ఒంటరి దాన్ని, నాకెవరూలేరు' అని చెబుతూంటే.

''మనుష్యుల్లో వుంటూ మనుష్యుల్ని నమ్మకపోతే ఎలాగమ్మా? రేఖా ! ఒక్కమాట ...''

''ప్లీజ్ ! నన్నలా పిలవకు ! అమ్మ గుర్తొస్తుంది !'' ఆమె గొంతులో దుఃఖం కదిలిన సవ్వడి.

''నువ్వు అదృష్టవంతురాలివమ్మా ! అమ్మ నీకింకా గుర్తుంది ! నాకెంత ప్రయత్నించినా అమ్మ రూపమే గుర్తుకు రావడంలేదు !'' అతని మనస్సులో అనంతమైన వ్యధ !

శశిరేఖ రెండుమూడు నిమిషాలవరకు అతని వైపే చూస్తూండిపోయింది.

''మీ చిన్నాన్నగారు నిన్ను ఎన్నేళ్లవయస్సులో దత్తత చేసుకున్నారు ?''

''నాకప్పుడు నాలుగేళ్లు ! ఈ సంగతి కూడా ఆ అరుంధతమ్మగారి తిట్లలోనే బయట పడింది !''

''నీ పెళ్లెందుకాగిపోయింది ?''

''కట్నానికి అమ్ముడు బోవడం నా కిష్టం లేదు ! అందుకే ...''

''అదొక్కటే కారణంగాదు ! నాకు రహీమ్ దాదా అంతా రాశాడు. నీ గురించి నేనంతా తెలుసుకుంటున్నాను. అంతవరకూ నువ్వు సారధివి ! నేను శశిరేఖని ! అంతే ! అంతకు మించి అంగుళం కూడా రానీయను ! ఇదేమిటో తెలుసా ? చాకు ! చూడ్డానికి చిన్నదే ! కానీ



మనిషి ప్రాణం తీయడానికి చాలా పదునైన ఆయుధం! ఎప్పుడూ నా పాకెట్‌లోనే వుంటుంది! ఈ మాట గుర్తుంచుకోవడం మంచిది!'' ఆమె చాకుని మడిచి పాకెట్‌లో పెట్టేసుకుంది.

''నిజమే! నీకిది ఎంతో అవసరం! భద్రంగా దాచుకో! ఒక్క మాట! ఈ టైట్ పాంట్లూ, షర్టులూ మానెయ్! బోయ్ ఫ్రెండ్స్‌ని సృష్టించుకోకు. వాళ్ళతో కలిసి సినిమాలకీ షికార్లకీ వెళ్ళకు! అప్పుడు నీకీ చాకు అవసరమే వుండదమ్మా!''

''ఎందుకిలా వేదాంతం చెబుతావు నాకు?''

''వేదాంతం గాదు! ఓ ఆడపిల్ల నేర్చుకోవలసినవి యివి! మనిషికి కొన్ని నీతులూ, నియమాలూ వుండాలి! లేకపోతే విశ్వం కలత జీవితాన్ని శాసిస్తుంది! లేనిపోని వ్యసనాలకి మనిషి బానిసైపోతాడు!''

''మనిషిక్కావలసింది యీ నీతులూ నియమాలు గాదు! తినడానికీ తిండి! తల దాచుకోడాని కొంపా! కావాలి!''

''నీకా భయం వద్దిక! మనకు కావలసిన తిండికీ, బట్టకీ నేను సంపాదించగలను! నేను ఓ కాలేజీలో లెక్చరర్ని! అని గుర్తుంచుకోమ్మా!''

''నా పద్ధతులు నీకు నచ్చవు! మరి నేనంటే నీ కెందుకింత శ్రద్ధ?''

''నీ అలవాట్లు నన్ను భయపెడుతున్నాయి! నిజమేనమ్మా! పిల్లవాడల్లరి చేశాడని తల్లి అశ్రద్ధ చేస్తే యీ సృష్టిలో ఎందరో పథ విహీనులై పోయేవారు! కాస్త కోపం తెచ్చుకోకుండా వినమ్మా! బహుశా నీకు నాన్నగారి పేరు కూడా సరిగ్గా గుర్తు లేదేమో! రాజశేఖరంగారని పిలిచేవాళ్ళట అగ్రహారంలోని వాళ్ళు! ఆ రోజుల్లో ఆయన అగ్నిహోత్రులు! నియమాలూ, నిష్ఠలూ వున్న మనిషి ఆయన! ఆ రోజుల్లోనే కాంగ్రెసులో జేరి వున్న ఆస్తినంతా పంచిపెట్టేశారట. 'రాజశేఖరంగారు ఏ జన్మలోనో మహర్షి అయి వుండాలి! ఎంత భక్తి! ఎంత జ్ఞానం!'' అనుకునేవారట ఆ వూర్ది వారంతా. అలా అని ఆయన ఛాందసులేమీ గాదు. ఓ సారి ఆ వూరి

## మూగ ముత్యాలు

మునసబు గారమ్మాయి లండన్నుంచి వచ్చిందట.

''ఛీ! ఈ వెధవ పల్లెటూళ్ళో ఒక్కక్షణం కూడా వుండలేను!'' అన్నదట. ఇక్కడి వాళ్ళనే పెళ్ళాడను పొమ్మన్నదట. మునసబుగారు ఆందోళనతో నాన్నగారికి కబురంపించారట—

పాంటూ, షర్టూ, గిరజాల జుట్టూ, ఎత్తు మడమల జోళ్ళూ! ఇదే ఆమె వేషం! చీర కట్టే ఎరుగదట. అసలు కట్టను పొమ్మన్నదట! నాన్నగారు 'నువ్వు అబ్బాయివా అమ్మాయివా' అని అడిగారట.

''ఎందుకలా అడుగుతున్నారు? అబ్బాయికీ అమ్మాయికీ భేదం ఎందుకుండాలసలు?'' అని ఎదురు ప్రశ్న వేసిందట.

''ఈ సృష్టిలోనే స్త్రీకీ పురుషుడికీ భేదం వుందమ్మా! వున్నదాన్ని ఎందుకుండాలీ అన్నంత మాత్రాన పోగొట్టలేం తల్లీ! నువ్వు చీర కట్టక పోయినంత మాత్రాన మగవాడివై పోగలవా? శారీరకంగా స్త్రీ పురుషుని కంటే బలహీనురాలు! మానసికంగా స్త్రీ పురుషుని కంటే మించిన శక్తిని కలిగి వుంటుంది! స్త్రీ మనస్సు కోమలం! శరీరమూ అంతే! అందుకే యీ సృష్టి రహస్యమే నీలో పెరుగుతోందమ్మా! అంతటిగురుతరమైనబాధ్యతని స్త్రీ కప్పగించాడా దేవుడు! మరంత ఉన్నత స్థానంలో నిలబడిన స్త్రీ కొన్ని నియమాల్నీ, ఆచారాల్నీ, నిష్ఠల్నీ ఆచరించక తప్పదు గదమ్మా! వెలుగుని ప్రసాదించే దీపానికి, శుచీ, శుభ్రతా అవసరం! ఆ జ్యోతి చుట్టూ రక్షణగా ఓ చిమ్నీ వుండాలి! అది స్వచ్ఛంగా తళతళ లాడుతూండాలి! అప్పుడే వెలుగు నాలుగు వైపులకీ విరజిమ్మబడుతుంది! ప్రాణ శక్తి వెలుగు వంటిది! అలాంటి, ప్రాణ శక్తి నీలో పెరిగి ఆకృతిని దాల్చి యీ లోకంలో ప్రవేశిస్తుంది! అందుకే 'మాతృ దేవోభవ!' అన్నారు! 'పోతే నువ్వు మళ్ళీ లండన్ వెళ్ళిపోతానన్నావుట! మన అగ్రహారంలో వున్న వారే లండన్లో వున్నది! అక్కడ దానికేమీ రంగుల్లేవు. ఈ సూర్యుడే అక్కడున్నాడు! అక్కడా యిలాంటి నేలమీదే నడుస్తావు! మనిషిక్కావలసింది గాలి, నీరూ, ఎండా, కడుపు నిండడానికి ఆహారం! అవి అగ్రహారంలోనూ దొరుకుతాయమ్మా! పైగా యిక్కడి గాలి నీకు తెలిసిన పాటలు పాడుతుంది. నీ భాషలో మాట్లాడుతుంది. ఇక్కడి వెన్నెల్లో నీ మనసు కెన్నడూ దిగులవ్వించదు! ఎందుకంటావ్? నువ్వు మీ అమ్మని ప్రేమించినట్లు మా అమ్మని ప్రేమించలేవు. మీ అమ్మలా మా అమ్మ నిన్ను ప్రేమించగలదా? ఆలోచించు? నిన్ను కని పెంచిన అమ్మకన్నా మించిన అమ్మ నీ కా లండన్లో దొరికితే వెళ్ళమ్మా!'' అని చెప్పారట నాన్నగారు. మరునాడే ఆ అమ్మాయి నాన్నగారికి కబురంపి! ''అంకుల్! నేను లండన్ వెళ్ళడం లేదు! మీకు వేల నమస్కారాలు?'' అన్నదట!

''నీ క్కథలు చెప్పడం బాగా వచ్చు నను కుంటాను! చాలా యింటరెస్టింగ్‌గా చెప్పావు నేనెప్పుడూ చూడని మీ నాన్నగారి గొప్పతనం నా బుర్రకెక్కదు! అందువలన నా కొరిగిందేమీ లేదు. నువ్వెన్ని చెప్పినా మీ నాన్న పైన నాకు భక్తీ, భయం, గౌరవం ఏర్పడవు! నా వేష భాషల్ని నీ కోసం, మీ నాన్న గొప్ప కోసం మార్చుకోలేను! నా కున్న స్నేహితు లందరూ హై క్లాస్‌వాళ్ళు! వాళ్ళ పొసైటీ వేరు! వాళ్ళంతా మోడరన్‌గా వుంటారు! అందరం కలిసి బొంబే నుంచి ఢిల్లీ దాకా వెళ్ళొచ్చాము. ఓ ఫ్రెండుతో లండను కూడా వెళ్ళి ఆరు నెల లుండి వచ్చాను. నాక్కావలసిన ప్రతి పైసా వాళ్ళే యిచ్చారు!'' శశిరేఖ గర్వంగా చెప్ప సాగింది.

''అది వాళ్ళ అంతస్థుని చాటుకోవడం కోసం చేశారమ్మా!''

''కావచ్చు! ఇనాళ్ళూ నువ్వు అగ్రహారంలో మీ నాన్న గొప్పతనం చెప్పకుని బ్రతికావ్! నేను...నా కెవరి గొప్పతనమూ అండగాలేదు! దాదా నాకు పదహారు నడుస్తున్నపుడు చనిపోయాడు. పోయేముందు అగ్రహారం కబురు






చేశాడు. కానీ ఎవ్వరూరాలే దక్కడినుంచి. అనాథాశ్రమంలోచేరి పొట్టనిండక రెండు మూడు సార్లు మా క్లాసుపిల్లల పుస్తకాల్లోనుంచి డబ్బులు కొట్టేశాను— ఆఖరికి వాళ్ళ పుస్తకాల్ని కూడా దొంగిలించి అమ్ముకున్నాను. అది దొంగ తనం అని నే ననుకోలేదపుడు! వాళ్ళందరూ కమ్మని ఫలహారాలు తీనేవాళ్ళు! అన్నం కూడా కడుపునిండా దొరక్క నేను నా ఆకలిమంటని చల్లార్చుకోడానికి ఓ వుపాయం వెదుకున్నానను కున్నాను. ఆ తరువాత బాగావున్న వాళ్ళతో స్నేహం నటించాను. ఇంటరు వరకు దొంగతనా లతో అబద్ధాలతో నా పొట్ట నింపుకున్నాను. ఆ తర్వాత స్టైపు నేర్చుకున్నాను. 'స్టైపుకు డబ్బులెక్కడివి,' అని అడక్కు! వింటే నీ తల సిగ్గుతో వాలిపోతుంది! ఆ వయస్సులోనే నేను వుద్యోగంజేశాను. చాలాసార్లు ఆఫీసులుమారాను. విసుగెత్తి 'బాయ్ ఫ్రెండ్స్'ని ఆహ్వానించాను. రాజా! సూర్యం! విశ్వం! గోపాల్! రమణి! రాగిణి! యిలాంటి వాళ్ళెందరో నా అందం చుట్టూ ప్రదక్షిణలుచేశారు! నా ఫేషన్లుచూసి లండనునుంచి దిగివచ్చానని మెచ్చుకునేవాళ్ళు! నా కయిన ఖర్చంతా భరించేవాళ్ళు! నాకు ప్రేమ లేఖలు రాసేవాళ్ళు! కొందరు చెప్పుదెబ్బలు తిన్నారనుకో! శ్రుతిమించి రాగానబడ్డ నాళ్ళని జైళ్ళ క్కూడా పంపించాను! ఈ శశిరేఖంటే కొందరికి హడలు!''

ఆమె నవ్వింది. కానీ కళ్ళల్లోమెరిసిన అశ్రు బిందువులు ఆ నవ్వులోని కాంతుల్ని మ్రింగి వేశాయి. సారథి ఆ కళ్ళల్లోని తడినిచూసి తల వంచుకున్నాడు మౌనంగా.

ఆమె ఎంతో సేపటివరకు ఏమీ మాట్లాడ లేక పోయింది. కిటికీలో నుంచి కన్పిస్తూన్న చీకటివైపే చూస్తూండిపోయింది.

''నేనూ నీలాగే ఎన్నో అవమానాల్ని భరించానమ్మా! మగవాణ్ణి గనుక వాటితాలూకు దుఃఖాన్ని గుండెల్లోనే భద్రంగా దాచుకున్నాను. చిన్నాన్న నిజంగా నీలకంఠశాస్త్రి! అమ్మ ......... అదే......... నన్ను పెంచు కున్న అరుందతమ్మగారు నన్నో పరమశత్రువులా పెంచింది. తిట్టని క్షణంలేదు! నన్నవమానిస్తే గానీ ఆమెకు నిద్రబట్టేదిగాదు! 'వీడిది రాక్షసుడి తిండి!' అనేది ఒక్క ముద్ద ఎక్కువతింటే. కాస్త ఆలస్యంగాలేస్తే 'ఈ బండవెధవ కుంభ కర్ణుడిలా నిద్రబోతాడు! బకాసురుడిలా బళ్ళ బళ్ళ తింటాడు!' అని దీవించేది. గుండెల్లో వున్న నా పసితనం ఏడ్చేది. కానీ పైకిమాత్రం నవ్వేసి వెళ్లిపోయేవాణ్ణి! చిన్నాన్న చాటుగా పిలిచి డబ్బులిచ్చేవారు. 'అది నిన్ను కడుపునిండా తిననీయదు బాబూ! నాలుగరటిపళ్ళు తినిరా! పో!'' అనేవారు! ప్రతి శనివారం నాకు ఒంటి పూట భోజనమే! రాత్రికి వాళ్ళు ఏదోఫలహారం తినేవారు! నేను ట్యూషన్నుంచి యింటికి వచ్చేసరికి తలుపులు మూసివేసేది. తలుపు తీయమని పిలిస్తే 'ఒక్కనాటికి చావవులే పడుండు! ఈవేళ శనివారం! పొట్టనిండా మెక్కి పశువులా పడుందామనుకోకు!' అనేది. ఆకలితో నిద్రబట్టేది గాదు! చలిలో వణికి పోతూ ముడుచుకుని నిశ్శబ్దంగా ఏడ్చేవాణ్ణి! సీత పుట్టిన తరువాత నా బాధల్ని పంచుకోడానికి ఓ చిన్న నేస్తం దొరికిందని నా మనస్సు సంతోష పడింది! ఆ తరువాత యిద్దరం అన్నాచెల్లెళ్లమే గాక మంచి స్నేహితులమైపోయాం!''

''ఆ అమ్మాయి నీకాస్త కడుపునిండా తిండి పెట్టి వుంటుంది. అందుకే స్నేహంజేసి వుంటావ్!'' శశిరఖలోని యీర్ష్య భగ్గున మండిపోయింది.

''నాకెవరున్నారు? సీతలా! గీతలా! ఎవ్వరూ లేరు!'' ఆమె మనస్సు గొణిగింది.

''నిజమే! తాను తినకుండా నాకు పెట్టేది వాళ్లమ్మ పెట్టినవన్నీ. మళ్లీ ఆకలవుతుందని వెళ్లి తినేది. అమ్మతో కలిసి హరిశ్చంద్రుడి నాటకానికివెళ్లేది! హరికథలకి వెళ్లేది! కానీ అరగంటలో తిరిగి వచ్చేది. ''ఒరేయ్! అన్నయ్యా! నీకు భయం వేస్తుందని వచ్చేశానురా! ఇదుగో! కొబ్బరిచిప్ప! బెల్లం కూడా కొనుక్కొచ్చాన్లే! సాయంత్రం అమ్మ గుళ్లో అడిగి తీసుకుని నాకిచ్చింది! అమ్మకి చెప్పకు! చంపేస్తుంది! మొన్న చెప్పిన కథ మళ్లా చెప్పన్నయ్యా! బావుంది! నాకు నిద్రొచ్చేవరకు చెప్పాలి మరి! లేకపోతే నేను నీ జట్టుండను!'' అని నన్ను ఓదార్చేది. నా వూహల్ని లాలించి సంతోషాన్ని పంచిపెట్టేది.

ఆపైన శశిరేఖ పెదవి విప్పలేదు. పుస్తకం చదువుతూ తలెత్తనేలేదు చాలాసేపటివరకు.

చాలాసార్లు సారథిని మాటలతో గాయ పరిచింది. ఏం చెప్పినా వ్యంగ్యంగా నవ్వుతూ విమర్శించేది! అతనికి కోపం వస్తుందని భావించి అలా నవ్వేది. కానీ అతడు తానమభవించిన బాధనీ, సంతోషాన్నీ మరింత శ్రద్ధగా విన్పించే వాడు. ఉన్నట్టుండీ ఓసారి ఆమె రెండు మూడు రోజులవరకు యింటికే రాలేదు.

సారథి ఆమె పనిజేస్తూన్న ఆఫీసుకు వెళ్ళాడు. సెలవుపెట్టి ఢిల్లీ వెళ్ళిందని చెప్పారు ఆఫీసులోవాళ్ళు!

''ఎవరితో వెళ్ళిందో చెప్పగలరా దయచేసి?'' ఓ వయసు మళ్ళినాయనని అడిగాడు అభిమానం చంపుకుని.

''చూడు బాబూ! నువ్వా అమ్మాయికి ఏమౌతావో మరి! తెలియదు! అయినా అడిగావు గనుక చెబుతున్నాను. నాలుగు కాలాలు చూసినవాణ్ణి! ఈ అమ్మాయికి పిచ్చిఫేషన్లంటే అమితమైన మోజు! క్లబ్బుల కెళ్ళడం, మగవాళ్ళతో కలిసి డాన్సులు చేయడం, కావాలను కున్నపుడు విస్కీ త్రాగడం — ఆ అమ్మాయికున్న సరదాలు! అదే నాగరికత అనుకుంటోంది పాపం! ఒంటికి చాలీచాలని బట్టలు వేసుకోవడమే నాగరికత అన్నట్లుంటుందా శశిరేఖ! కానీ అది ఆడపిల్లల్ని నాశనం చేస్తుందని ఆ అమ్మాయికి నా మాటగా చెప్పు నాయనా!'' ఆయన సలహా యిచ్చాడు

''ఆ! నీ ప్రశ్నకి జవాబు చెప్పనేలేదింతకీ! శశిరేఖ, శ్రీనివాస్ అన్న మా ఆఫీసరుగారితో కలిసి ఢిల్లీ వెళ్ళింది! శశిరేఖని అతగాడు ప్రేమిస్తున్నాట్ట! ఆఫీసులో వున్నవాళ్ళందరికీ యీ అమ్మాయిని చూస్తేనే భయంగా వుంది! మాటలతోనే తలలు వంచుకునేట్టు చేస్తుంది! ఈ శ్రీనివాస్ యీమె కెన్నోవాడో మరి! యిదినాయనా వున్న కథ!''

సారథి ముఖాన నెత్తురుచుక్క లేకుండా పాలిపోయిందా మాటలు వినగానే.

''ఎంత పిచ్చిదయిందీ రేఖ? తాను బ్రతుకుతున్న సమాజంలోని కట్టుబొట్లని కాదని ఎందుకిలా పరిహసిస్తోంది?''

ఇల్లుచేరుకున్నా అతని మనస్సు మనస్సులో లేదు.

అస్తవ్యస్తంగా వున్న శశిరేఖ పుస్తకాల్ని సర్దుతూంటే అతనికో వుత్తరం కన్పించింది. సారథి గురించి వ్రాసింది! అతడు నవుకున్నాడు చదువుతూ—

''డియర్ రావ్!

నా కోసం ఏమైనా చేస్తానన్నావోసారి! అందుకే వ్రాస్తున్నానిపుడు. నీకు అగ్రహారంలో బంధువు లున్నారని చెప్పేవాడివి! ఆ వూళ్ళో నీలకంఠ శాస్త్రిగారని ఓ బడిపంతులున్నాట్ట! ఆయన చనిపోయి అయిదారేళ్ళయింది! ఆయనకో కొడుకూ, కూతురున్నారని తెలిసింది! ఆ బడి పంతులుకి ఓ అన్నయ్య వున్నాడు. ఆ మహాను భావుడు తమ్ములుంగారికి కన్నకొడుకుని దత్తత యిచ్చాట్ట! రాజశేఖరంగారని పేద్ద కాంగ్రెసు లీడరట ఆయన ఆ రోజుల్లో! ఆ అబ్బాయి పేరు సారథి! ఈ సారథి ఆ రాజశేఖరంగారి కుమారరత్నం అవునో కాదో తెలుసుకుని వ్రాయి! ఉన్నట్టుండి ఆ సారథి అన్న మహా శయుదు నన్ను వెదుక్కుంటూ వచ్చాడు! ఎందుకోమరి!

నా కు అన్నయ్యనంటాడు 'అమ్మా! చెల్లెమ్మా!' అంటాడు మాటకి ముందు! మనిషి చూడ్డానికి నీ లాగా అందంగానే వుంటాడు. కానీ సరిగ్గా షర్టు కాలరు కూడా మడుచుకోవడంరాదు. మన తెలుగు పాఠాల్లో వచ్చే ప్రవరాఖ్యుడిలా మాట్లాడతాడు.

చీకటిపడకముందే యిల్లు చేరుకుంటాడు. బుద్ధిగా ఆడపిల్లలా వంటా వార్పూ అన్నీ స్వయంగానే చేస్తాడు. ఏ కూర చేసినా కమ్మగా వుంటుంది. కాలేజిలో లెక్చరరు! సలీమ్ అన్న స్నేహితుడున్నాడు! అంతే! అతనే యీ

ప్రవరాఖ్యుడికి తెలిసిన ప్రపంచం ! ఆ సలీమ్ కి కారూ, మేడా, బట్టల షాపులూ, కావలసినంత డబ్బూ దస్కం అన్నీ పుష్కలంగా వున్నాయి ! కానీ యీ స్నేహితులిద్దరూ ధైర్యంగా తలెత్తి ఓ ఆడపిల్లతో కూడా మాట్లాడి ఎరుగరింత వరకు ! ఆడపిల్ల కన్పించిన వెంటనే తక్కున తల వంచుకుని పరుగెట్టుకు పోతారు ! అంత పిరికి వాళ్ళు ! పూర్వ జన్మలో వీళ్ళిద్దరూ కుందేళ్ళయి వుంటారు ! ఆ సలీమ్ అన్న యువరాజుగారే యీ ప్రవరాఖ్యుడికి పదిహేను వేలు అప్పు యిచ్చారట ! అదీ పకడ్బందీగా నోటు వ్రాయించుకుని. ప్రతి నెలా ఫస్టు తారీఖునే వెళ్ళి మూడు వందలిచ్చి వస్తాడీ సారదిగారు. సలీమ్ నోటు చింపబోయాట్ట ధైర్యంగా ! సారధిగారు అడ్డుపడ్డారట ! "ఒరేయ్ ! నన్ను డబ్బుతో కొంటావుటరా ?" అన్నాట్ట.

"అయితే వడ్డీతో సహా యివ్వరా ! మన స్నేహానికి గుర్తుగా ఓ తాజమహలు కట్టించు తాను !" అన్నాట్ట ఆ సలీమ్ గారు.

"మహల్లో వుండేది ఒట్టి సౌందర్యమేరా ! స్నేహాన్ని ఏ మహల్లోనూ బంధించలేం ! అది నిరాడంబరమైన మనస్సుకే అంకితం!" అన్నాట్ట మా సారధి అన్నగారు !

ఆ ! అసలు మాట మర్చేపోయాను, ఆ పదిహేను వేలూ, సారధిగారికి కాబోయి ఆగిపోయిన భార్యామణి, విజయ కిచ్చారట. వాళ్ళమ్మగారు ఆ కట్నం తాలూకు యిరవై వేలు తీసుకుని కూతురి పెళ్ళి చేసిందట ! ఈ సారధిగారిని యింట్లో నుంచి వెళ్ళగొట్టిందట ! ఈ మహాశయుడు సలీమ్ గారి వద్ద స్నేహాన్ని వారధిగా గట్టి అప్పుగా తీసుకు వెళ్ళాట్ట ! ఇదీ వున్న కథ! ఇంత వరకూ జరిగిన కథ ! ఇదంతా నిజమో కాదో తెలుసుకుని రా !

నాళ్లేమో బ్రాహ్మణ దేవతలు. నేనేమో అబ్దుల్ దాదా మనుమరాల్ని ! దాదా స్వర్గం చేరుకున్న తరువాత హాస్టల్లో జేరాను ! అమ్మ కూడా దాదా దగ్గరే వుండేది ! అమ్మపేరు రజియా ! కానీ దాదా అపుడపుడు 'రాజీ'అనికూడా పిలిచేవారు ! అమ్మతో ఓ మనిషి తెలుగులో మాట్లాడ్డం గుర్తుంది కొంచెంగా. ఆ మనిషే మా 'నాన్నగారని' దాదా చెప్పాడు. ఆ మనిషి నాకెంత ప్రయత్నించినా గుర్తుకు వచ్చేవాడు గాదు. తెలుగులో మాట్లాడ్డం అమ్మకి బాగా వచ్చేదిగాదు ! నేనూ యిబ్బందిపడేదాన్ని తెలుగు మాట్లాడ్డానికి అప్పట్లో ! మీరంతా నా తెలుగు భాషని విని 'బావుంది ! నీ గొంతులో తెలుగు క్రొత్త క్రొత్త అందాల్ని సంతరించుకుంటోంది!' అని ప్రశంసించేవాళ్ళు ! ఇలా మరో కులంలో పెరిగిన నేను ఆ రాజశేఖరంగారి కూతురినెలా అయ్యానో నా కర్థంగావడం లేదు రావ్ !

ఈ సారధి మా అమ్మకి కొడుకెలా అయ్యాడో అసలర్థంగావడంలేదు! అప్సరసలాంటి అందాలరాశి జీవితంలోకి అడుగుపెడుతూంటే వద్దని, నాకోసం పరుగెట్టుకొచ్చాట్ట యీ బ్రాహ్మణ వరేణ్యుడు ! వాళ్ళమ్మనీ, ప్రాణంలో ప్రాణమైన చెల్లెలు సీతనీ వదులుకుని వచ్చాట్ట! ఇంత ప్రేమ యీ మహాశయుడికి— యింత హఠాత్తుగా ఎందుక్కలిగిందో మరి ?! అంతా పద్మవ్యూహంలా వుందిగదూ ? ఈ సారధి సూర్యంలా నమ్మించి తడిగుడ్డతో గొంతుకోసి పారిపోయే రకమేమోనని భయం వేస్తోంది రాత్రుళ్ళు !

నన్ను వెదుక్కుంటూ ఓ ఆత్మీయుడు వచ్చాడనేసరికి నా మనస్సు సంతోషంపట్టలేక అపుడపుడు అతనిమాటల్ని నమ్ముతుంది ! ఆ మనిషిలోని నిరాడంబరతకి, నిష్కల్మషంగా మాట్లాడేతీరుకీ నా వూహలు ప్రణమిల్లుతాయి భక్తిగా ! కానీ మళ్ళీ లోలోన భయం ! అమ్మ గుర్తుకొస్తుంది ! గడిచిపోయిన సంఘటనల తాలూకు అనుభూతులు తరంగాల్లా లేచి పడతాయి ! నా మనస్సు ఏడుస్తుందపుడు ! ఆ తరువాత నిద్రబట్టదు ! నీకు గుర్తుండే వుంటుంది ! నే నెంత చిన్న గదిలో వుండేదాన్నో ! ఆ చిన్న గదిలో చీకట్లో, ఒంటరిగా కళ్ళు మూసుకుని ఏమేమో ఆలోచిస్తూ గడిపివేశా నిన్నాళ్ళూ !

పగలంతా ఆఫీసూ, స్నేహితులూ, సినిమాలూ ! సరిపోయేది ! కానీ రాత్రి వస్తోందంటే భయంతో నా మనస్సు వణికిపోయేది ! ఎవ్వరూలేని ఆ గదిలో ప్రతిరాత్రీ ఒంటరిగా పడుకుని భయంతో ముడుచుకుపోయే నా మనస్సు ఆ గదిని చూడగానే చావాలనుకునేది ! ఈ ప్రపంచం మీద తిరగబడి యుద్ధం చేయాలన్పించేది, ఆ చీకటినీ, అంత భయాన్ని భరించలేకే యీ సారధిని నమ్మాను ! అయినా నా జాగ్రత్తలో నేనుంటున్నానుకో! ఈ మహాశయుడు నేను యిన్నాళ్ళు నానాకష్టాలుపడి సంపాదించుకున్న పదివేలకోసం వచ్చాడేమో ! నాకేమీ తెలియడంలేదు రావ్ !

కాస్త మనిషిలా ఆలోచించుతావు గనుక నీకిదంతా వ్రాస్తున్నాను ! అదీగాక—ప్రతిమనిషీ ఎప్పుడో ఒకప్పుడు ఓ మనిషికో, లేక ఏ రాతికో రప్పకో, మనస్సువిప్పి చెప్పుకుని తీరతాడు గదా !

నాకు అన్ని వివరాలతో లెటరు వ్రాయి ! వీలయితే అగ్రహారం వెళ్ళి తెలుసుకునిరా ! ఆ ! మీ పాపకు నా పేరు పెట్టావా ? ఇంకా నీ మనస్సుపైన నా నిషా నాట్యం చేస్తోందా ? నా అందం నిన్ను పిచ్చివాణ్ణి చేసిందని నాకు తెలిసే నిన్ను దూరంగా వుంచాను ! నీక్కావలసింది నేను గాదు ! నాలోని అందం ! అందుకే నీ ప్రేమ నాకు నచ్చలేదు. అదీగాక నీక్కూడా కుందేలు లక్షణాలున్నాయి ! కులం, గోత్రం, పుణ్యం, పురుషార్థం అంటూండేవాడివి ఎప్పుడూ ! అలా కులాల్ని గోత్రాల్ని పట్టుకుని వ్రేళ్ళాడే పిరికివాళ్ళంటే నాకు వళ్ళు మంట ! అందుకే నిన్ను 'ఓ గీత గీచి' నిలబెట్టేశాను. నీలాంటివాడే వర్మ కూడా ! పెళ్ళి మాట రాగానే పెట్టెబేడా సర్దుకుని రైలెక్కేశాడు ! 'అయినా ఆ నల్లకోతిని' నేనెలా ప్రేమించగలననుకున్నాడు ?! ఫూల్ ! ఒట్టి యిడియట్ !

'నీవన్నట్లు శశిరేఖ లాంటి అప్సరస పుట్టింది వర్మ లాంటివాళ్ళ కోసంగాదు !' మీరందరూ కలిసి నాలో ఆత్మవిశ్వాసాన్ని పెంచారోయ్ !

రావ్ ! మొన్న నువ్వు పంపిన రెండు వంద లందాయి ! థేంక్స్ ! ఢిల్లీలో ఓ రోజు ఖర్చుకు వచ్చాయి ! సుందరి రాగానే నీ రెండు వందలూ యిచ్చేస్తాన్లే !

రాఘవరావు కన్పించాడు మొన్న మద్రాసులో! ఇంకా పెళ్ళి జేసుకోలేదుట ! నా పెళ్ళయ్యాకే తాను ప్రయత్నంలోకి దిగుతాడట ! పూర్ ఫెలో! ఆఫ్టరాల్ ఓ చిన్న గుమాస్తా ! రాజకుమారి లాంటి యీ రేఖ కోసం కలలు గంటున్నాడింకా!

విశ్వాన్ని అడిగానని చెప్పు ! అతని తెలుగు పద్యాల్నీ ఆ కవిత్వాన్నీ తలుచుకుని నవ్వుకుంటున్నానని వ్రాయి.

వీలయితే నువ్వోసారి వచ్చి వెళ్ళు !

వచ్చేముందు ఫోను చేస్తే ఎక్కడుండేదీ చెబుతాను !

నీ

శశిరేఖ"

( ఇంకా వుంది )





# సినిమా



శోభన్‌బాబు, జయసుధ 'ఇద్దరు దొంగలు'

## అత్యాధునికమైన కెమెరాతో "మూడు ముళ్ళు" చిత్రీకరణ

"ప్రముఖ తమిళ దర్శక రచయిత కె భాగ్యరాజా రాసిన ఈ చిత్ర కథకూడా పల్లె వాతావరణానికి చెందినది . . దారి పొడుగునా గలగల పారే గోదావరి పిల్ల కాలువలు, పచ్చని చేలు, కొబ్బరితోటలు గల మాగాం గ్రామ పరిసరాలలోనే జూన్ 27 నుంచి జూలై నెలాఖరు వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగించాం," అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో రూపొందిన శ్రీ సారథీ స్టూడియోస్ "మూడు ముళ్ళు" చిత్రంలో చంద్రమోహన్, రాధిక, గీత, పూర్ణిమ (గెస్ట్), ప్రభాకరరెడ్డి, సుత్తి వేలు, సుత్తి వీరభద్రరావు, నళినీకాంత్, డబ్బింగ్ లక్ష్మి, విజయలక్ష్మి, శకుంతల, మాస్టర్ చక్రవర్తి, మాస్టర్ ఆలీ, మాస్టర్ చిట్టిబాబు నటించారు. రాజన్ – నాగేంద్ర సంగీత దర్శకత్వంలో వేటూరి, జ్యోతిర్మయి గీతాలు రాశారు. గోపాల్ రెడ్డి ఛాయాగ్రాహకుడు. గౌతమ్‌రాజు సంకలనకర్త. "పశ్చిమ జర్మనీ నుంచి ఆంధ్రప్రదేశ్ చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ తెప్పించిన 'యూరి–త్రి' కెమెరాతో తొలిసారిగా ఈ చిత్రాన్ని షూట్ చేశాం. హైదరాబాద్‌లో కలర్ ప్రాసెసింగ్‌ను నెలకొల్పిన జెమినీ కలర్ లేబరేటరీలో ప్రాసెసింగ్ జరుగుతుంది," అని తెలియజేశారు నిర్మాత పి శశిభూషణ్. ఈ చిత్రం ఎ వి ఎం సమర్పణ

## "రోషగాడు" లో పౌరుషం

శ్రీకాంత్ (చిరంజీవి) చెల్లెలు బాల (ఇందిర) స్కూల్ నుంచి వస్తూంటే, ఇద్దరు రౌడీలు అఘాయిత్యం చేయబోయారు వాళ్లను శ్రీకాంత్ కాపాడాడు. ఈ విషయం తెలిసి మర్నాడు శ్రీకాంత్‌ను శైలజ (మాధవి) అడిగింది "వాళ్ళెవరో తెలుసుకున్నావా ?"

"వాళ్ళకింకా నూకలున్నాయి కాబట్టి బ్రతికిపోయారు. నా చెల్లెలిమీద అఘాయిత్యం చేసిన వాళ్ళను ఈ ఊళ్ళో బ్రతకనిస్తానా ?" అని శ్రీకాంత్ ఆవేశంతో అంటున్నప్పుడు శైలజ తండ్రి రాఘవయ్య (టి సత్యనారాయణ) వచ్చి, "అదే పౌరుషం నాకుంటే ? . నీ చెల్లెల్ని ఎవడో బలవంతం చేశాడన్న బాధ నీకుంటే, నా కూతుర్ని మోసం చేశావన్న బాధ నాకుండాలి నువ్వు తీసుకున్న నిర్ణయమే నేను తీసుకుంటే ?" అన్నాడు.

శైలజ మనస్సు చివుక్కుమంది. "అదేమిటి నాన్నా! శ్రీకాంత్ నీకు మేనల్లుడేగా !"

"కావచ్చు కాక, వాడి తాహతేమిటి, నా తాహతేమిటి ? ఈ ఊళ్ళో ఉన్న పొలాలకు ఆసామిని నేను నా పొలాల్లో పనిచేసే కూలివాడు వాడు," అన్నాడు రాఘవయ్య.

శ్రీకాంత్‌కి కోపం ఆగింది కాదు "మామయ్యా !"

"నోరు ముయ్యరా ! మీతరం మనుషులు ప్రేమ అనే రెండక్షరాల పదాన్ని నేర్చుకుని, వయసులో ఉన్న ఆడపిల్లలను వలలో వేసుకోవడం నేర్చుకున్నారు నిజంగా నీకు నా కూతురు కావాలనుకుంటే, నా స్థాయికి ఎదిగి, అప్పుడు వచ్చి అడుగు– ఆలోచిస్తాను ఊఁ !" అంటూ రాఘవయ్య వెళ్లిపోయాడు

రోషంతో శ్రీకాంత్ ముఖం ఎరుపెక్కింది

పింజల నాగేశ్వరరావు నిర్మించిన పి. ఎస్. ఆర్ పిక్చర్స్ "రోషగాడు" చిత్రానికి కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.





'పోలీస్ వెంకటస్వామి'
దాసరి నారాయణరావు, జయమాలిని

# విశేషాలు

-జి. వి. జి.

## మాదాల "స్వరాజ్యం" చిత్రానికి 'క్లీన్ – ఎ' సర్టిఫికేట్ !

"అటు సూర్యుడు ఇటు ఉదయించాడా ?" అనిపించింది చిత్ర పరిశ్రమలో చాలామందికి — మాదాల "స్వరాజ్యం" చిత్రం ఇదివరకటి ఆయన చిత్రాలకు మల్లే ఇబ్బందులేవీ ఎదుర్కోకుండా సెన్సార్ వారి హస్తముద్ర పొందిందని తెలియగానే. కథ, స్క్రీన్ ప్లే, నిర్మాణ సారథ్యం వహించిన మాదాలతో పాటు మురళీమోహన్, చక్రవర్తి, శ్యామలగౌరి, కె. విజయ, నీలవేణి, పుష్పకుమారి, అత్తిలి లక్ష్మి, కల్పనారాయ్, జయశీల, వంకాయల, జీవా, నర్రా, నల్లూరి వెంకటేశ్వర్లు, శశిమోహన్, వీరభద్రరావు, కోకా సంజీవరావు, మిఠాయి చిట్టి, బాబూరావు, ఎం. పి. ప్రసాద్, తూనుగుంట, పరమానందం ముఖ్య భూమికలు నిర్వహించారు. కాగడా శర్మ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, [illegible]



'ఉక్కు మనిషి' కృష్ణంరాజు, రాధిక

ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. ఆర్. పిలిప్స్ నిర్మించే "పోరాటం" చిత్రానికి జూలై 1న తొలి గీతం ధ్వని ముద్రితమైంది. కృష్ణ, జయసుధ, చంద్రమోహన్, రావు గోపాలరావు, గొల్లపూడి, పూర్ణిమ, అన్నపూర్ణ పాత్రధారులు. పరుచూరి సోదరులు సంభాషణల కర్తలు.

## అమర కవి శ్రీశ్రీపై చైతన్య చిత్రవారి చిత్రం

మహాకవి శ్రీశ్రీ జీవితాన్ని, సంపూర్ణ వ్యక్తిత్వాన్ని, సాహిత్య విశ్వరూపాన్ని వాస్తవికంగా, సమగ్రంగా తెరకెక్కించడానికి చిత్తశుద్ధితో కృషిచేస్తామని నిర్మాత జి. రవీంద్రనాథ్ తెలియజేశారు. మహాప్రస్థాన గీతాలు ఈ చిత్రానికి

## ఎ. ఎన్. ఆర్., పి. సి. రెడ్డి కాంబినేషన్‌లో చిత్రం

"జూలైలో పాటలన్నీ రికార్డవుతాయి. ఆగస్టు 28 నుంచి షూటింగ్," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బి. గోపాలరెడ్డి నిర్మించే కృష్ణ క్రియేషన్స్‌వారి చిత్రంలో ఎ. ఎన్. ఆర్.; జయప్రద, సత్యనారాయణ, గొల్లపూడి, గిరిబాబు, అల్లు రామలింగయ్య, ముచ్చెర్ల అరుణ, అన్నపూర్ణ పాల్గొంటారు. పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు. చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, అంకిరెడ్డి కూర్పుతో చెన్నారెడ్డి నిర్మాణ సారథి.

## "మేఘసందేశం" యూనిట్‌కు 'కళాసాగర్' ఘన సన్మానం

1982 సం॥- జాతీయ అవార్డులు 4, రాష్ట్ర ప్రభుత్వ అవార్డులు 9 తో ఘనత పొందిన దాసరి మహత్తర సృష్టి "మేఘసందేశం" యూనిట్‌ను మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సమితి 'కళాసాగర్' ఇటీవల భారీ ఎత్తున సన్మానించింది.




"చిత్రంలో నా పాత్రను అంత తేలిగ్గా పోషించటానికి కారణం – నిర్మాత నాకు డబ్బులివ్వలేదు !"

## ఒకే షెడ్యూల్‌లో పూర్తయిన తొలి తెలుగు చిత్రం !

"ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తి చేస్తాం," అని ఇటీవల ఎందరో నిర్మాతలు తెలియజేయడం మామూలైపోయింది. తొలుదొల్త ఒకే షెడ్యూల్లో పూర్తయిన తెలుగు చిత్రం రాజలక్ష్మి పతాకంలో సుందర్‌లాల్ నహతా, డూండీ నిర్మించిన "రక్త సంబంధం". 1962 లో తయారైంది. ఎన్. టి. ఆర్., సావిత్రి నాయకానాయికలు. వి. మధుసూదనరావు దర్శకుడు... ఆ రోజుల్లో చిత్ర పరిశ్రమలో ఎవరినోట విన్నా ఇదే మాట– "ఆర్టిస్టులందరి కాల్షీట్లూ తీసుకొని, ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తి చేయడమేమిటి? డూండీగారు ఇలాంటి పని ఎందుకు చేశారు చెప్మా ! ఇలాంటి విపరీతం ఇంతవరకు కనీవినీ ఎరుగం సుమా ! కొన్ని నెలల తరబడి పూర్తి చేయాల్సిన షూటింగ్‌ను ఏకబిగిన పూర్తి చేయడమా !" అని విస్తుపోయిన వారిని మరింత చకితుల్ని చేసిన విషయం ఆ చిత్రం అఖండ విజయాన్ని సాధించడం !



'ఎందుకీ ఆడబ్రతుకు'లో సాయిచంద్, రోహిణి

## "ఈ పిల్లకు పెళ్ళవుతుందా" లో మీ ఇంట్లో అమ్మాయిలున్నారా?

రవీంద్ర (సాయిచంద్) ఒక యింటి ముందు నిలబడి, కాలింగ్ బెల్ మోగించాడు ఒక నడివయస్సామె (కె. వి. లక్ష్మి) వచ్చి తలుపు తీసింది.

"నమస్కారమండి మీ ఇంట్లో అమ్మాయిలున్నారాండీ ?" రవి అడిగాడు

ఆమె ఉలిక్కిపడింది "ఎవరివయ్యా నువ్వు ? ఎవరి ఇల్లనుకుంటున్నావ్ ? అమ్మాయి లేమిటి! ఇదేమన్నా సానికొంపనుకుంటున్నావా ?"

"ఆఁ— ఆఁ . నన్ను అపార్థం చేసుకోకండి మేము కొత్తగా కరాటే స్కూలు పెట్టాము. అందులో చేర్పుకోడానికి "

"స్కూలు మేష్టారివా ? మరిదేం పోయే కాలమయ్యా నీకు ? అమ్మాయిలున్నారాని అడుగుతున్నావ్ ?"

"తప్పయిపోయిందండి "

"తప్పులు చేసేవాడివి నువ్వు పాఠాలేం చెబుతావ్ ?"

"ఒక్క నిముషం, మీరిలావచ్చి కూర్చుంటే చెబుతాను."

"వద్దు నాయనా, నాకసలే రక్తపుపోటు"

రవి ఏం చెప్పినా ఆమె "నాకసలే రక్తపుపోటు" అని అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డులా మొత్తుకునేసరికి రవి విసుగెత్తి, అక్కడ్నుంచి చక్కా బయలుదేరాడు.

ఆగస్ట్లో విడుదలయ్యే శ్రీ బాలబాలాజీ కంబైన్స్ "ఈ పిల్లకు పెళ్ళవుతుందా ?" చిత్రాన్ని వేజెళ్ళ సత్యనారాయణ దర్శకత్వంలో బి హెచ్ అజయ్‌కుమార్ నిర్మిస్తున్నారు నిర్వహణ : వి. కనకరాజు.

## ఆగష్ట్ 14న పద్మాలయ స్టూడియో ప్రారంభోత్సవం!

"భాగ్యనగర్‌లో చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి మన ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు గారు సత్వర సన్నాహాలన్నీ చేస్తున్నారు. మా పద్మాలయ స్టూడియో నిర్మాణం సాఫీగా సాగకుండా ఎదురైన అవరోధాలన్నిటినీ ఇట్టే తొలగించేశారు స్టూడియో నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిన పాతిక లక్షల ఋణంలో తొలి విడతగా పదకొండు లక్షల రూపాయలు ఇవ్వడంకూడా జరిగింది", అంటూ హీరో కృష్ణ ఇంకా ఇలా అన్నారు "స్టూడియోతోపాటు హైదరాబాద్‌లో విజయకృష్ణ డబ్బింగ్ థియేటర్, ఔట్‌డోర్ ఎక్విప్‌మెంట్ యూనిట్‌నుకూడా నెలకొల్పే ఉద్దేశ్యం మాకుంది ఇవాళ నటులందిరికీ నేపథ్యగానం చేస్తున్న ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం హైదరాబాద్‌లో రికార్డింగ్ థియేటర్ నిర్మించనున్నారు దాంతో మద్రాసునుంచి తెలుగు చిత్ర పరిశ్రమ కొంత మేరకు హైదరాబాద్‌కు తరలింపు జరిగినట్లేకదా ?"

దాదాపు 1 కోటి 3 లక్షల రూపాయల వ్యయంతో భారీ ఎత్తున రూపొందుతూన్న పద్మాలయ స్టూడియోకు ఆగష్ట్ 14న ముఖ్యమంత్రిచే ప్రారంభోత్సవం జరుగుతుందని కూడా కృష్ణ తెలియజేశారు.



పూర్ణిమ, చంద్రమోహన్, 'శుభ ముహూర్తం'

# సంస్కృతంలో "ఆదిశంకరాచార్య"

మన దేశంలోని అన్ని ప్రముఖ భాషలలో ఇంచు మించుగా చిత్రాలు నిర్మాణమవుతున్నాయి విదేశాలలో గూడా తరుచుగా ప్రదర్శన భాగ్యాన్ని నోచుకుంటున్నాయి కానీ భారతీయ భాషలకు మాతృ భాష అయి, మన ప్రాచీన భారతీయ సంస్కృతికి సజీవ వారధి అయిన సంస్కృతంలో ఇంతవరకూ ఒక చిత్రమూ నిర్మింపబడలేదు

సంస్కృత భాషకు మార్కెటు విలువ లేదని విద్యావిషయకంగా గూడా తగిన ప్రోత్సాహం కల్గించడంలేదు దానిని ఒక మృతభాషగా మన నేతలు భావిస్తున్నారు అయితే జర్మనీ, నెదర్లాండ్, సోవియట్ రష్యా, ఇటలీ, ఇంగ్లాండు, అమెరికా వంటి అనేక విదేశాలలో, ప్రముఖ విశ్వవిద్యాలయాలలో సంస్కృతాన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేస్తున్నారు. కేవలం సంస్కృతభాషా వికాసం ద్వారానే మన దేశంలో గుజరాతీ, మరాఠీ, తెలుగు, తమిళ్, మలయాళం వంటి ప్రాంతీయ భాషలు సహితం వికశింపగలవని, జాతీయ సమైక్యతకు దోహదం చేయగలవని గుర్తించాలి.

ఇటువంటి పరిస్థితులలో సంస్కృతంలో మొట్టమొదటిసారిగా "ఆదిశంకరాచార్య"పై ఒక చిత్రాన్ని నిర్మించడం చాలా సంతోషాన్ని కల్గిస్తుంది. జాతీయ చలనచిత్ర అభివృద్ధి (ఎన్. ఎఫ్ డి సి) సంస్థయొక్క సంపూర్ణ ఆర్థిక సహాయంతో శ్రీ జి వి అయ్యర్ దర్శకత్వంలో ఈ చిత్ర నిర్మాణం పూర్తయినట్లు ఆ సంస్థ ఒక ప్రచురణలో ఇటీవల తెలిపింది. నిర్మాణం పూర్తికానందున గత ఏప్రియల్‌లో జరిగిన జాతీయ చలన చిత్రోత్సవంలో ఈ చిత్రాన్ని ప్రదర్శింపలేకపోయారు

సాంకేతికంగా, కళాత్మకంగా మంచి ప్రమాణాలతో, శ్రీ శంకరాచార్య తాత్విక సందేశంతో రూపొందించిన ఈ చిత్రం నిర్మాణ వ్యయం రు 7 లక్షలు మాత్రమే. 'గాంధీ' చిత్రాన్ని నిర్మించిన సర్ రిచర్డ్ అటెన్‌బరో మన దేశానికి పలుమార్లు పర్యటించిన పర్యటనలలో ఒక పర్యటనకు అయిన ఖర్చుతో సమానమని ఎన్ ఎఫ్. డి సి డైరెక్టర్ శ్రీ భక్తవత్సల అన్నారు లందుచేత సాంకేతికంగా అత్యున్నత ప్రమాణాలు ప్రదర్శింపలేకపోయినా నొక ప్రత్యేకతను సంతరించుకొనగలదు

"హంసగీత్" చిత్రంతో పేరొందిన శ్రీ అయ్యర్ కన్నడంలో 67 చిత్రాలు నిర్మించారు "మొదట ఆర్థిక సహాయానికై సంప్రదిస్తే సంస్కృత చిత్రం వలన ప్రయోజనం ఏమిటని ప్రశ్నించారు అటువంటి అడ్డంకులను అధిగమించి, షూటింగ్ 50 రోజులే అయినప్పటికీ పూర్తిచేయడానికి 7 సంవత్సరాలు పట్టింది. కాలినడకనే శ్రీ అయ్యర్ హిమాలయాలు వెళ్లారు ఏడు రాష్ట్రాలలో పర్యటించి "కాలినడక డైరెక్టర్"గా పేరొందారు

వివిధ శ్రీ శంకరాచార్య మఠాలచేత తన స్క్రిప్ట్‌కు అనుమతిపొంది, ఎడ్వాన్స్‌డ్ ఫిలాసఫీలో జాతీయ ప్రొఫెసర్ శ్రీ ఎం టి మహదేవన్‌కుగూడా చూపించి, ప్రముఖ సంస్కృత విద్వాంసులు శ్రీ రంగనాథశర్మ, శ్రీ బన్నంజ గోవిందాచార్యులచే మాటలు వ్రాయించారు ఒక భక్తుడిగా శ్రీ శంకరుని జీవితం, తాత్విక చింతనను చిత్రించడానికి ప్రయత్నించారు

"నదులు సముద్రంలో లియగానే తమ పేరు, ప్రాముఖ్యతను మరుస్తాయి. అలాగే విజ్ఞానులు భగవంతుని సమీపించగానే తమ గురించి మరుస్తారు—" అనే సందేశంతో చిత్రాన్ని నిర్మించారు.

— చలసాని నరేంద్ర



'మహారాణి'లో సుజాత, ఉమ, జయచిత్ర

## సినిమా

### కట్టా సుబ్బారావు దర్శకత్వంలో "రాముడేలిన రాజ్యంలో...."

"ఆర్టిస్టుల కాల్షీట్లు తీసుకోవడమే తరువాయి, డిసెంబర్‌లో షూటింగ్ మొదలవుతుంది," అన్నారు కట్టా సుబ్బారావు ఈయన దర్శకత్వం వహించే "రాముడేలిన రాజ్యంలో ." చిత్రాన్ని కమలాలయ ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తుంది.

### ధర్మవిజయా పిక్చర్స్ ద్వితీయ చిత్రం

"నిర్మాత ఎస్ వి సుబ్బరాజు చక్కని కథను సమకూర్చారు అక్టోబర్ నుండి డిసెంబర్ వరకు షూటింగ్," అన్నారు చందన్ సిగార్స్ అధినేత ఖాదర్ ఈయన గతంలో ధర్మవిజయా పిక్చర్స్ పతాకంలో "పునాది రాళ్ళు" శతదినోత్సవ చిత్రాన్ని అందించారు కొత్త చిత్రంలో సుమన్, సుమలత నాయకానాయకలు. రాజ్‌కోటి సంగీతం, దశరథరామయ్య ఛాయ, రంగారావు శిల్పం, అంకిరెడ్డి కూర్పు, పొన్నతోట రఘురాం ప్రొడక్షన్స్, సి హెచ్ కృష్ణకుమార్ — కె ధ్రువకుమార్ నిర్మాణ సారథ్యంతో ఫజుల్లాహక్ నిర్మించే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డి.

### "ఇంటిగుట్టు"

"ముందడుగు చిత్రం తర్వాత రచయితలు పరుచూరి బ్రదర్స్, నేను కలిసి పని చేస్తున్న చిత్రం — ఇంటిగుట్టు" అన్నారు కె. బాపయ్య ఈయన దర్శకత్వం వహించే వర్మా ప్రొడక్షన్స్ వారి పై చిత్రం జూన్ 29న సెట్స్‌కు వెళ్లింది. మోహన్‌బాబు, చంద్రమోహన్, నళిని,సుహాసిని, సిల్క్ స్మిత, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య ప్రభృత తారాగణం. వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. సీను నృత్యాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు, శ్యాంబాబు సహకార దర్శకత్వం, సూర్యనారాయణ ప్రొడక్షన్‌తో ఈ చిత్రాన్ని నిర్మించే డాక్టర్ డి వి ఎస్ రాజు "ఆగస్టుకు షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు ★

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# మీ చిగుళ్లను దృఢంగా వుంచుకోండి
# మీ పళ్లకు దీర్ఘ ఆయుస్సునివ్వండి




## కేవలం ఫోర్‌హెన్స్‌లో మాత్రమే చిగుళ్లను దృఢపర్చగల ఒక ప్రత్యేకమైన అస్ట్రింజంట్ కలదు

ఝల్లుమనిపించే అనుభూతి ఇది పనిచేస్తున్నట్టుగా తెలుపుతుంది.

ఆరోగ్యవంతమైన పళ్లకు కూడా గట్టి చిగుళ్ల ఆధారం అవసరం. చిగుళ్లు బలహీనమై మెత్తబడి పోయాయంటే మీ పళ్లకున్న గట్టి ఆధారం సడలిపోతుంది. అందుకే, చిగుళ్ల జీవధాతువును సంకోచపరిచి, బిగుతు చేయడానికి సహాయపడే ఒక ప్రత్యేకమైన అస్ట్రింజంట్‌తోటి సూత్రీకరించబడింది, ఫోర్‌హెన్స్. ఫోర్‌హెన్స్‌తో మీ పళ్లను బ్రష్ చేసుకుంటున్నప్పుడు మీకు కలిగే ఆ ఝల్లుమనిపించే అనుభూతి ఆ అస్ట్రింజంట్ చర్య వల్ల కలిగిందే. అదే, మీ చిగుళ్లను గట్టిగా, బిగుతుగా చేస్తున్న చర్య. దీనితో మీ పళ్లు ఆరోగ్యంగా మరింత కాలం నిలుస్తాయి.

కనుక మీ పళ్లకొక గట్టి ఆధారం కల్పించండి—ప్రత్యేకమైన అస్ట్రింజంట్ గల ఫోర్‌హెన్స్ టూత్‌పేస్ట్‌ను వాడండి.


మీ చిగుళ్లు బలహీనమైపోతే ఆరోగ్యవంతమైన పళ్లు కూడా వదులై పోతాయి.


ఫోర్‌హెన్స్‌లోని ప్రత్యేకమైన అస్ట్రింజంట్ చిగుళ్ల జీవధాతువును బిగుతు చేస్తుంది.


దీనితో మీ చిగుళ్లకు మరింత బలం, మీ పళ్లకు మరింత ఆయుష్షు.




**ఫోర్‌హెన్స్‌ను విశ్వసించండి!** ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్‌పేస్టు.

306F-203 TEL

# ఈతరం తండ్రి

## జూపిటర్

సాయంత్రం అయిదున్నర అవుతోంది.

ఆఫీసు నుండి బయటకు వచ్చాను. మా ఇల్లు ఆఫీసుకు దగ్గరే అవడంతో రోజూ నడుచుకొంటూనే వెళ్లివస్తాను.

రోడ్డుమీద నడుస్తున్నానన్నమాటేగానీ ... నా ఆలోచనలన్నీ 'రేవంత్' చుట్టూనే తిరుగుతున్నాయి. అసలివాళ నా మనసంతా చిరాగ్గా ఉంది. దానికి కారణం 'రేవంత్' బి. ఎ. మొదటి సంవత్సరం పరీక్షల్లో తప్పడం కావచ్చేమో ?

పదహారేళ్ల క్రితం వరకూ... నా చేతుల్లో గంతులు వేసిన రేవంతుకు ఇవాళ నేనంటే ఏమాత్రం లక్ష్యం లేదు ! నా ప్రతి మాటకూ ఎదురు చెప్తాడు—వాడికి ఎందరో స్నేహితులు ! నేనిచ్చే—వందరూపాయల పాకెట్ మనీ సరిపోదంటాడు. ఇంట్లో వాళ్లమ్మని కూడా లెక్క చెయ్యడు.

మాకు రేవంత్ ఒక్కడే సంతానం కావడంతో...వాడిని ఎంతో గారాబంగా పెంచడం వల్ల ... వాడితో గట్టిగా మాట్లాడలేక పోతున్నాను. చూస్తుంటే... వాడి ముందు నేనో అసమర్థుడిగా ప్రవర్తిస్తున్నానన్పిస్తోంది.

ఏమయినా ఇవాళ వాడితో గట్టిగా మాట్లాడాలని నిశ్చయించుకున్నాను.

''ఇంకా ఆలోచించడానికి ఏమీలేదుగా'' — అన్నట్లు ఇల్లు వచ్చేసింది.

తలుపు తీసిన శాంతను, ''రేవంత్ ఇంట్లో ఉన్నాడా ?'' అని అడిగాను.

''వాడు ఇంటికి ఎప్పుడొచ్చేదీ మీకు తెలియదా ?'' అంటూ నావంక వింతగా చూసింది శాంత.

''ఓః దొరగారు తొమ్మిదయితేగానీ రారు కదూ ?'' గొణుక్కుంటూ లోపలికి నడిచాను.

స్నానంచేసి, టీ తాగి, పడకకుర్చీలో కూర్చోగానే, మళ్ళీ రేవంత్ వైపుకు నా ఆలోచనలు పయనించాయి.

నేను 'డల్'గా ఉన్నట్లు అన్పిస్తే శాంత నన్ను కదిలించదు ! తనుకూడా రేవంత్ గురించే ఆలోచిస్తూ ఇంకోమూల కూర్చుంది.

కాలింగ్ బెల్ మోగింది. మేమిద్దరం... మా ఆలోచనలనుంచి బయటపడి ఈ లోకంలోకి వచ్చాం. శాంత లేచి వెళ్ళి తలుపు తీసింది.

రేవంత్ వచ్చాడు. వాడిని ఏదో అడుగుదామని అనిపించినా... నా నోరు పెగలలేదు.

తలుపు తీసింది... ఎవరోకూడా గమనించనంత వేగంగా... ఈలవేస్తూ ... లోపలికి పెద్ద... పెద్ద... అంగలతో నడిచాడు రేవంత్.

నాకు అంతా తమాషాగా ఉంది. నేనున్నది నా యింట్లోనేనా అన్పించింది నాకా క్షణంలో !

''అసలు నేను నా కొడుకుతో మాట్లాడటానికి... ఇంతగా రిహార్సల్ వేసుకోవాల్సిన అవసరం ఏమిటి ? ఆఫీస్‌లో డివిజనల్ మానేజర్‌తో మాట్లాడాలన్నా... నేనింతగా ఎప్పుడూ మథనపడనే...!'' నా మీద నాకే అసహ్యం వేసింది.

రేవంత్ తన గదిలోకి వెళ్ళిపోయి బట్టలు మార్చుకొంటున్నాడు. నెమ్మదిగా వాడి గదివైపు వెళ్ళి... గుమ్మంలో నిలబడ్డాను.

నన్ను చూసి కూడా ... చూడనట్లుగా టేబుల్ మీద ఉన్న పుస్తకాల్ని సర్దసాగాడు రేవంత్.

''రేవంత్ ! నీతో మాట్లాడాలి ! త్వరగా స్నానం చేసి నా గదిలోకి రా !'' గబగబా అనేసి వెనుదిరిగాను.

''ఆ మాటలేవో భోజనాలు ముగించాక మాట్లాడుకోండి. నేను వడ్డించేస్తున్నాను !' అంటూ వంటింట్లోంచి అంది శాంత !

''డాడీ... ఇవాళ ప్రత్యేకంగా నాతో ఏం మాట్లాడతాడట ?'' తనలో తానే అనుకొంటూ బాత్‌రూం వైపు నడిచాడు రేవంత్.

భోజనాల దగ్గర ఎవరమూ మాట్లాడటానికి అవకాశం రాలేదు! అందరం తలవంచుకొని మా పని అయిపోయిందనిపించేశాం !

చెయ్యి కడుక్కొని నా గదిలోకి నడిచాను. నా వెనకే రేవంత్ కూడా వచ్చాడు.

''నన్నెందుకు పిల్చారు డాడీ ?'' రేవంత్ అడిగాడు.

''ఆ కుర్చీలో కూర్చో !'' అంటూ వాడిని కూర్చోమని నేను కూడా కూర్చున్నాను.

''రేవంత్ ! నీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలని పిల్చాను!'' సంభాషణ మొదలుపెట్టాను

తల వంచుకొని కూర్చున్నాడు రేవంత్.

''ఇవాళ నీ రిజల్ట్ చూసాను. నువ్వు తప్పినందుకు నేను బాధపడటంలేదు ! నువ్వు మామూలుగా తప్పితే ... మళ్ళీ సెప్టెంబర్‌కు కట్టి పాసవుతావని ఫూర్కొని ఉండేవాడిని. కానీ నీ ప్రవర్తన నాకు నచ్చడం లేదు. నువ్వు స్నేహితులతో సినిమాకనీ, షికార్లకనీ తిరుగుతున్నట్లు తెలిసింది. ఈ మధ్య సిగిరెట్లుకూడా కాలుస్తున్నావని ఎవరో చెప్పారు. చదువుకొని వృద్ధిలోకి రావల్సిన ఈ వయసులో ... ఇలా చెడు తిరుగుళ్ళు తిరగడం ... మంచిది కాదు ! అసలు నీ గురించి నువ్వేమనుకొంటున్నావ్ ?''

జవాబు లేదు ...

''నేనూ, అమ్మా...నిన్ను ఎంతో అల్లారు ముద్దుగా పెంచాం. చిన్నప్పుడు నువ్వడిగిన ప్రతి వస్తువూ నిముషాల్లో తెచ్చియిచ్చాను. మాకున్నది ... నువ్వొక్కడివే ... అనే దృష్టితో నిన్నుఎపుడూ కసురుకోనుకూడా లేదు! నువ్వెంత డబ్బు అడిగినా ... ఎందుకూ అని అడగకుండా ఇచ్చాను ! అయినా నేనంటే నీకే మాత్రం గౌరవం ఉన్నట్లు నువ్వు ప్రవర్తించడంలేదు. మీ అమ్మతో కూడా నువ్వు సరిగ్గా మాట్లాడటం లేదట !'' ఒక్కక్షణం ఆగి ... వాడినుండి జవాబేమయినా వస్తుందేమోనని చూశాను. కాలివేళ్ళను నేలమీద రాస్తూ కూర్చునివున్నాడు రేవంత్.

''ఎందుకురా రేవంత్ ! మా యిద్దర్నీ ఇలా బాధపెడ్తావ్ ? మాకున్నది నువ్వొక్కడివిరా ! నువ్వు మంచిగా చదువుకొని వృద్ధిలోకి వస్తే... నిన్నుచూసి సంతోషించాలని మాకుంటుందని నీకు అన్పించదా ?''

''..................''

''నీ వయసులో... నేను ఇలా ఉండేవాడివా? మా నాన్నని పరీక్ష ఫీజుకు డబ్బు ఇమ్మని అడగాలన్నా... ఎంతోభయంగా అడిగేవాడిని ! స్కూలు, కాలేజీ, ఇల్లూ — తప్ప నాకింకో లోకమే ఉండేది కాదు ! ఇంటివగ్గర రోజుకి ఏడెనిమిది గంటలు చదివేవాళ్ళం ! మా అమ్మ.. ప్రతి రోజూ స్కూల్లో చెప్పిన పాఠాలు అప్పజెప్పందే ... అన్నంకూడా పెట్టేది కాదు ! ప్రతిసారీ ప్రోగ్రెస్ రిపోర్ట్ ఇవ్వగానే... సంతకం పెట్టడానికి మా నాన్న ఎంతో హడావుడి చేసేవాడు. ఏ సబ్జక్టులోనయినా తక్కువ మార్కులు వస్తే... రెండు వందల గుంజీలు తీయిస్తూ ఉండేవాడు. మరి నీకో ! నేనెంత స్వేచ్ఛ ఇచ్చాను ! ఏ విషయంలోనూ నీకు నేను అడ్డం రాలేదు ! అయినాకూడా... మేమంటే నీకే మాత్రం లక్ష్యం ఉండటంలేదు !'' కొద్దిగా ఆవేశంగానే అన్నాను.

అప్పటివరకూ తల వంచుకొని కూర్చున్న రేవంత్ ఒక్కసారిగా తలఎత్తి నా కళ్ళలోకి చూశాడు.

''డాడీ ! నన్ను మీరడిగిన ప్రశ్నకు జవాబు కూడా మీ ప్రశ్నలోనే ఉంది !'' నెమ్మదిగా అన్నాడు రేవంత్.

''అంటే... '' నాకు అర్థంకాలేదు వాడి జవాబు.

''అవును డాడీ! మీరు నన్నెంతో గారాబంగా పెంచారు. నేను అడిగిన ప్రతిదీ... కొనిపెట్టారు.

ఎప్పుడు డబ్బు అడిగినా... లేదనకుండా ఇచ్చారు. స్కూలుకు వెళ్ళినా వెళ్ళకపోయినా ... ఏమీ అనే వారు కాదు! ప్రోగ్రెస్ రిపోర్టు చూపించినప్పుడు దాని వంక చూడనయినా చూడకుండా సంతకం పెట్టేవారు! చిన్నప్పుడు ... నేను అల్లరి చేస్తుంటే ... దాన్ని చూసి సంబర పడేవారే తప్ప... ''తప్పు బాబూ! అలా చెయ్యకూడదని''

— నన్ను మందలించ లేదు! ఇన్నాళ్ళూ నాకు అనవసరంగా స్వాతంత్ర్యం ఇచ్చి నన్ను ఇలా తయారు చేసి, ఇవాళ ''పాడయిపోతున్నావు బాబూ!'' అంటే... నేను క్షణాల్లో మారిపో గలనా? మీరు ... మీ రోజుల్లో చిన్నప్పుడు శ్రద్ధగా చదివారూ అంటే దానికి కారణం ... మా బామ్మా, తాతగారూ! వాళ్ళు మిమ్మల్ని ఎంతో భయభక్తుల్లో చదివించారు! అందువల్లే చిన్నపుడు మీరలా ఉండగల్గారే తప్ప... అది మీ ఒక్కరి గొప్పతనం మాత్రం కాదు! మిమ్మల్ని అలా క్రమశిక్షణలో పెంచిన మా 'బామ్మ', తాతగార్ల గొప్పదనం! మరి మీరు తండ్రిగా నాకేం చేశారు? అమ్మ కూడా నాకు మూడు పూటలా అన్నం పెడుతుందే తప్ప... ఏనాడయినా, ''ఎలా చదువుతున్నావురా?'' అని అడిగిందా? ఇన్నాళ్ళు మీరిద్దరూ నాగురించి ఏమీ పట్టించుకో లేదు! అందువల్లే నేనిలా తయారయ్యాను!'' ప్రతి మాటా కూడబలుక్కుంటూ అన్నాడు రేవంత్.

రేవంత్ నోటినుండి వచ్చిన ప్రతి మాటా నాకు బాణాల్లా గుచ్చుకున్నాయి. వయసులో చిన్నవాడయినా... వాడు నా బాధ్యతను నాకు తెలియజేసాడన్పించింది.

రేవంత్‌కు నేను బదులు చెప్పలేకపోయాను. దానికి కారణం...నావద్ద వాడి ప్రశ్నలకు జవాబు లేకపోవడమే!






ఎయిడ్స్ రోగాన్ని నిర్మూలించాలని ప్రదర్శనలు జరుపుతున్నారు – వీరంతా న్యూయార్క్ సెంట్రల్ పార్కులో. మగవారిలో ఎక్కువమంది పురుషులతో సంపర్కం అలవాటు కలవారే.

# అమెరికా ప్రజలని భయ విహ్వలులని చేస్తున్న ప్రాణాంతకమైన అంటు రోగం 'ఎయిడ్స్'

అమెరికాలో ధనం ఎంత ఉన్నా, సాంఘికంగా యాంత్రికంగా ఎంత ముందంజ వేసినా, అక్కడి ప్రజలకి కొంగ్రొత్త సమస్యలు దాదాపు ప్రతినిత్యం ఎదురవుతూనే ఉన్నాయి. ఈ సమస్యలకి ప్రకృతిసిద్ధమైన మార్పులకన్నా, నాగరికత పేరిట వెర్రితలలు వేసే అలవాట్లే ముఖ్య కారణాలు. విచ్చలవిడిగా సంచరించటానికి ఉన్న వీలు, కట్టుదిట్టం లేని సాంఘిక ఆచారాలు, పుష్కలమైన డబ్బు ఈ అలవాట్లకి దోహదం చేస్తాయి అనటంలో అతిశయోక్తి ఏ మాత్రం ఉండదు.

ప్రస్తుతం అమెరికా దేశాన్ని ఒక వింత రోగం పట్టి పీడిస్తున్నది. ఈ రోగాన్ని 'ఎయిడ్స్' ''అక్వైర్డ్ ఇమ్యూన్ డిఫిషియన్సీ సిండ్రోమ్'' అంటున్నారు. ఈ రోగం రావటానికి గల కారణాలను, రోగ వ్యాప్తినీ కనుగొనటానికి వైద్య శాస్త్రంలోని వివిధ శాఖల నిపుణులు అహోరాత్రాలు కృషి చేస్తున్నారు.

గత రెండేళ్ళ కాలంలో 1641 మంది ఒక్క అమెరికా దేశంలో మాత్రమే ఎయిడ్స్‌తో బాధపడటం జరిగింది. వీరిలో 644 మంది మృత్యువాతబడ్డారు. ప్రస్తుతం సగటున నెలకి 165 మంది ఈ రోగం పాలవుతున్నారు. న్యూయార్కు నగరంలో ఈ రోగం ఉధృతంగా ఉన్నట్లు తెలుస్తోంది. అక్కడ 732 మందికి ఎయిడ్స్ వస్తే 284 మంది చనిపోయారు. రెండవ స్థానం, శాన్ ఫ్రాన్సిస్కోది. అక్కడ 160 మందికి రోగం రాగా 84 మంది చనిపోయారు. మూడవస్థానం లాస్ ఏంజలిస్‌ది. అక్కడ ఈ రోగం వంద మందికి వచ్చింది. వారిలో 40 మంది మరణించారు.

17 ఇతర దేశాలలో కూడా మొత్తం ఇంతవరకు 122 మంది ఎయిడ్స్‌కి గురి అయినట్లు ఒక అంచనా!

ఈ రోగం వచ్చినవారి శరీరంలో రోగ నిరోధక శక్తి (ఇమ్యూనిటీ) పూర్తిగా నశిస్తుంది. ఇలా జరగటం వల్ల రోగ కారక క్రిములు శరీరంలో ప్రవేశించి ఎదురులేకుండా విజృంభించి ఉధృతమైన రోగాన్ని కలుగజేస్తాయి. ఉదాహరణకి, న్యుమోనియా, కపోసీ సార్కోమా (ఒక విధమైన కేన్సర్) కూడా ఈ రోగులలో అధికంగా కనబడటం.

## ఈ రోగం పుట్టుపూర్వోత్తరాలు!

ఈ రోగం ఎలా మొదలవుతుంది, ఎలా ఇతరులకి సంక్రమిస్తుంది అనేవి ఇంకా తేలని విషయాలు. అలాగే ఈ రోగానికి చేయవలసిన చికిత్స కూడా నిర్ధారణగా తెలియదు.

1981 వ సం. ప్రారంభంలో అమెరికాలోని లాస్ ఏంజెలిస్ నగరంలోని ఆరోగ్య శాఖాధికారులకి ఈ రోగం గురించి తెలియ వచ్చింది. స్వజాతి సంపర్కం అలవాటు ఉన్న అయిదుగురు పురుషులలో తీవ్రమైన న్యుమోనియా జబ్బు రావటం ద్వారా ఈ రోగం నలుగురి దృష్టిలోకి వచ్చింది. వీరిలో రోగ నిరోధక శక్తులు బాగా కుంటుపడ్డాయని వైద్యులు తెలియజేశారు. దాదాపు అదే సమయంలోనే న్యూయార్కు విశ్వవిద్యాలయానికి చెందిన డా. ఆల్విన్ ఫ్రీడ్‌మెన్‌కీన్ స్వజాతి సంపర్కానికి అలవాటు పడ్డ రోగులలో రోగనిరోధక శక్తులు బాగా తగ్గిపోయాయని వారికి కపోసీ సార్కోమా అనే చర్మకేన్సర్ వచ్చిందనీ తెలియజేశారు. అదే సంవత్సరం వేసవిలో సెంటర్స్ ఫర్ డిసీజ్ కంట్రోల్ (సి. డి. సి.) కి చెందిన డా॥ హెరాల్డ్ జెఫేకి ఈ రోగంతోనే బాధపడుతున్న స్వజాతి సంపర్కం అలవాటు ఉన్న ఒక పురుషుని గురించి తెలియజేయబడింది. వెనువెంటనే సి. డి. సి. సంస్థవారు సుఖరోగాల చికిత్సలో నిపుణుడైన డా॥ జేమ్స్ కుర్రాన్

ఆధ్వర్యంలో ఎయిడ్స్‌రోగ పునఃపరిశీలనకి గాను సిబ్బందిని ఏర్పాటుచేయడం జరిగింది.

వీరు ఎయిడ్స్ రోగలక్షణాలు ఉన్న 50 మంది రోగులను అమెరికా దేశంలోని కొన్ని ప్రాంతాలలో కనుగొన్నారు. రోగులలోని లక్షణాలనుబట్టి ముందుగా అమిల్ నైట్రేట్, లేక బ్యుటైల్ నైట్రేట్ వంటి మందుల ప్రాబల్యం అయి ఉంటుందేమో అని అనుకోవటం జరిగింది. (ఈ మందులని పీల్చటం ద్వారా కొందరికి ''ఖుషీ'' కలుగుతుంది.) కాని కొన్ని పరిశోధనల ద్వారా ఈ మందులకీ, ఎయిడ్స్ రోగానికీ సంబంధంలేదని తెలిసింది. ఈ రోగంతో బాధ పడుతున్నవారిలో చాలామంది స్వజాతి సంపర్కపు అలవాట్లు ఉన్నవారేనని కూడా పై పరిశోధనలలో తేలింది.

ఇది ఇలా ఉండగా మత్తు మందులకి అలవాటుపడిన (స్వజాతి సంపర్కపు అలవాటు లేని) వారికి కూడా ఈ రోగం రావటం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. పై కారణంవల్ల అతి సూక్ష్మమైన వైరస్‌లవల్ల ఈ రోగం వస్తుందనే సిద్ధాంతం బయలుదేరింది. ఇంజక్షన్ సూదుల ద్వారాను, లైంగిక కలయిక ద్వారాను, రక్తదానం ద్వారాను ఈ వైరస్‌లు ఒకరినుంచి మరొకరికి సంక్రమిస్తాయని కొన్ని ప్రత్యక్ష నిదర్శనాల మూలంగా తెలుసుకొన్నారు. మత్తు మందుల అలవాటు ఉన్నవారిలో సంపర్కం పొందినవారికీ, రక్తదానం పొందినవారికీ ఈ రోగం రావటం పై అపోహలకి కారణం అయింది.

ఒకళ్ళకి తెలియకుండా ఒకరితో సంపర్కం పెట్టుకొన్న న్యూయార్కు వాసి అయిన ఒక రోగి ప్రాపువల్ల ముగ్గురికి ఈ రోగం వచ్చింది. ఇదే విధంగా అమెరికాలోని 10 నగరాలలో నివసిస్తున్న 40 మందికి పై కారణంవల్లనే ఎయిడ్స్ రావటం జరిగింది.

హెయితీ దేశం నుండి, అమెరికాలో దొంగతనంగా ప్రవేశించినవారిలో కూడా ఈ రోగం ఉండటం వైద్యులని ఆశ్చర్యచకితుల్ని చేసింది.

అమెరికాలోని రీసెర్చ్ వర్కర్లు మరికొన్ని ఆధారాలను తెలియజేశారు. రోగుల శరీరంలో ఉత్పత్తి అయ్యే రోగ నిరోధక కణాల (యాంటీ బాడీస్) ఉత్పత్తిలో అవకతవకలున్నాయని కనుగొన్నారు. ఒక మామూలు మనిషి శరీరంలో యాంటీబాడీల ఉత్పత్తిని కట్టుదిట్టం చేయగల ''టి—సెల్స్'' కన్నా, వాటి ఉత్పత్తిని పెంపొందించే ''టి—సెల్స్'' సంఖ్య రెట్టింపుగా వుంటుంది. ఎయిడ్స్ రోగం ఉన్నవారిలో ఈ నిష్పత్తి తారుమారవుతుంది. కొందరిలోమాత్రం ఈ రెండు విధాలైన సెల్సు అతి తక్కువ సంఖ్యలో ఉంటాయని కనుగొనబడింది.

పైన చెప్పిన విషయాల దృష్ట్యా రెండు సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి. ఒకదాని ప్రకారం వైరస్‌లవల్ల ఈ రోగం వస్తుంది. రెండవదాని ప్రకారం మత్తు మందుల అలవాటు ఉన్నవారికీ, స్వజాతి సంపర్క అలవాటు ఉన్నవారిలోను రోగ నిరోధక శక్తి నశించడంవల్ల ఈ రోగం వస్తుంది.





ఈ రోగాన్ని కనిపెట్టిన ప్రముఖులలో ఇద్దరు : ఎయిడ్స్ టాస్క్‌ఫోర్స్ నాయకుడు జేమ్స్‌కుర్రాన్, సి. డి. సి. డైరెక్టరు విలియంఫోజె.

ఈ సిద్ధాంతాలు సరి అయినవని నిరూపించబడటానికి కొంగ్రొత్త మార్గాలలో పునః పరిశీలనా కార్యక్రమాలు భారీఎత్తున అమెరికాలో నిర్వహింపబడుతున్నాయి. 'టి—సెల్స్' ప్రమాణం వాటిలో వైరస్‌లు ఉన్నదీ లేనిదీ అనే విషయం, లింఫ్ గ్రంధుల వాపులు మొదలయినవన్నీ పరిశోధింపబడుతున్నాయి. స్వజాతిసంపర్కం అలవాటుగల 1500 మంది రక్తాన్ని పరిశోధించగా 18 మందికి ఈ రోగ లక్షణాలు ఉన్నట్లు తెలియవచ్చింది.

ఈ రోగానికి చికిత్స ఇంతవరకు ఇదమిద్ధంగా తెలియదు. అమెరికాలోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్‌కి చెందిన డాక్టరు ఆంతోనీ ఫాసీ అనే ఆయన మరొకరి ఎముకల్లోని మజ్జని ఎయిడ్స్‌రోగి ఎముకల్లో ప్రవేశపెట్టడం ద్వారా రోగ నిరోధక శక్తిని కలుగజేస్తున్నారు.

కేన్సర్ విముక్తికివాడే ''ఇంటర్‌ఫెరాన్''తో ఈ రోగులకి చికిత్స చేయడం మరొక విశేషం!

సి. డి. సి. డైరెక్టర్ విల్లియం ఫొజె చెప్పినట్లుగా ఒకరోగం నిర్మూలింపబడగానే, మరొక రోగం తలెత్తుతూ ఉంటుంది. అన్ని అంటు రోగాల లాగానే ఎయిడ్స్ రోగానికికూడా వైద్యులు తీవ్రంగా కృషి చేయవలసి ఉంది.

అమెరికాలోని హెల్త్ సర్వీసెస్ కార్యదర్శి మార్గరేట్ హెక్లర్ 15 రోజులక్రితం ఎయిడ్స్ రోగులను బెతెస్డా లోని ఒక ఆరోగ్య కేంద్రంలో సందర్శించి వారి బాగోగులను విచారించారు. ఈ సంవత్సరం ఆ దేశంలో 14 మిలియన్ల డాలర్లు ఈ రోగానికి కేటాయించారు. అదనంగా 12 మిలియన్ల డాలర్లు కావాలని ఆ శాఖ కార్యదర్శి అమెరికా అధ్యక్షుడ్ని అడిగారు. ఈ రోగాన్నిగురించి ప్రజలు తెలుసుకొనేటందుకు వీలుగా రుసుములేని టెలిఫోను నెంబరు ఒకటి కేటాయించ బడింది!

## అమెరికాలో సంచలనం!

ఎయిడ్స్ రోగం మూలంగా ఏర్పడే మరణాల సంఖ్య అధికం అవుతున్న కొద్దీ, ఈ రోగం అంటురోగమనే అనుమానం పెనుభూతంగా ప్రజల మధ్య అలజడి లేవదీస్తోంది. స్వజాతి సంపర్కపు అలవాటు ఉన్న పురుషులన్నా, హెయితీదేశం వారన్నా, హీమోఫీలియా రోగంతో బాధపడే వారన్నా, నరాల ఇంజక్షన్ల ద్వారా మత్తుమందుల అలవాటు ఉన్న వారన్నా, వారి బంధువులు, స్నేహితులు నిరసన చూపుతున్నారు. ఈ రోగం రాగల అవకాశం ఉండటమే ఇందుకు కారణం.

కాలిఫోర్నియా, శాన్‌ఫ్రాన్‌సిస్‌కో నగరాలలోని నర్సులు, వైద్యేతర సిబ్బంది ఈ రోగులకి చికిత్స చేయటానికి విముఖత చూపుతున్నారు. అమెరికా దంత వైద్యుల సంఘం ఈ రోగులకి చికిత్స చేసే సమయంలో వైద్యులు వాడవలసిన ముందు జాగ్రత్త పరికరాలను నిర్ణయించింది. స్వజాతి సంపర్కం గల సర్వర్లు హోటళ్ళలో అహారం సరఫరా చేయరాదని కొందరు నినాదాలు హైతీ దేశపు డ్రైవర్లు నడిపే కార్లలో ప్రయాణం చేయటానికి కూడా ప్రజలు భయ

# వివాహహక్కుల పునరుద్ధరణ రాక్షసరతా?

జస్టీస్ పి.ఏ. చౌదరిగారు వివాహ హక్కులను పునరుద్ధరణ పరిచే అధికారం కోర్టులకు యివ్వడం చెల్లదని, హిందూ వివాహ చట్టము లోని తత్సంబంధమైన సెక్షను 9ని రద్దు పరుస్తూ నిర్ణయం చేశారు.

స్త్రీలుగాని, పురుషులుగాని విడిగా వుంటున్నప్పుడు వారు తిరిగి కలిసి జీవించడానికి వారిలో ఎవరైనా కోర్టుకు అర్జీ చేసుకునే హక్కుగాని కోర్టు అది ఆర్డరు చేసే హక్కుగాని ఈ తీర్పు వలన పోయాయి. దాని కారణంగా ఆంధ్రప్రదేశ్‌లో చాలా కోర్టులలో నిర్ణయం కోసం వున్న కేసులు దీనిపైన ఆధారం చేసుకుని నిర్ణయింపబడతాయి.

జస్టీస్ చౌదరిగారు రాజ్యాంగ విరుద్ధమని, బలవంతంగా భార్యాభర్తలు కలిసి జీవించి లైంగిక సుఖాలు అనుభవించమని శాసించే హక్కు ప్రభుత్వానికి లేదని, ఈ బలవంతపు లైంగిక చర్య ప్రభుత్వం చట్టాలు ద్వారా అమలు పరచడం చాలా హేయము, అమానుష విషయము అని, యింతే కాకుండా, యిది శ్రీశ్రీ తన "కవిత" లో చెప్పిన "రాక్షస రతి" వంటిది అని కూడా జస్టీస్ చౌదరిగారు అభివర్ణించి యున్నారు.

అయితే ఈ తీర్పు వల్ల వచ్చే నష్టం లేవని ఆలోచిస్తే మనకు అన్ని శాస్త్రాలకన్నా హిందూ ధర్మ శాస్త్రాలను కూలంకుషంగా పరిశీలించ వలసిన అవసరం ఎంతైనా వుంది అనిపిస్తుంది. చౌదరిగారు ఇంగ్లీషులా — పై వివరించిన శాస్త్ర చర్చ సాగించారు గాని హిందూ ధర్మశాస్త్రం కూడా యిది ఒప్పుకోదు అని ఒక్క ముక్కలో శాస్త్ర చర్చ ముగించారు.

ముఖ్యంగా బ్రిటన్‌లోని స్కార్‌మన్ కమిషన్ నివేదికపై వారు అక్కడ రద్దు పరిచిన సంగతి చౌదరిగారిని బాగా ఆకట్టుకున్నట్టు విశదమవుతుంది.

రాజ్యాంగ ప్రాథమిక హక్కులకు విరుద్ధము, మనిషి జీవనానికే ఈ హక్కు విరుద్ధమని జడ్జిగారు చేసిన నిర్ణయం సమంజసమా అన్న అనుమానం రాకమానదు

దానికి కారణాలు చాలా చెప్పనచ్చు, ముఖ్యంగా వివాహ హక్కులంటే లైంగిక చర్య ఒకటేకాదు. అందులోనూ భార్య పిటీషను వేసుకున్న కేసులలో ఆమె భర్తను బలాత్కారం చేయదుకదా అందుచేత స్త్రీల రక్షణార్థం ఈ సెక్షను రద్దు పరుస్తున్నామన్నది పై సమయాలలో నిజం కాదు.

తరువాత సవ్యంగా సాగించే వివాహ జీవితంలో కూడా భర్తకు అమానుషంగా భార్యను అనుభవించే హక్కు ఏ చట్టము యివ్వదు. అట్టి చర్య జరిగినా అది నేరంగానే అవుతుంది. ఈ విషయ పరిశీలన జడ్జిమెంటులో ఎక్కడా కనిపించదు

అదీకాక హిందూ వివాహ చట్టం, ఒక సెక్షనులో కోర్టులు దాంపత్యం అనుకూలంగా జరిగేటట్టు కృషి చేయాలని, వీలయినంత వరకు భార్యాభర్తలను రాజీ కుదర్చడానికే ప్రయత్నించాలని కూడా తెలియ చేస్తుంది, ఈ విషయాలు కూడా జడ్జిమెంటులో ప్రాముఖ్యం చేసుకోక పోవడం మన దురదృష్టం.

— వేలూరి వెంకటరామయ్య

పడుతున్నారు. విచ్చలవిడిగా తిరిగే సభ్యులు ఉన్న "గే" క్లబ్బులలో ఈ రోగాన్ని గురించిన భయం ఎక్కువగా ఉన్నది. స్మశానాలలో ఈ రోగంతో చనిపోయిన వారిని సమాధి చేయటానికి కొన్ని చోట్ల అంగీకరించటం లేదని కొన్ని వార్తలు వస్తున్నాయి.

రక్తదాన శిబిరాలలో స్వజాతి సంపర్కం గల పురుషుల రక్తం స్వీకరించబడటం లేదు. అమెరికన్ రెడ్‌క్రాస్ సంస్థ వారు కూడా ఇటువంటి కట్టుదిట్టాలే చేశారు ఈ రోగాన్ని గురించిన భయంవల్ల రక్తదానాల సంఖ్య తగ్గిందట.

స్వజాతి సంపర్కం అలవాటు గల పురుషులలో రోగం సంక్రమిస్తే వారికి సహాయం చేయటానికి కొన్ని స్వచ్ఛంద సంస్థలు వెలిసాయి. సియాటిల్ నగరంలోని చికెన్ సూప్ బ్రిగేడ్ వీటిలో ఒకటి. వీరు ఈ రోగులకి ఆహారం ఇవ్వటం ఇతర అవసరాలు తీర్చటం మొదలయినవి చేస్తున్నారు

స్వజాతి లైంగికకలయికకీ, రోగలక్షణాలు రావటానికీ గల కాలవ్యవధి ఎక్కువ అవటంవల్ల,

## ..."ఎయిడ్స్" వ్యాధి

ఈ రోగం వస్తుందేమో అనే భయం ఈ రకం వారిలో చాలా రోజులపాటు ఉండటం సహజమే కదా !

బోస్టన్ నగరంలోని జిప్ ఫిషమెన్ అనే సైకియాట్రిక్ సోషియల్ వర్కర్‌కి ఈ రకం పురుషుల వద్దనుండి, శరీరంలో ఏ మాత్రం మార్పున్నా (రోగం లేకుండానే) ఎయిడ్స్ ఏమో అనే అనుమానంతో వచ్చే టెలిఫోన్ పిలుపులు ఎక్కువ అయ్యాయి.

స్వజాతి సంపర్కం అలవాటుగల కొందరు, వారి పార్ట్‌నర్లను ఈ రోగాన్నిగురించి ప్రశ్నించి ప్రస్తుతం సంపర్కం పొందుతున్నారట. మరి కొందరు, వివాహంచేసుకోమని శపథం చేస్తున్నారట. మరికొందరు ఈ రోగం చిన్న వారితో సంసర్కం పొందటంవల్ల వస్తున్నది కాబట్టి, వయస్సుమీరిన వారితోనే వారి కార్యక్రమాలు కొనసాగిస్తున్నారట ! అమెరికాలోని తీరప్రాంతాలలో విచ్చలవిడిగా తిరిగే మనుషులున్న బార్లలో కస్టమర్లసంఖ్య 10నుంచి 20శాతం తగ్గిందట రోగనిరోధక మందుల అమ్మకం, నిరోధ్‌లవాడకం ఎక్కువఅవటం మరొక విశేషం.

స్వజాతి సంపర్కం కలిగి, ఎయిడ్స్ రోగం వచ్చిన వారు వీలయినంత మందిని రోగగ్రస్తులను చేయాలని కంకణం కట్టుకొన్నట్లుగా కొన్ని వదంతులు వస్తున్నాయి. ఈ భయం ఇలా ఉండగా ఈ అలవాటు ఉన్నవారిలో 10 శాతం తమ కార్యక్రమాలను ఇంకా ఉధృతం చేశారు 30 శాతం మాత్రమే వారి అలవాట్లను మార్చుకొన్నారట !

పై విషయాల దృష్ట్యా అమెరికా వంటి దేశాలలో రోగాలకి గాను ఎంత తీవ్రంగా చర్చలు జరుగుతాయో తెలియ వస్తుంది మన దేశంలో ఈ రోగం వంటివి ఉన్నా బయటకి రావటానికి తగిన వాతావరణం లేదు అన్ని రోగాలకీ నిలయమైనట్లు ఈ రోగం కూడా మన దేశంలో ఉందేమో అని వైద్యులు జాగ్రత్తగా గమనించవలసి ఉంటుంది.

— డాక్టర్ కె. వెంకటేశ్వరరావు*

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక




## [16 - 9 - 1983]

## వినాయక చవితి సంచిక

# వజ్రోత్సవ సంచికగా వెలువడుతుంది!

**1908** లో వినాయక చవితినాడు వారపత్రికగా జన్మించిన ఆంధ్రపత్రిక తెలుగువారికి చేస్తూవచ్చిన సేవ ఇంతా అంతా కాదు. ఇప్పటికి ఏడున్నర దశాబ్దాలుగా ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఆంధ్రుల ఆదర్శాలకి, ఆశయాలకీ, వారి సంస్కృతికీ ప్రతిబింబంగా ఉంటూ వచ్చింది. పాఠకులు, ఇతర శ్రేయోభిలాషుల ఆదరాభిమానాలతో, మరింత ఉత్సాహంతో ఈ సేవని కొనసాగించాలన్న కృతనిశ్చయంతో ఉంది.

తెలుగువారి సర్వతోముఖ వికాసానికి 75 సంవత్సరాల కాలంలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక చేస్తూ వచ్చిన కృషి ఎటువంటిదో కొంతవరకయినా ఈ వినాయక చవితికి వెలువడే వజ్రోత్సవ సంచిక తెలుపగలదు!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికలో అప్పటివారివి, ఇప్పటివారివి ఎన్నో రచనలు ఉంటాయి — కథలూ, వ్యాసాలూ, కవిత్వం, బొమ్మలూ మొదలయినవి!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచిక కనీసం రెండు వందల పేజీలతో, పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో వెలువడుతుంది!

**నేడే మీ కాపీ రిజర్వు చేసుకోండి!**

సీరియల్

# వాసన మురళి

కొడాలి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

ఆమె అంచనా తారుమారయింది !

ఆమె ఆలోచనకు భిన్నంగా జరగడంతో బలి పశువులా తల దించేసుకుంది. కళ్ళు మూసుకుంది. మూసుకున్న కనుల మాటున వెచ్చని కన్నీళ్ళు ...!

సరిగ్గా అదే సమయంలో గుడికి వెళ్ళిన రాజమణి తిరిగి వచ్చింది. ఆ దృశ్యం చూసి అవాక్కయిపోయి చేతిలోని పూజా పళ్లెరాన్ని అలాగే క్రిందికి వదలేసింది

"కన్నా !–" అని భవనం దద్దరిల్లేలా అరిచింది.

ఆ అరుపుకు ఇద్దరూ ఉలికిపాటుతో తలలు త్రిప్పి చూసేరు.

దూకుడుగా వచ్చిందామె.

"ఒరేయ్ కన్నా ! ఏమిట్రా నీవు చేసిన పని ? మురళి మెడలో తాళి కడతావా ? నీకే మహమ్మారి పూనిందని ఇంతటి దారుణానికి వడికట్టావురా దౌర్భాగ్యుడా ? అది పసుపు తాడు కాదురా ఉరిత్రాడు ! మృత్యు ముఖంలో తల దూర్చిన నీకు పెళ్ళి కావాల్సి వచ్చిందా ? రేపో మాపో చావబోయే వాడికి నీ కెందుకురా పెళ్లి ? అభం శుభం తెలియని పిల్ల గొంతు కోసావు గద్రా నీమడా !–" ఆవేశంతో ఊగిపోతూ మనవడి చెంపలు వాయగొట్టింది రాజమణి.

"అమ్మగారూ !" అంటూ దీనంగా కన్నీళ్లతో అడ్డుకుంది మురళి.

శివశంకర్ ఖిన్నుడై పోయాడు. పిచ్చి చూపులు చూస్తున్నాడు.

ఆవేశంలో రాజమణి నిజాన్ని కక్కింది. శివశంకర్ గుండెల్లో బాంబులు పేలాయి.

"గ్రానీ! నేను తొందరపడ్డ మాట నిజమే! కానీ... ఇలా చచ్చిపొమ్మని శపించడం ధర్మమా? నేను అంత కాని పని ఏం చేసాను? మా ఇద్దరికీ పెళ్లి ఖాయం చేసింది నీవే గదా ?"

"నోర్ముయ్! నేను శపించడం కాదురా, నీకు బ్లడ్ క్యాన్సర్. ఎక్కువ రోజులు బ్రతకవని డాక్టర్లు చెప్పారు. కనీసం ఈ నాలుగు రోజులన్నా తృప్తిగా వుంటావని మురళిని బ్రతిమాలి తీసుకు వచ్చాను. మన కోసం తన జీవితాన్ని త్యాగం చేసిన మురళికి నీ వేం బహుమతి ఇచ్చావు ? ఘోరంగా పరాభవించావు. నిన్నా దేవుడు కూడా క్షమించడు –"

శివశంకర్ తల తిరిగిపోయింది.

"గ్రానీ ! నాకు బ్లడ్ క్యాన్సరా ? నిజంగా నాలో అంతటి భయంకరమైన జబ్బు వుందా ? మరి న్నాళ్ళూ నాకా విషయం ఎందుకు చెప్ప లేదు ?–"

"నిజం తెలిస్తే, నీ గుండె ఎక్కడ ఆగిపోతుందోనని – ఇన్నాళ్ళూ గరళం లాంటి ఆ నిజాన్ని కడుపులో దాచుకున్నాను. నీ సంతోషం కోసం పాటుపడ్డామంతా. ఈ రోజు నీవు చేసిన పాడు పనికి నా కడుపు మండింది–" అని పవిట చెరుగుతో కళ్లు వత్తుకుని మురళి వంక జాలిగా చూస్తూ "అమ్మా ! మురళీ ! జరిగిన దానికి నేనెంతో విచారిస్తున్నాను. వాడు పిచ్చివాడు. ఆలోచన లేకుండా వెధవపని చేసాడు. ముందా పసుపు తాడు త్రెంచేయ్ –" అన్నది రాజమణి.

"అమ్మగారూ !" బాధగా ఆర్ద్ర నయనాలతో చూసింది మురళి.

"అవునమ్మా. ఆ తాళికి కట్టుబడితే నీ జీవితంలో వెలుగుండదు. ఇప్పుడు నీవు తీసేయక పోయినా, కొద్ది రోజులలోనయినా తెగిపోక తప్పదు."

గుండెల్లో గునపం దించినంతగా బాధపడి పోయింది మురళి.

శివశంకర్ వదనం గంభీరంగా మారి పోయింది.

"మురళీ ! నన్ను క్షమించగలవా? ఆవేశంలో తొందర పడ్డాను. నాకు అనారోగ్యమని నిజంగా తెలీదు. తెలిస్తే, ఇంత సాహసం చేసేవాడిని కాదు. ఇలారా... నేను కట్టిన తాళి నేనే తెంచేస్తాను."

మురళి చప్పున రెండుడగులు వెనక్కి వేసి తీవ్రంగా చూసింది.

"శంకర్ ! నీవు ఏ ఉద్దేశ్యంతో నామెడలో ఈ తాడు కట్టావో నాకు తెలీదు. ఎలాగయితేనేం నా మెడలో పసుపు తాడు కట్టి నన్ను నీ భార్యగా చేసుకున్నావు. జరిగిన దాన్ని కాదనే సాహసం నాకు లేదు.

ఎంతయినా నేనూ ఆడదాన్నే ...!

నాకూ ఒక మనసుంది. నీవు తాళి కడతానంటే తల వంచడం – త్రెంచుతానంటే తల దించడం... ఒకసారి తల దించాను. మళ్లీ దించలేను. నాకా శక్తి లేదు. దయచేసి నన్నిలాగే వదిలేయండి –" అని కన్నీళ్లను ఆపుకోలేక అక్కడ నుండి వెళ్లిపోయింది మురళి.

శివశంకర్ నిరుత్సాహంగా అక్కడే కూలబడి పోయాడు.

రాజమణి హృదయం ఆవేదనతో అలమటించి పోతోంది.

**జరిగిన కథ – 5:** విజయ్, మురళి కాశీకి పోతూ రైల్లో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. విజయ్ గడిచిపోయిన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు – విజయ్ పోలీసు ఇన్‌స్పెక్టరుగా ట్రయినింగ్ అవుతున్నాడు. మురళి ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తూంటుంది. మురళి మంచితనం చూచి ఆమెను ప్రేమిస్తాడు విజయ్. మురళితో తను ఆమె స్నేహాన్ని కాంక్షిస్తూన్నట్లు చెపుతాడు. మురళి పిన్ని తన చిన్నాన్న కొడుకు పెళ్ళికి వెళ్ళేందుకు డబ్బు కావాలని మురళితో ఘర్షణ పడుతుంది. అందుకై మురళికి డబ్బు సహాయం చేస్తాడు విజయ్. ఇష్టపడితే ఆమెను వివాహం చేసుకుంటానంటాడు ఆమె తన నిర్ణయం తెలిపేందుకు కొంచెం టైమ్ కావాలని కోరుతుంది. విజయ్ ప్రేమను అంగీకరిస్తుంది మురళి. శివశంకరం మురళిని తన ప్రియురాలు మీనాగా భ్రమ చెందుతాడు. తన మనవడి కోరికపై రాజమణి మురళిని తన ఇంటి కోడలుగా చేసుకుంటానని మురళి పిన్నికి చెపుతుంది. కారణం చెప్పకుండా విజయ్‌ను దూరమవ్వమంటుంది మురళి. పుష్కరాల్లో దొరికిన తనను పెంచి పెద్ద చేసిన వారి కోసం త్యాగం చేయాలనుకుంటుంది మురళి. శివశంకర్‌కు బ్లడ్ కేన్సర్ అని తెలిసి దిమ్మెరపోతుంది. ఈ విషయం ముందే తెలిసి ఉంటే విజయ్‌ను దూరం చేసుకునుండను కదా ! అని వాపోతుంది. శివశంకర్ మురళి సాహచర్యంలో ఉల్లాసంగా, ఆనందంగా ఉంటూంటాడు. ఒకరోజు మురళి శివశంకర్ కోరికను తిరస్కరిస్తుంది. అతను ఆమెను మురళీప్రియగా గుర్తిస్తాడు. ఆమె ఆ విధంగా నాటకమాడుతున్నది తన డబ్బు కోసమే అని నిందిస్తాడు. ఊహించని విధంగా అతను ఆమె మెడలో పసుపుతాడు కడతాడు.

## 11

ఆ రాత్రి మురళికి ఎంతకూ నిద్రపట్ట లేదు. జరిగినది తలుచుకుంటే ఆమె గుండెలో అవ్యక్తమైన బాధ రగులుతుంది. ఆలోచనలు మెదడును కొరుక్కు తింటున్నాయి.

'ఎందుకు తను బాధపడుతుంది ? శంకర్ తనను వంచించాడా ? లేదు. ఈ ఇంట్లో ఆడుగు పెట్టకముందే తన పెళ్లి శంకర్‌తో ఖాయమయింది. తను ఔనన్నా కాదన్నా జరిగి పోయేది. కాకపోతే కాస్త తేడాలో ఇప్పుడు తనకు పెళ్లి జరిగింది !

ఇది పెళ్లి కాదని ఎలా అనుకోవడం ?

తను ఈ గడ్డమీద పుట్టింది. ఈ గాలి పీల్చింది. ఈ సంస్కృతిని గౌరవిస్తుంది. అలాంటప్పుడు తాళి పవిత్రత తనకు తెలీదా ? తాళి కట్టినవాడు తనకు భర్త కాకుండా ఎలా పోతాడు, తను అతని భార్య కాకుండా ఎలా పోతుంది.

అనుకున్నది వేరు — జరిగింది వేరు !

అనుకున్నది జరగలేదని బాధ పడేకన్నా — జరిగినదానితో రాజీపడిపోవడం జీవితాన్ని ఉన్నంతలో దిద్దుకోవడం మంచి పని.

శంకర్ తనకు భర్త ! తను అతని భార్య !

తన ధర్మాన్ని తను నిజాయితీగా నిర్వర్తించాలి.

తన అదృష్టం ఎలావుంటే అలా జరుగుతుంది — ' అని తనను తాను ఓదార్చుకుని రాజీపడిపోయింది మురళి.

* * *

"నా మీద కోపం లేదా మురళీ ? — !"

శివశంకర్ మాటలకు శాంతంగా నవ్వింది మురళి. ఇప్పుడామె ముఖం నిండుగావుంది. మెడలో మిలమిల మెరిసే మంగళసూత్రాలు. నుదుట గుండ్రని ఎర్రని సింధూరము, జాత్తు



## మానస మురళి

పైకి ఎగదువ్వి చుట్టుకున్న కొప్పు! ఈ అలంకరణ ఆమెకు హుందాతనాన్ని ఇస్తున్నాయి.

ఒకరకంగా చెప్పాలంటే మురళి చాలా మారిపోయింది నిండుగా ప్రవహించే పవిత్ర గోదావరిలా వున్నది ఆమె మనసులో మరే ఆలోచనలులేవు. తన భర్తకు సేవలు చేస్తూ ఆయన మనసు కష్టపడకుండా చూసుకోవడమే ఆమె లక్ష్యం!

శివశంకర్ మళ్ళీ అదే ప్రశ్న వేసాడు

"మురళి నీకు నా మీద కోపం రావడం లేదా ? నన్ను అసహ్యించుకుంటావనుకున్నాను"

"కోపమా! దేనికి? మీరేం చేసారు? విధాత రాసినట్లు జరిగింది. ఇది భగవంతుని ఆజ్ఞ అనుకుంటున్నాను. శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా చావదన్నట్లు — అంతా ఆ దేవదేవుడు ఆశించినట్లే జరిగింది. మీ మీద నాకెలాంటి కోపాలు లేవు —" చిరునవ్వుతో అన్నది.

ఆమెలో వచ్చిన మార్పు అతను స్పష్టంగా గమనించాడు. అతని మనసు చివ్వుక్కుమన్నది. కానీ ... ఎక్కడో అతనికి తెలియకుండా అంతరాంతరాల్లో ఏదో హాయి ... మాటల కందని సందడి ...! అంతలోనే ఏదో నిరాశా మేఘాలు చుట్టేసినట్లు విపరీతమైన బాధ!

"నీవు మంచిదానివి కాబట్టి సమర్థిస్తున్నావు. నేను మాత్రం నీకు చాలా అన్యాయం చేసాను. రేపో మాపో చావబోతూ నీ మెడలో ఉరిత్రాడు బిగించాను. ఈ పాపం నన్ను జన్మ జన్మలకు వెంటాడుతుంది —" అతని కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

"నాకు అన్యాయమే జరిగిందో, న్యాయమే జరిగిందో మీ కెలా తెలుసు ?"

"స్పష్టంగా తెలుస్తుందిగా! లేకుంటే నా తొందరపాటుతో నీ జీవితాన్ని బలిగొంటానా? ఇంతకన్నా పాపం ఏం కావాలి ? —"

"దయచేసి ఇంకోసారి అలా మాట్లాడకండి. నాకు సంతోషంగానే వుంది మీరు తిరిగి కోలుకుంటారు అనవసరంగా విచారించక విశ్రాంతి తీసుకోండి —"

అతను నవ్వుతున్నాడు విరక్తిగా!

"మురళీ! నీ మంచితనంతో నేను చేసిన పాపాన్ని కప్పిపుచ్చుతున్నావు నా స్వార్థంతో విచక్షణ మరిచి నీ మెడలో తాళికట్టాను ఆ తాళి కొద్దిరోజులకే తెగిపడుతుందని ఆ సమయంలో తెలియదు తెలిసి చేసినా, తెలియక చేసినా నేను తొందరపడ్డాను పాపం చేసాను నేను బాధ పడతానని సంతోషంగా వున్నట్లు నటిస్తున్నావు భగవంతుడా! ఆమెకు అన్యాయం చేయకు కనీసం ఆమె తృప్తికోసమైనా నన్ను నాలుగురోజులు బ్రతకనివ్వు ఇంతకన్నా జీవితంలో మరె కోరికా కోరను ఇదే కడకోరిక—"

అని అనుకుని రెండు వెచ్చని కన్నీటి బొట్లును జారవిడిచాడు శివశంకర్.

మురళి కోసమైనా తను నాలుగురోజులు పచ్చగా బ్రతకాలని సకల దేవతలను తలచుకున్నాడు శివశంకర్. ఏ ఒక్క దేవతా అతని కోరికను మన్నించలేదు. ఎప్పుడో నెల ... రెండు నెలల తరువాత చనిపోతాడనుకున్న మనిషి మూడోరోజే ఈలోకం వదిలి మృత్యు కౌగిలిలోకి వెళ్ళిపోయాడు.

సరిగ్గా మురళి మెడలో మూడే మూడు రోజులు నిలిచింది అతను కట్టిన తాళి.!

మనిషి జీవితం క్షణ భంగురమే అని తెలిసినా దానిమీద మమకారం పెంచుకోకుండా వుండలేరు. మనిషి జీవితాన్ని ప్రేమించినంత గొప్పగా దేన్నీ ప్రేమించలేడు. మురళి ఒకనాడు జీవితాన్ని గురించి గొప్ప కలల్ని కనలేదు. కానీ విజయ్‌ను చూసాక, అతని ప్రేమ చవిచూసాక జీవితం మీద ఒక రకమైన మమకారం పెంచుకుంది.

ఆమె ఊహించుకున్న అందమైన స్వప్నం చెదిరిపోయింది.

అనుకోకుండా భర్త అయిన శివశంకర్ ఇంత త్వరగా వెళ్ళిపోతాడని కూడా ఆమె ఊహించలేదు. ఆమె ఊహాలకు అందకుండా మలుపులు తిరుగుతోంది ఆమె జీవితం !

శివశంకర్ చనిపోతే తరువాత తన జీవితం ఏమిటి ? అన్న ప్రశ్నను ఆమె తాళి కట్టించుకున్న క్షణంగానీ, ఆ తరువాతగానీ ఆలోచించలేదు. తీరా అతను పోయాక ఆలోచిద్దామంటే — పోతూ పోతూ శివశంకర్ తనను మరో పంజరంలో బంధించి వెళ్ళాడు. వెళ్ళేముందు మురళి చేత మాట తీసుకుని వెళ్ళాడు.

"మురళీ ! మంచికో చెడుకో మనిద్దరి జీవితాలు కలిశాయి. నీకు ఎలాంటి న్యాయం చేయకుండానే వెళ్ళిపోతున్నందుకు నాకూ బాధగానే వుంది. నిజానికి నీకీ న్యాయం చేసినా సరైన న్యాయం అనిపించదు.

అందుకని ... " అని ఆయాసంతో ఆగిపోయేడు శివశంకర్.

అప్పటి అతని పరిస్థితి క్షణాలమీద వున్నది. ఒకప్రక్క జమిందారు రాజమణిగారు, మరో ప్రక్క మురళి — నౌకర్లు చాకర్లు అంతా అతని పరిస్థితి ఏమవుతుందోనని ప్రాణాలు అరచేత బట్టుకుని చూస్తున్నారు. అంతకు ముందు డాక్టరుగారు వచ్చి పెదవి విరిచి వెళ్ళిపోయారు.

శివశంకర్‌కు తను చచ్చిపోతున్నానని తెలిసింది కాబోలు — ఒకసారిగా స్వార్థాన్ని పెంచేసుకున్నాడు.

"చెప్పండి ... ఆగిపోయారేం ? ఏమిటి మీ ఆరాటం ? —" కన్నీళ్లతో బేలగా అడిగింది మురళి.

శివశంకర్ ఏదో చెప్పాలని ఆరాటపడుతున్నాడు.

గుండెలోని కోరిక గొంతులోకి వచ్చి ఆగిపోతుంది. స్వార్థం తన్నుకువచ్చి ఆ కోరికను బయటకు నెట్టాలని ప్రయత్నిస్తుంది. అతనిలో మిగిలిన మానవత్వం ఆ కోరికను బయటకు రానీయకుండా గొంతు కడ్డం పడుతోంది.

కొద్దిసేపు విపరీతమైన సంఘర్షణను అనుభవించాడు.

చివరకు తన కోరికను చెప్పలేక చెప్పాడు.

"మురళీ ! నీవు ఇలాగే ... నా భార్యగానే మిగిలిపోవాలి. పండు వెన్నెల లాంటి నీ వ్యక్తిత్వమూ, పాల లాంటి స్వచ్ఛమైన నీ మనసు — మరులుగొలిపే నీ సొగసు —మమతలు పొంగే నీ కనులు ... అన్నీ ... నీలో అన్నీ ... నాకే...నాకే కావాలి ! నీ తలపుల్లో నే నుండాలి. నీ మనసులో నేను మిగిలిపోవాలి. భౌతికంగా నేను నీకు దూరమైనా — నా ఆత్మ మాత్రం నీ చుట్టూనే పరిభ్రమిస్తుంది. నా భార్యవైన నీవు నా భార్యగానే ఎప్పటికీ మిగిలిపోవాలి. ఇదీ స్వార్థం — తీరుస్తావా ? —"

మురళి హృదయం ముక్కలవుతోంది. విచిత్రమైన — బలమైన అతని కోరికకు తల వంచాలో — లేక అతన్ని బ్రతికించుకోవాలని ఆరాటాపడాలో అర్థం కాలేదు. తాళి కట్టిన వ్యక్తి దూరమవుతున్నందుకు బాధపడాలో — అతని కోరికను మంచి మనసుతో మన్నించాలో వెంటనే బోధపడ్లేదు.

చివరకు అతనికి మాటిచ్చింది !

"శంకూ ! నీవెందుకు ఇలాంటి కోరిక కోరుతున్నావో నే నర్థం చేసుకోగలను. నాలో నీకు మీనా కనిపిస్తుంది కదూ ? నీ మీనా లాగే వుండిపోతాను. సరేనా ? —"

శివశంకర్ ఆనందంగా, తృప్తిగా గెలిచి ఓడిపోయాడు !

మురళి బాధగా, ఆర్తిగా అతన్ని గెలిపించి తనూ ఓడిపోయింది !

* * *

గదిలోకి చీకటి ప్రవేశించి చాలా సేపయింది. మురళి గడ్డం క్రింద చేతులు పెట్టుకుని మంచం మీద కూర్చునివున్నది. ఆమె చూపులు కిటికీ లోంచి కనిపిస్తున్న శూన్యఆకాశంలోకి చొచ్చుకుని పోతున్నాయి. ఏదో అన్వేషించుతున్నట్లువున్నాయి ఆమె చూపులు అలా చాలా సేపటినుంచి కూర్చుని వుంది. గదిలో లైటు వేసుకోవాలన్న ధ్యాస కూడా మరిచిపోయింది.

రాజమణి అక్కడకు వచ్చింది. వస్తూనే లైటు వేసింది. గుప్పున వెలుగు ఆ గదంతా ప్రాకింది. ఆ వెలుగులో ఒకర్ని ఒకరు చూసుకున్నారు.

"ఎందుకమ్మా చీకట్లో కూర్చున్నావు ?" ఆమె చేతిలోని సూట్ కేసును టేబిల్ మీద పెడుతూ అన్నది రాజమణి.

"అలవాటు చేసుకుంటున్నాను—" భారంగా నిట్టూర్చింది మురళి.

"దేనిని ? —"

"చీకట్లో కూర్చోవడానికి — "

"అవసరంలేదు. స్విచ్ మన చేతికి అందేంత ఎత్తులోనే వున్నది. కాస్త ఓపికతెచ్చుకుని లేచి లైటు వెలిగిస్తే వెలుగుతుంది— "

"అంత ప్రయాస పడడానికి మనస్కరించడంలేదు — "

"ఒక్కోసారి ప్రయాసపడక తప్పదు. చీకట్లోకూర్చునే అవసరం నీకు లేదమ్మా. స్వేచ్ఛగా తిరిగే నిన్ను తెచ్చి ఇన్నాళ్లూ బంగారు






పంజరంలో బంధించాను. మా స్వార్థంకోసం నీ సుఖ సంతోషాల్ని హరించేశాము. వాడితోపాటే మా స్వార్థాలు చచ్చాయి. ఇక పంజరం అనవసరం. ఆ తలుపులు తెరుస్తాను స్వేచ్ఛగా నీ కిష్టమైన తావుకు ఎగిరిపోమ్మా... ఇదిగో ఇది నీ ఆస్తి. నీ వెంట వీటినికూడా తీసికెళ్లు..." సూట్‌కేసు తెరిచి చూపించింది రాజమణి.

దాని నిండా బంగారునగలు— కరెన్సీ కట్టలు వున్నాయి.

మురళి వేదనా భరితంగా నవ్వింది.

"నన్ను చాలా తప్పుగా అంచనా వేసుకున్నారు. నా కెలాంటి వ్యామోహాలు — కోరికలు లేవు. నా కేమీ అక్కర్లేదు. నేను ఈ ఇంటి కోడల్ని. ఈ ఇంటి పరువు మర్యాదల్ని నిలబెట్టడం నాధర్మం. మీరు వెళ్లమన్నా నేను వెళ్లదలుచుకోలేదు. శాశ్వతంగా ఇక్కడే వుండిపోతాను. నా కింత అన్నంపెట్టండి చాలు..."

రాజమణికి దుఃఖం ఆగలేదు. "మురళీ! ఎందుకమ్మా మా మీద నీ కింత దయ? నీకేం మిగిల్చామని ఇంకా ఈ కుటుంబ పరువు ప్రతిష్ఠల్ని గురించి ఆలోచిస్తున్నావు? వద్దు తల్లీ.. వద్దు. ఇప్పటికే నీకు చాలా ఋణపడి వున్నాము. నామాట విను. నీవు ప్రేమించిన అతన్ని పెళ్లి చేసుకుని సుఖంగా వుండు. నీ పెళ్లి నేను జరిపిస్తాను— "

"అమ్మగారూ!— " గుండెలో బలంగా బాకు దిగినట్లు విలవిల్లాడి పోయింది మురళి.

"నామాట విను తల్లీ..."

"వద్దు... నా కలాంటిమాటలు చెప్పకండి. నన్నిలా వుండనివ్వండి. నేను ఇలా వుండడమే శంకూకు సంతృప్తి. అతని మాటను వమ్ము చేయలేను. దయచేసి మరోమారు ఆ మాట మాత్రం అనకండి—" అని అక్కడనుంచి లేచి వెళ్లి పోయింది మురళి.

రాజమణి నీళ్లనిండిన కళ్లను పవిట చెరుగుతో వత్తుకుంటూ "మాఇంటి దేవతమ్మా నీవు... నీ మంచితనంతో ఈ ముసలి గుండెను పగలగొడుతున్నావు—" అనుకున్నది.

* * *

మురళి చెప్పిన కథ విని సానుభూతిగా చూసాడు విజయ్.

"ఐయామ్ సారీ మురళీ! నిన్ను అపార్థం చేసుకున్నందుకు ఇప్పుడు సిగ్గుపడు తున్నాను. భగవంతుడు నాకన్నా నీకే ఎక్కువ అన్యాయం చేసాడు. నీ వెనుక ఇంతటి విషాదకథనం వుందని తెలియదు— "

మురళి నవ్వింది నిర్వేదంగా.

"నా సంగతి కేంగానీ, నీ విషయం చెప్పలేదు — "

"ఒక రకంగా మనం రాగవంచితులం! కోరుకున్నవి దక్కలేదు. దక్కిన వాటితో రాజీపడబోతే చివరకు అవీ మిగల్లేదు. మనంమిగిలేం" విజయ్ కంఠం సన్నగా కంపించింది. అతని మాటలు— ఆ మాటలు వెనక గూడుకట్టుకుపోయిన విషాదం ఆమెను కదిలించాయి. అతని విషయాలు తెలుసు కోవాలనుకున్నది.

"ఎందుకలా జరిగిందంటావు? — "

"ఏమో! బహుశా జీవితం అంటే అదే కావచ్చు... "

"ఏం జరిగిందో చెప్పు. వింటాను."

"చెబుతాను. నీ కథ విన్నాక నాలో తపన మొదలయింది. ఇది తగ్గాలంటే గుండెలోనిభారం దించుకోవాలి..." అని విజయ్ తన కథ చెప్పసాగేడు.

రైలు వేగంగా వెళుతూనే వున్నది. వర్షం ఇంకా పడుతూనే వున్నది...!

## కాఫీ మ్యూజియం!

ప్రపంచంలోనే మొట్టమొదటి కాఫీ మ్యూజియాన్ని జపానులోని కోబే నగరంలో నిర్మిస్తారు. ప్రపంచంలో సుమారు 20 దేశాలలో కాఫీని ఉత్పత్తి చేస్తున్నారు. కాఫీ గింజల ఉత్పత్తి మొదలుకుని కాఫీ వాడకం వరకు వివిధ దశలను ఈ మ్యూజియంలో ప్రదర్శిస్తారు. వాడకం దార్ల ఫిర్యాదులను కూడా ఈ ప్రదర్శనలో పరిశీలిస్తారు. జపానులోని యేషిమా కాఫీ కంపెనీ స్వర్ణోత్సవాల సందర్భంగా ఈ మ్యూజియాన్ని నిర్మిస్తున్నారు. ఇందులో ఒక గ్రంథాలయం, పరిశోధకుల కోసం ఒక లేబొరెటరీ, వాడకందార్లకు కాఫీని కలపడం తెలియచేసేందుకు డిమాన్‌స్ట్రేషను సౌకర్యాలను ఇందులో ఏర్పాటుచేస్తారు. ఈ మ్యూజియం నిర్మాణం వచ్చే వసంత కాలానికి పూర్తికాగలదు.

## 12

"నీ విలాంటిదానివను కోలేదు—"

"నే నెలాంటి దాన్నయితే నీకేం? నీక్కావలసింది సుఖం. నాక్కావల్సింది డబ్బు, నా ఇష్టాఇష్టాలు గుణగణాలతో నీకనవసరం.—" రవ్వంత రోషం ధ్వనించింది మానస స్వరంలో.

సుకుమార్ సున్నితంగా నవ్వి "ఓ. కే. ఎప్పుడు కలుద్దాము?—" అడిగాడు.

"నీ ఇష్టం—" ఎటో చూస్తూ అన్నది మానస.

అతను ఒక్కక్షణం ఆగి "రాత్రి ఎనిమిదికి మంజూ లాడ్జిలో రూమ్ బుక్ చేయనా?" అని అడిగాడు.

"ఎక్కడికి రమ్మన్నా వస్తాను. ఆ టైమ్‌లో మాత్రం కాదు—"

"ఏం? వేరే ఏదయినా ఎంగేజ్‌మెంటు వున్నదా?—" చిలిపిగా నవ్వాడు.

మానస తీవ్రంగా చూసింది అతను తగ్గాడు. ఆమె ఆంతర్యం అతనికి అవగతం కావడం లేదు. తనతో వస్తానంటుంది. చనువు తీసుకోనీయదు. గంభీరంగా ఎదుటి మనిషిని అల్లంత దూరాన నిలబెడుతుంది. ఏది ఏమయినా వచ్చిన ఛాన్సును మిస్ చేయకూడదు' అనుకున్నాడు సుకుమార్.

"సాయంత్రం ఆరుకే వస్తాను."

"అలాగే. నీ కోసం వెయిట్ చేస్తూ వుంటాను..." హుషారుగా ఈల వేయబోయి ఆమె తీవ్రమైన చూపులకు గతుక్కుమని తగ్గిపోయాడు.

అతని పరిస్థితి చూసి చిన్నగా నవ్వుకుంది మానస. 'అబ్బ! ఇప్పటికి చంద్రోదయమయింది, బండి దార్లోకి వస్తోంది—' ఉత్సాహంగా అనుకున్నాడు సుకుమార్.

"అడ్వాన్సు ఇచ్చి ఇక నీవు వెళ్లవచ్చు."

సుకుమార్ పర్సు తెరిచి వంద కాగితాన్ని విలాసంగా అందించేడు. మానస ఆ నోటును నిర్లక్ష్యంగా అందుకున్నది.

"తప్పకుండా వస్తావుగదూ" వెళ్లబోతూ మరోసారి అడిగాడు.

"మాట తప్పడం నా రక్తంలో లేదు."

"ఓ, కే... ఆరు గంటలకు మంజూలో కలుద్దాం—"

"మిస్టర్... నీ పేరు?"

సుకుమార్ ఆగి చెప్పాడు. ఇక నీవు దయచేయవచ్చు— అన్నట్లుగా చూసింది మానస. అమితోత్సాహంతో అతను వెళ్లిపోయాడు. వంద నోటును బ్యాగ్‌లో పెట్టుకుంటూ నీరసంగా నవ్వుకుంది మానస.

'వందరూపాయలు... తన శీలం ఖరీదు... డబ్బున్న మహారాజులకు తనో విలాస వస్తువు. ఎవరైనా తన శరీరాన్ని కొనుక్కోవచ్చు. అందగాడు గానీ, కురూపిగానీ, ముసలివాడు— పడుచు కుర్రాడు తరతమభేదం లేదు. తన దృష్టిలో అందరూ ఒక్కటే!

ఎందుకు?

డబ్బుకోసం...!

తన వాళ్లను బ్రతికించడం కోసం...

* * *

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది!

హోటల్ మంజూ ఆ నగరంలోకెల్ల పెద్ద హోటల్. ధనికులు, వ్యాపారవేత్తలు తప్ప చిన్న చిన్న వాళ్లకు అందుబాటులో వుండదు. సుకుమార్ ఏ. సి. రూములో కూర్చుని మానస కోసం ఎదురు చూడసాగాడు. అతనికి చాలా ఆరాటంగా వుంది. ఆమె ఆరుకొస్తానంటే ఇతను ఐదునుంచే ఎదురు చూస్తున్నాడు. మాటిమాటికి తలుపులవంకచూస్తూ ఒక్కొక్క గుక్క బ్రాందీని గొంతులోకి పంపిస్తున్నాడు.

# మీ పంటలకు కావలసిన పోషణ అందుతోందా?

## జై కిసాన్ సంపూర్ణ 19:19:19

## జై కిసాన్ యూరియా 46.4% నత్రజని

JAI KISAAN
SAMPURNA
19 : 19 : 19
GRS 50.5KG NET 50 KG
ZUARI AGRO CHEMICALS LTD
GOA

JAI KISAAN
UREA
46.4% N
GRS 50.6KG NET 50 KG
ZUARI AGRO CHEMICALS LTD
GOA

**పూర్తిగా నీటిలో కరుగుతాయి, అంచేత మొక్కలు మరింత ఎక్కువ పోషక పదార్థాలను పీల్చుకుంటాయి.**




- జైకిసాన్ సంపూర్ణ 19:19:19
  పోషక పదార్థములు 1.1:1 పాళ్లలో గల సంకీర్ణ ఎరువులలోకెల్లా మిన్నయైనది.
- నైట్రేట్–నత్రజని గల ఎరువులతో పోల్చితే, సంపూర్ణలోని నత్రజని ఏమీ వృధాపోదు.
- సంపూర్ణలోని పోషక పదార్థములన్నీ నీటిలో కరుగుతాయి.
- అందువలన పంటలపై దీని పనితనం తొందరగా కనబడుతుంది.
- జైకిసాన్ యూరియా 46.4%లో నత్రజని ఎంతో ఎక్కువ. బైయూరెట్ తక్కువ.
  అందుచేత ఇది అన్ని రకాలుగా వేయడానికీ, పంటపై పిచికారి చేయడానికి సురక్షితమైనది
- అతి తెల్లనిది, అతి శుద్ధమైనది, అతి శక్తివంతమైనది

# జై కిసాన్ ఎరువులు

## అత్యధిక దిగుబడి కోసం అత్యధిక పోషణ.




జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పూనా, జువారినగర్.

LINTAS ZUA 110 2315 TL








నరాలన్నీ తీయని బాధతో మూలుగుతున్నాయి. కళ్లముందు ఆమె రూపం కదలి పిచ్చెక్కిస్తోంది.

పొందబోయే అనుభవాన్ని తలపోస్తుండగా వచ్చింది మానస.

అతని ముఖం విప్పారింది.

ఆమె నవ్వింది చిన్నగా. ఆ నవ్వు అయస్కాంతంలా అతని మనసును ఆకర్షించి గిలిగింతలు పెట్టింది. చిలకపచ్చచీర ధరించింది. తెల్లని జాకెట్టు వేసుకుంది. వదులుగా అల్లుకున్న జడలో తెల్లని మల్లెలు తురుముకున్నది. ఆమె అలంకరణ చాలా సింపుల్‌గా వున్నా, సహజ సౌందర్యవతియైన మానస అతని కళ్లకు నవ మోహినిలా కనిపించింది, కైపులో ఊగిపోతూ గుటకలు మింగాడు.

తలుపు గడియపెట్టి అతని దగ్గరగా వెళ్లింది మానస.

''రావేమో ననుకున్నాను ఆలస్యమైపోతే—'' కుర్చీలోంచి లేస్తూ అన్నాడు సుకుమార్.

మానస అదోలా చూసి 'వందరూపాయలు అడ్వాన్సు ఇచ్చావు. రాకుండా ఎలావుండగలను?'' అన్నది.

అతను మంచంమీద కూర్చుని కళ్లతో దగ్గరకు రమ్మని సైగ జేసాడు. ఆ కళ్లలో కదం త్రొక్కుతున్న కోరికల్ని చూసి ఆమె పిచ్చి పువ్వులా నవ్వింది.

మనసులో జరిగే సంఘర్షణను అణచుకుని నవ్వుతూ అతని దగ్గరగా వెళ్లి నుంచుంది.

చటుక్కున ఆమెను అందుకోబోయాడు సుకుమార్.

ఆమె వారించింది.

''ముందా తతంగం పూర్తిచేయ్. నేను ఎక్కడికీ పోను—'' అన్నది మిగిలిపోయిన బ్రాందీ సీసాను చూపిస్తూ.

''వాటిని మించిన కైపు నీ అధరాల్లో వుంది —'' అంటూ చనువుగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. బ్రాందీ వాసన గుప్పుమని ఆమెకు

# మానస మురళి

కడుపులో త్రిప్పినట్లయింది. అయినా బలవంతాన మనసులో పుడుతున్న అయిష్టాన్ని అణుచుకున్నది. ఎదురుతిరుగుతున్న హృదయాన్ని జోకొట్టి రాజీపడింది.

''వంద రూపాయలు పోయినా మంచి సుఖాన్నే కొనుక్కున్నాను.''

''అచ్ఛా! నీకంత బాగా నచ్చానా?—'' ఇష్టంలేనట్లు నవ్వింది మానస.

## చంద 'మామ'

అలిగే అల్లుడు అడిగేవన్నీ
ఇవ్వక తప్పని ఇరకాటంలో
చిక్కిన మామగారికి
చివరకి మిగిలేది
ప్రతిదానికీ అప్పుకోసం
కొట్టుకుపోవడాలు
ఆ అప్పుల్లో
కొట్టుకు పోవడాలు
అప్పులవాళ్ల ఆగడాలు
ఆగక పోవడాలు
ఆరుబయట మంచంపై పడుకుని
ఆకాశంలో చంద''మామ''ని చూస్తూ
అభినందిస్తాడు ఆయన
''ఎంత అదృష్టవంతుడివి నువ్వు!
అల్లుళ్లు లేని మామవి!'' అంటూ.

— కాశీనాథ & కాశీనాథ

''చాలా బాగా నచ్చావు—'' మైకంతో ఆమె సుతిమెత్తని శరీరాన్ని స్పృశిస్తూ పలవరిస్తున్నాడు సుకుమార్.

''అంత బాగా నచ్చితే నన్ను పెళ్లి చేసుకోరాదూ?''

''పెళ్లా? మా నాన్న ఒప్పుకోడు.''

''ఎందుకు?''

''నాకోసం మంచి లక్షాధికారి అమ్మాయిని ఎప్పుడో చూసిపెట్టాడు.''

''మరి ఈ వేధవ తిరుగుళ్లెందుకు? శుభ్రంగా ఆ అమ్మాయినే చేసుకోవచ్చుగా?''

''వచ్చే సంవత్సరంతో నా చదువు అయిపోతుంది. అప్పుడే పెళ్లి.''

''మీకు చాలా డబ్బుందా?''

''అవును బాగానే సంపాదించాడు మా నాన్న. అవును, నీకెందుకీ ఆరాలన్నీ? బైవ్‌వేస్టు...'' అంటూ ఉండబట్టలేనట్లు ఆమె పమిటచెరుగు లాగేశాడు.

''ఏ. సి. రూములు, బ్రాందీ సీసాలు... ఇదంతా చూస్తుంటే బాగా బలిసినవాళ్లని పిస్తుంది. మీ నాన్న ఏం చేస్తుంటాడు? వ్యాపారమా?''

''కాదు. పేరుమోసిన కాంట్రాక్టరు. ఇక చాలించు నీ ప్రశ్నలు, కావాలిస్తే ఇంకో వంద ఎక్కువ తీసుకో. నా అమూల్యమైన కాలాన్ని మాత్రం వృధాచేయకు.'' తమకంగా ఆమె భుజాలుపట్టి మీదికి లాక్కున్నాడు సుకుమార్.

ఇంతలో బయట పోలీసు విజిల్సు—బూట్ల శబ్దం వినిపించాయి.

సుకుమార్ అదిరిపోయాడు. ఆమెను ప్రక్కకు నెట్టి చటుక్కున కిటికీ దగ్గరకు పరిగెత్తాడు. కిటికీ రెక్క కొద్దిగా తెరిచి బయటకు తొంగిచూసాడు.

అతని గుండె ఆగినంత పనయింది!

రైడింగ్ జరుగుతోంది. పోలీసులు అటు ఇటు పరిగెడుతున్నారు.

సుకుమార్‌కు ముచ్చెమటలు పోశాయి.

"ఏమిటి ఏమయింది ?" మామూలుగా అడిగింది మానస.

"కొంప మునిగింది. పోలీసులు రూములన్నీ చెక్ చేస్తున్నారు. త్వరగా నీవు బయటకు వెళ్లిపో –" కంగారుగా ఆమె రెక్కబుచ్చుకుని లేపాడు.

మానస తాపీగా, నిర్భయంగా నవ్వింది.

"రానీ పోలీసుల్ని. ఎందుకంత భయం ? అంత ధైర్యం లేనివాడివి ఇలాంటి వెధవపని కెందుకు పాల్పడ్డావు ? పోలీసులు చూస్తే తప్పు. చూడకపోతే ఎన్ని తప్పులు చేయడానికైనా సిద్ధమే ! ఆహా .. ఏం మగధీరుడవయ్యా ?–" అని వ్యంగ్యంగా నవ్వింది మానస.

"మాటలు తరువాత. ముందు నువ్వు ఇక్కడనుంచి వెళ్లిపో –" విసురుగా ఆమెను తలుపువైపు నెట్టాడు.

"అయితే సుఖం అక్కర్లేదా ?" మరో విసురు విసిరింది మానస.

అతను మింగేట్లు చూసాడు. ముందామెను ఎలాగోలా బయటకు తరిమేసి పరువు నిలుపుకోవాలని తెగ ఆరాట పడుతున్నాడతను.

"తల్లీ ! నీకో నమస్కారం. ముందు నువ్వు బయటకు దయచేయ్. అదే పదివేలు. మనిద్దరం పోలీసుల కళ్లలో బడితే మా పరువు బజారెక్కుతుంది... వెళ్లు త్వరగా –" అసహనంగా అరిచాడు.

మానసకు అతని పిరికితనం చూసి జాలి కల్గింది.

"ఆల్ రైట్. నేను వెళ్లిపోతున్నాను. నీవు ఇచ్చిన వంద ఖర్చయిపోయింది. వాపసు ఇవ్వడానికి నా వద్ద డబ్బు లేదు. మరోసారి కనిపించు నీ బాకీ తీర్చుకుంటాను.' అని తలుపు తెరుచుకుని బయటకు వెళ్లబోయింది మానస.

ఇంతలో ఇద్దరు పోలీసు కానిస్టేబుల్స్ – పోలీసు ఇనస్పెక్టరు వచ్చారక్కడకు.

ఠక్కున కాళ్లకు బ్రేకు పడినట్లు ఆగిపోయింది మానస. సుకుమార్ ప్రాణాలు పైనే పోయాయి. ఇనస్పెక్టర్ విజయ్ మానస వంక పురుగును చూసినట్లు చూసాడు. ఆ స్థానంలో మరొక పురుషుడున్నట్లయితే అంత కన్నా వాడిగా, తీవ్రంగా చూసేది. కానీ, ఆరడుగుల భారీ విగ్రహం అతనిది. ఆ ముఖంలోని కఠినత్వము, తీవ్రత ఆమెకు జంకు కలిగించాయి. ఆ చూపుల ధాటికి తట్టుకోలేనట్లు తల దించేసుకుంది మానస.

విజయ్ లోపలకు వచ్చి సుకుమార్‌ను ఏవేవో ప్రశ్నలు వేశాడు. సుకుమార్ నిలువునా వణికిపోతూ, పిడారిపోతున్న గొంతుకతో అతికీ అతకని జవాబులు చెప్పాడు.

# ఇ 'వేమన' పద్యాలు




కుక్క గోవుగాదు కుందేలు పులిగాదు
దోమ గజముగాదు దొడ్డదైన
లోభి దాతగాదు లోకంబులోపల
విశ్వదాభిరామ వినుర వేమ.

"కానిస్టేబుల్స్, వీళ్లిద్దర్నీ అరెస్టు చేయండి–" కఠినంగా అన్నాడు విజయ్.

సుకుమార్ కంపించిపోతూ "సార్ ... నేను ..." అని ఏదో చెప్పబోయాడు. విజయ్ కళ్లతో ఉరిమేసరికి ఆగిపోయాడు.

మానస చలనంలేని బొమ్మలా అలాగే నిలుచుండిపోయింది.

విజయ్ ఆజ్ఞ ననుసరించి కానిస్టేబుల్స్ ముందుకు వచ్చారు.

(ఇంకా ఉంది)

### కె. జి. ఆర్. – జబల్‌పూర్

ఆడవాళ్ళు అబద్ధం ఆడితే కాంక్రీటు గోడ కట్టినట్టుగా వుంటుందని నా అభిప్రాయం.

★ ఏం లాభం ? మీ పురుషులు వాటినధిగమిస్తున్నారు – నీటిపై రాతలతో !

### కె. ఎస్ డి – బుద్వేల

పుత్రులు లేకపోతే పున్నామ నరకం అంటారు. ఇంటి పేరు, వంశం వుండదంటారు. నా లాంటి దానికేమిటి దారి. నా కిద్దరూ ఆడ పిల్లలే.

★ పిచ్చి తల్లీ ! పున్నామ నరకం ఎలా వుంటుంది ? మనం కళ్ళు మూశాక మన ఇంటి పేరు, వంశం– నిలపెడతారని ఏమిటి గ్యారంటీ? అంచేత అలాంటి పిచ్చి వూహలకి తావివ్వకూడదు. ఆడేనా మగేనా – మనం కన్న పిల్లలు. వాళ్లలో ఒకరి కంత ఘనత దేనికి ? ఒకర్ని అంత చిన్న చూపు దేనికి ? తల్లే అలా అనుకుంటే– వంశోద్ధారకుడో అంటూ తాపత్రయపడిపోయే తండ్రు లెలా చూస్తారో అమ్మాయిలని– ఒక్కసారి ఆలోచించండి ... ఆడపిల్ల భారం అనుకునే దృక్పథం మారకపోతే– యీ జాతి కింక విముక్తి వుండదు. తల్లులు యిది గ్రహించడం చాలా అవసరం.

### జి ఏ ఆర్. – ఢిల్లీరాజహర్

లవ్ యీజ్ లైఫ్ అంటారు. మీ సలహా ఏమిటి ?

★ ఎవరికి ? లవ్వించే వారికా ? లౌ చేసే వారికా ?




### జి. వి. – ఆదోని

మనిషి పుట్టింది ఒట్టి శరీరంతో, పెరిగింది బట్టతో, జీవించేది డబ్బుతో–ఏమంటారు?

★ పొరపాటు. ఒట్టి శరీరంతో పుట్టి వుంటే మాంసం ముద్దలాగా పడి వుండే వాడు. ఉట్టి బట్టతో పెరిగితే–మూటలాగా పడివుండే వాడు. ఇక ఒక్క డబ్బుతో జీవిస్తే – భూస్థాపితం అయి భద్రంగా వుండేవాడు. – మనిషి జీవంతో పుట్టాడు. అందుకే యిన్ని బాధలు !

### కె. ఆర్. కె. – తలుపుల

పార్వతి ఏమైందో ఎలావుందో తెలియదు అని దేవదాసు నవల చివర్లో శరత్ బాబు రాస్తారు...కాని సావిత్రి మరణంతో పార్వతి లేదని తెలిసింది.

★నా పధ్నాలుగో ఏట అయితే దేవదాసు చదివి వెక్కి వెక్కి ఏడ్చి వుండేదాన్ని, కాని యిప్పుడా నవల సిల్లీగా అన్పిస్తుంది. దేవదాసు తాను చేజేతులా చేసుకున్నదానికి మనని సింపతీ చూపించమంటాడు. అదెలా సాధ్యం ! ?



### ఎం. ఆర్. – కరీంనగరు

అక్కయ్యా, ఈనాడు దేవుడు లేడని వాదించడం సరదా అయిపోయింది ?

★ సరదా కాదు తమ్ముడూ, అదీ ఒక మతం అయి కూర్చుంది.

### ఎ .ఎస్. – ఖమ్మం

వెళ్లి షేవింగు చేయించుకున్నంతసేపు అతగానితో జాగ్రత్తగా మాట్లాడాలి అంటారు ఎందుకని ?

★ ఎందుకనేమిటి ? కత్తి అతని చేతిలో వుంది. నోరు జారితే మెడకి వస్తుందని.

### డి.యి.డి; కె ఎస్ కె.యి..ల్. – భోగాపురం

మనిషి జీవితంలో విలువైనది ఏది ? ఆ విలువ తెలుసుకోకపోతే ఏ మవాలి ?

★ విలువలు మనిషి సభ్యతా సభ్యతలని పట్టి సంస్కారాన్నిపట్టి, వుంటూ వుంటాయి తెలుసుకోలేక పోవడంకూడా వీటిని పట్టే వుంటుంది. పంది పన్నీరు గుర్తించలేదని బాధ పడ్డంలో అర్ధం వుండదు కదా !

### డి ఎల్. ఆర్ – శృంగవృక్షం

నేనొక అమ్మాయిని ప్రేమించాను. కొన్ని సంఘటనల వల్ల ఆ అమ్మాయికి మరొకరితో పరిచయమై అతన్ని ప్రేమించింది. అబ్బాయి కొంచెం ఆస్తిపరుల బిడ్డ. ఈ ఆడవాళ్లు ఎంతకైనా తగి వుంటారు...

★ ఇంకా నయం మీ మగవాళ్ళు పెళ్లిచేసుకున్నాకకూడా మనస్సు పారేసుకుంటూ వుంటారే, దాన్నే మవాలి ? !

### చంద్రిక, సువర్ణ – ఉండి

శ్రీశ్రీగారి సాక్షి సంతకంతో రిజిష్టరు పెళ్లిచేసుకున్న మీరు మీ ఇంటిపేరు మార్చుకోలేదు. ఇప్పటి వాళ్ళు సమానం సమానం అని అరుస్తారేతప్ప ఇలాంటిచోట్ల వెనుక వుంటారు. చిన్న అనుమానం. లలితాఖద్ర మీ అమ్మాయి కదా భాగవతుల అని ఇంటిపేరు వేయించుకున్నారు. మరి లలితగారు మీ ఇంటిపేరు పెట్టుకోలేదేం ?

★ నేను నా తండ్రి ఇంటిపేరు వుంచుకున్నాను. నా కూతురు తన తండ్రి ఇంటిపేరు వుంచుకుంది. తప్పలేదే ?

### ఎం ఎస్ ఆర్. – బైపల్లి

భారతదేశం ఎందుకిలా చెడిపోయింది ?

★ దేశం గురించి పట్టించుకునేవాళ్ళులేక

రాజకీయరంగంలో ఎన్. టి. ఆర్. రాణించ కలరా ?

★ కలరా ఏమిటి ? రాణించి చూపిస్తూ వుంటే !

ది
న
ఆంధ్రపత్రికలో
త్రి
క

★ మన సినిమాలు
★ దినవారఫలాలు
★ ఇదీ వారి దృక్పథం

★ డాక్టరు కబుర్లు
★ పల్లెసీమ
★ యుద్ధకాండ

★ కలైడోస్కోపు కార్టూన్
★ శ్రీకృష్ణ భాగవతం
★ వింత యథార్థం

★ ఇంకా — వ్యాసాలు,
గేయాలు, కార్టూన్లు.

ఎప్పటికప్పుడు ఆంధ్రపత్రికలో
సరికొత్త ఆకర్షణలు
ప్రవేశపెడుతూనే ఉంటాము!

వెంటనే ఆంధ్రపత్రిక
చందాదారుగా చేరండి!

* * *



నూతన యవ్వనం పొందండి! సంతానవంతులు కండి. చర్మవ్యాధుల నుండి విముక్తులు కండి. హస్త ప్రయోగమువలన కలుగు నరముల బలహీనత, శీఘ్ర స్ఖలనము, అంగము చిన్నదగుట, అవసరకాలమందు అసంతృప్తి, సంతానము లేకపోవుట, సమస్త చర్మవ్యాధులకు అద్భుత చికిత్స! పోస్టుద్వారా చికిత్స కలదు.

"క్యాంపులు" :– ప్రతి ఆదివారం 'భీమవరం' షణ్ముఖ లాడ్జిలో ఉదయం 8 గం. నుండి సాయంత్రం 6–30 గం. వరకు. ప్రతినెల 1 మరియు 16 తేదీలలో 'రాజమండ్రి' హోటల్ అప్సరలో మధ్యాహ్నం 12 గం. నుండి రాత్రి 9 గం. వరకు

**డా॥ డి. మార్కండేయులు, ఆయుర్వేద భిషక్,**

సెక్స్ & స్కిన్ స్పెషలిస్ట్, పార్కురోడ్, *గుడివాడ*-521301 ★ ఫోన్స్ : 522 & 540

---

ఫెయిలైన/డిటెయిన్/డిబార్ కాబడిన విద్యార్థులకు

# శుభవార్త!

15 సం. పైబడినవారు లేదా ఎస్. ఎస్. సి. ఫెయిలైనవారు ఇంటర్‌కు (ఒక సిట్టింగ్) కూర్చొనవచ్చును. అన్ని యూనివర్శిటీలు మరియు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే గుర్తింపబడినది. వివరాలకు స్వయంగా సంప్రదించండి. ★ రు. 5/– MO ద్వారా పంపండి.

**S. V. College of Correspondence,**

**3-6-430/1, Adjacent Post Office, Above RAJA RANI HOTEL,**
**Himayat nagar, HYDERABAD-500029.**
**B.O, 4-8-66, Near Old Bus Stand,**
**PEDDAPALLI-505172, Karimnagar.**

---

# ఎలక్ట్రా

## అద్భుత సృష్టి
## టేపు రికార్డరు

- 3·5 వాట్లు అవుట్‌పుట్
- పాజ్·క్యూ రివ్యూ సౌకర్యం
- స్టాండింగ్ మోడల్
- అతి చిన్న శబ్దాన్ని కూడా విస్పష్టంగా రికార్డు చేయగలదు



మోడల్ ET852

మార్కెట్ చేయువారు: ఫోన్:77823

**యునైటెడ్ ఎలక్ట్రానిక్స్**

ప్రకాశం రోడ్ విజయవాడ-2



# చిదంబర రహస్యం

దుగ్గరాజు నాగేశ్వరరావు

"మా వాళ్ళు నాకు అణాకాణీ సంబంధం చేసి పెట్టారు. అంతా నా కర్మ..."

"ఏమైందే ఇప్పుడు..."

"ఏమైందా – ఏడుపొక్కటే తక్కువైంది..."

"ఎందుకే ఏడుపు..."

"మీలాంటి మొగుడు దొరికినందుకు."

"నాకేవి తక్కువైందే...!!??" తలకాయ పైకెత్తి కాలుమీద కాలు వేసి ఓ చిరునవ్వు చిందించాడు సుబ్బారావ్.

"అవును. మీకేం తక్కువైంది – రెండు పూటలా చేసి పెడుతుంటే తింటూ కూర్చుంటున్నారు."

"చేసిపెట్టేది తినడానికే గదే–!!" మొఖం క్వశ్చన్ మార్కులాగా పెట్టి అన్నాడు సుబ్బారావ్.

"అంతే – అంతే తిండి తినేది హాయిగా కూర్చోడానికే..."

"హాయిగా ఎవడు కూర్చున్నాడే – ఆఫీసులో చచ్చేంతపని చేస్తుంటేనూ..."

"ఆఫీసులో పని చేస్తే సరిపోయిందా.. ?"

"ఆఁ అక్కడికే అదిరి పోతుంది తలకాయ– ఇంకేం చెయ్యమంటావే...!!??"

..."ఇంకేం చెయ్యొద్దు ఊరికే కూర్చోండి సిగ్గు లేకపోతేసరి..."

"ఏమిటే పెద్ద పెద్ద పదాలు వాడుతున్నావు... నేనేం చేశానని...!!"

"ఏమి చెయ్యలేదనే నా ఏడుపు..."

"ఏంచెయ్యమంటావే – అసలు నీ ఏడుపు ఏమిటో అర్థమయ్యేలా ఏడుస్తే గదా. . !!"

"ఇంత ఏడ్చినా అర్థం కాలేదా...!!ట్యూబ్ లైట్‌కిచ్చి చేశారు నన్ను."

"ఎందుకే మీ వాళ్ళను తిట్టుకుంటావ్.."

"లేకపోతే మీ వాళ్ళను తిట్టమంటారా ? మీ విషయం చెప్పకుండా పెళ్ళి చేసినందుకు..."

"మళ్ళీ చెప్పాలా నాకేం తక్కువైందని.."

"నేనూ మళ్ళీ చెప్పాలా నా కర్మ అని..." సీరియస్‌గా అంది శారద.

"ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు" అనుకుంటూ బయటపడ్డాడు సుబ్బారావ్ ఇంట్లోనుండి.

కనీసం ఎందుకింత గట్టిగా మాట్లాడానో కూడా అర్థం చేసుకోలేని ఈయన్ని ఓ దారికి తెచ్చుకోవడం అంటే మాటలు కాదు. కర్మ...!!

* * *

ఆ రోజు నుంచి శారద ఎంతగా బాధ పడుతుందో. రామకృష్ణ పెళ్ళాం పత్రిక తీసుకుని

ఆ వీధి వీధీ తిరగటం బాగ గుర్తు శారదకి. వీధి వీధి గుప్పుమంది. లక్ష్మి మొగుడు రామకృష్ణ వ్రాసిన కథ పత్రికలో పడ్డదట. దానికి బాపు బొమ్మ వేశాడుట. దాంతో లక్ష్మి హడావుడి ఇంతా అంతా కాదు. తన భర్త గొప్పతనం గొప్పగా చెప్పుకోవడంలో ఆ రీవి, దర్పం కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి ముఖంలో. వీధి అంతా తిరిగి చివరికి శారద దగ్గరికి వచ్చింది లక్ష్మి. అప్పటికే మాడిపోయి ఉంది శారద ముఖం లక్ష్మిని చూసి చూసి.

అయినా లక్ష్మి తన సహజ ధోరణిలో "ఏమేవ్ శారద! మా ఆయన వ్రాసిన కథ పత్రికలో పడ్డది. దానికి బాపు బొమ్మ వేశాడే. మా వారి ఆనందానికి అవధులు లేవు. నా సంగతి చెప్పనే చెప్పక్కరలేదు. ఈ వీధి నీతో అయి పోయింది. ప్రక్క వీధికి వెళ్ళి చెప్పాలి ..."

"... ... ... ... ... ... ... ..."

"ఏమిటే అంత సీరియస్‌గా ఉన్నావు వంట్లో బాగో లేదా ఏమిటి ?"

"బాగానే ఉంది ..."

"అయితే మాట్లాడవేం ? ఓ గ్లాసు మంచినీళ్లు ఇవ్వవే. అందరి ఇళ్లల్లో అరచి అరచి వస్తున్నానుగదా నాలుక పిడచకట్టుకుపోయింది"

వంటింట్లోకి వెళ్ళింది శారద. వెనకాలే లక్ష్మి వెళ్ళింది. గ్లాసుతో నీళ్ళు అందించింది శారద. హడావుడిగా తాగింది లక్ష్మి. గ్లాసు శారదకిస్తూ "మావారి గురించి నీకేం చెప్పలేదు గదే...!! మావారని చెప్పుకోడం కాదుగానీ మా వారు మహా గొప్పగా వ్రాశారే కథ. ఆ కథలో హంగు బావుంది. అన్నట్టు మావారి కథ చదివావా...??"

"లేదు..."

"ఎందుకనే...!!??"

"నాకు తెలియదుగదా ఆ కథ మీ వారు వ్రాసిందని..." అంది శారద దెప్పిపొడుస్తూ.

"ఇప్పుడు నేను చెప్పానుగదా చదువు. అసలు నేను బయిలుదేరింది కూడ అందుకే. ఈ కథ మావారు వ్రాశారని అందరినీ చదవమని చెప్పడానికి. కథ వ్రాయడానికి ఆయన పడ్డ కష్టానికి ఫలితం బాగా కనిపించిందే. దాంతో ఆయన ఎంత హుషారుగా వెళ్లారో తెలుసా ఆఫీసుకి. ఆఁ అన్నట్టు..." చేతి వాచీ చూసు కుంది. "అమ్మో... చాల టయిం అయింది-- ఇంకా చెప్పాల్సిన ఇళ్లు చాలా వున్నాయి. వస్తానే..." అంటూ ఒకటే పరుగు వీధిలోకి.

లక్ష్మి ముఖంలో ఆనందం చూసేసరికి శారదకి కోపం ఎక్కువైంది. ఏమీ చేయలేని స్థితి. కథ వ్రాసిన లక్ష్మి మొగుణ్ణే తిడుతుందా...!!?? మా ఆయన కథ పడ్డది చదవండే అంటూ వీధిన పడ్డ లక్ష్మిని తిడుతుందా? అసలు నేను ఎవరిని తిట్టాలి అని ఆలోచిస్తూ కూర్చుంది శారద. ఆలోచించగా ఆలోచించగా చివరికి తన మొగుడు దొరికాడు. తిట్టాలి... తిట్టాలి అనుకుంది. నిదానంగా అక్కడినుండి వంటింటివైపు బయలుదేరింది వంట చెయ్యడానికి.

* * *

"పత్రిక ఎక్కడ పెట్టావే...??"

"ఎందుకు ...??"

"చదవడానికి ..."

"ఏం చదువుతారు ...??"

"అదే మా వాడు రామకృష్ణ వ్రాసిన కథ పడ్డదట. వెంటనే చదివి అభిప్రాయం చెప్ప మన్నాడు ..."

"అంతేఁ మీ బతుక్కి చదవడమే మీకు చేతనైంది ..."

"చదువుకున్నది చదవడానికే గదే ..."

"... ... ... ... ... ..."

"అయినా మిత్రుడి కథ పడ్డది పత్రికలో అంటే ఆ ఆనందం పంచుకోవడంలో నాకూ వాటా ఉంది. పుస్తకం ఎక్కడపెట్టావు వెంటనే చదవాలి."

"బల్లమీద ఉంది."

గదిలో బల్లదగ్గరే ఉన్న కుర్చీలో కూలబడ్డాడు సుబ్బారావ్ పత్రిక చేతిలోకి తీసుకుంటూ.

పేజీలు గబగబా తిప్పాడు. ఓ పేజీదగ్గర ఆగిపోయాడు. అదే రామకృష్ణ వ్రాసిన కథ. దానికి బాపూ వేసిన బొమ్మ అద్భుతంగా ఉంది. అసలు సుబ్బారావ్ పత్రిక బాపు బొమ్మల కోసం తెప్పిస్తాడు. బాపు బొమ్మను చూసికథను చదువుతాడు. ఈ కథ చదవాల్సిందే బాపు బొమ్మనుబట్టి. అదీకాక తన మిత్రుడు వ్రాసిన కథ అని తెలిసింతరువాత ముందు ఆ కథే చదవాలి.

చదవడం మొదలెట్టాడు. ఎంతో అద్భుతంగా ఉంది కథ. పూర్తిగా చదివి— "శారదా ... ఈ కథ చదవావా ?" అన్నాడు.

"ఏ కథ ..." అంది శారద వంటగదిలో నుండే.

"మా వాడు వ్రాసిన కథ ..."

"చదవలేదు ..."

'ఎందుకని ...?? వెంటనే చదివి నీ అభిప్రాయం ఏమిటో చెప్పు' అంటూ వంట గదిలో ఉన్న శారద దగ్గరకు వెళ్లాడు సుబ్బారావ్.

శారద ముఖం సీరియస్‌గానే ఉంది.

అనవసరంగా కదిలించి కంపు చేసుకునేకన్నా ఊరుకోవడమే మంచిది అనుకొని "నేను అలా రామకృష్ణ దగ్గరికివెళ్ళి వాడికి కథ బావుందని చెప్పివస్తానే" అంటూ జవాబుకోసం ఎదురు చూడకుండా హడావుడిగా వెళ్లిపోయాడు సుబ్బారావ్.

ఏమిటో పిచ్చిమాలోకం... మిత్రుడు కథ వ్రాశాడట. వాడికి డబ్బాకొట్టి రావడానికి వెళ్లారు. అంతే తప్ప తనూ ఓ కథ వ్రాసి పది మందిచేతా డబ్బా కొట్టించుకుందామనే జ్ఞానం లేదు.

ఎలాగైనా జ్ఞానోదయం కలుగజేయాలి కథ వ్రాయించాలి. మా ఆయన కూడ కథలు వ్రాస్తాడు అని ఈ ఊరు మొత్తం చాటాలి. అప్పటికిగానీ నా మనసు కుదుటపడదు. ఈరోజే నాంది పలకాలి, లేకపోతే రోజులు గడిచేకొద్దీ నాలో రగిలేకోపం తగ్గిపోవచ్చు. అప్పుడు నేను ఆయన్ని అడిగేదిలేదు. ఆయన వ్రాసేదిలేదు.

* * *

"డబ్బాకొట్టి వచ్చారా..."

"ఏం డబ్బా... !!??"

"పరడబ్బా..."

"డబ్బా ఏమీ కొట్టలేదే...!!"

"రామకృష్ణ కథకి .."

"అదా...!! కథ బావుంటే బాగున్న దనడం డబ్బాకొట్టడం ఎలా అవుతుంది... కథ బాగోలేకపోయినా బావుందంటే డబ్బా కొట్టి నట్లు. అయినా నేనొక్కడినేకాదు. నే వెళ్లేసరికి వాళ్ల కొంపంతా జనంతో నిండిపోయింది. ఏ సభల్లోనో, సమావేశాలలోనో చూస్తాం అంత మందిని. ఒక రచయితని మెచ్చుకోడానికి అంత మంది జనం వస్తారని ఊహించలేదు...!!"

"అలా వస్తారని తెలిస్తే మీరూ ఓ కథ వ్రాసేవారా...??"

"కథా ... !!!!"

"కథే... మీరూ వ్రాసేవారా...??"

"కథ వ్రాయడమంటే మాటలా...!! ??"

"కాదు మాటలు ... లేకపోతే ఇన్నాళ్లూ లేనిది ఈరోజు ఎలా వ్రాయగలిగాడు రామకృష్ణ కథను ... ఎలా వ్రాశాడో అడగండి. తెలుసు కుని అదేవిధంగా వ్రాయండి."

"వాణ్ణే అడిగి తెలుసుకుని అదేవిధంగా వ్రాస్తే ఇప్పుడు వాడు వ్రాసిన కథే తయారవు తుంది గదే ...!!"

"కర్మ... కథను ఎలా వ్రాశాడు అంటే దానికి బేస్ ఏమిటో .. కథని పంపడం ఎలాగో ... మొదలగునవి ..."

"ఏమో నాకు వాణ్ణి అడగబుద్ధికాదు"

"అంటే మీకు అన్నీ తెలుసునా ...!!"

"తెలియదు ..."

"తెలియనప్పుడే గదా అడిగేది.."

"ఎందుకో..."

"తెలుసుకోవడంకోసం. అనుసరించడం కోసం."

" .. . . ... ... ... .. . .."

"మొత్తంమీద మీరు కథ వ్రాయాలి."

"నావల్లకాదు..."

"ఎందుకు కాదు ... ??"

"చెప్పలేను ..."

"నేను చెబుతున్నాను మా పుట్టింటికి వెళుతున్నాను."

"అమ్మో ... ఇంత చిన్న విషయానికే అంత పెద్దమాట అన్నావేం ...!!" ఏడుపు ముఖం పెట్టి అన్నాడు సుబ్బారావ్.

శారదకి నవ్వు వచ్చింది శ్రీవారు చిన్న పిల్లాడిలా ఏడుపు ముఖం పెడితే. అయితే బయటికి మాత్రం సీరియస్‌గానే ఉంది.

"అయితే కథ వ్రాయాలి."

"కష్టమే..."

"కష్టమైననూ నాకిష్టము ..."

"మొగుడు కష్టపడటం పెళ్ళానికి ఇష్టమా ...!!??"

"అందరి పెళ్ళాల సంగతి ఏమోగాని నాకు మాత్రము ఇష్టమే ..."

"అన్యాయమే. నన్నొక్కడినే కష్టపడమనడం ..."

"నేనూ మీకు సహాయ పడతాను గదా..."

"అయితే నువ్వే కథ వ్రాసేయి. ఎంచక్కా నా పేరు పెట్టు. సరిపోతుంది గదా..." అన్నాడు సుబ్బారావ్ తన తెలివికి తనే నవ్వుకుంటూ.

"అదేం కుదరదు. మీరు కథ వ్రాయాలి అది పత్రికలో పడాలి. లక్ష్మిలాగా నేనూ ఈ ఊరు మొత్తం తిరగాలి పుస్తకం పట్టుకుని."

"ఏమిటే లక్ష్మిలాగానే ... !! ఇప్పుడర్థమైంది నా కష్టాలకి కారణం ఎవరో ..."

"ఏమైనా సరే మీరు కథ వ్రాయాలి."

"తెలియని విషయంలో వేలు పెట్టమనడం బాగోలేదే ..."

"బాగానే ఉంటుందని చెబుతున్నా గదా. మీరు నే చెప్పినట్టల్లా చేస్తే కథ ఈజీగా వ్రాయగలరు. సరేనా ..."

"సరే అంటే నా ప్రాణాలు తీస్తావు..."

"అనకపోతే నేనే తీసుకుంటాను ..."

"అమ్మో... శారదలేని జీవితం ఎందుకు.. శారదా నీ కోసం చావమన్నా చస్తాను ..."

"చావద్దు... ఓ కథ వ్రాయండి."

"కథ వ్రాయడానికి కన్నా చావడానికే చక్కని మార్గాలున్నాయి ..."

"ఎందుకు కథ వ్రాయడానికి అంత ఇదైపోతారు. నే చెప్పినట్లు చెయ్యండి ..."

"సరేనే ..."

"మావారు ఎంత మంచివారో..." అంటూ సుబ్బారావ్‌ని తన బాహువులతో బంధించింది శారద.

* * *

సుబ్బారావు ఇంట్లోకి అడుగు పెడుతూనే నీరసంగా కూలబడ్డాడు కుర్చీలో.

"శారదా...శారదా..."

"పిలిచారా..."

"ఆఁ..."

"ఏమిటి..."

"రామకృష్ణను కలిశాను. కథ వ్రాయటం గురించి చెప్పాడు.

"ఆఁ చెప్పాడా...!! ఉండండి కాఫీ తెస్తాను ఈ లోపు మరచిపోవడానికి ప్రయత్నం చెయ్యకండి." అంటూ వంటింట్లోకి పరుగుతీసింది శారద.

కాఫీగ్లాసుతో వచ్చింది. సుబ్బారావ్‌కి గ్లాసు అందించింది. పొగలు కక్కే కాఫీ చూడ్డంతో ప్రాణం లేచి వచ్చింది సుబ్బారావ్‌కి.

"మీరు కాఫీ త్రాగుతుండండి. నేను పెన్ను కాయితం తీసుకొస్తాను."

"రామకృష్ణ కథ చెప్పలేదు. కథ ఎలా వ్రాయాలో చెప్పాడు..." అన్నాడు సుబ్బారావ్ పెద్దగా నవ్వుతూ.

"నాకు తెలుసు ఆ విషయం అవి వ్రాసుకుందామనే..." కోపంగా సుబ్బారావ్ వైపు చూసింది.

"సరే పట్రా..."

"............."

"చెప్పనా .. ??"

"ముందు కాఫీ కానియ్యండి. కాఫీకి నోటికి ఉన్న సంబంధం ఆగితే అసలు విషయం బయటికి వస్తుంది మరిచి పోకుండా..."

కాఫీ త్రాగడం అయిపోయింది. గ్లాసు కింద పెడుతూ కాఫీ "బ్రహ్మాండమోయి" అన్నాడు సుబ్బారావ్.

"సరే రామకృష్ణ ఏమన్నాడు..."

"చెప్పేదా..."

"చెప్పమనేగా చెప్పేదీ..."

"రామకృష్ణ ఓ రచయితగా ఏం చెప్పాడంటే – రచయితకి ఉండాల్సిన లక్షణాలు ... వ్రాసుకో ..."

"అవన్నీ ఎవడికి కావాలట...కోతి ముఖము వాడూనూ ... కొంపదీసి మిమ్మల్ని కోతిలా కావాలన్నాడా ... !!"

"అంటే నీ ఉద్దేశ్యం రచయితలంతా కోతుల్లా ఉంటారనా ... లేక కోతుల్లా ఉన్న వాళ్ళే రచయితలవుతారనా ... ??"

".. .. ... ... ... ..."

"అన్నిటికీ ఆవేశమే. పూర్తిగా వినవేం ..."

"చెప్పండి . "

"కథ వ్రాయడానికి బేస్ కావలసిందేనట. ఊహించికూడ వ్రాయవచ్చు అన్నాడు. తను వ్రాసిన కథ తన చిన్నతనంలో జరిగిన చిన్న సంఘటన. దానికి కొంత ఊహించి కలిపి వ్రాశాడట ??"

"ఉండండి వ్రాయనీయండి ... ఆఁ . . ఏ టైములో వ్రాసేవాడట ... ??"

"రాత్రి పూట ప్రశాంతమైన వాతావరణంలో కూర్చొని వ్రాసేవాడట."

"ఆహాఁ .. "

"కథ వ్రాసిన తరువాత నాలుగైదు పేర్లు వ్రాసి వాటిల్లో లాటరీలా తీసి వచ్చిన పేరును కథకు పెట్టాడట . . "

"ఆఁ ... "

"కథని కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలట."

"ఆహాఁ . . "

"అరటావు సైజు కాగితాలు తెల్లని వాడాలట."

"ఆఁ ... "

"కథ నా సొంతము అని హామి పత్రం వ్రాసి కథతో పంపాలట."

"ఆహాఁ ... "

"కథను ఏ పత్రికకైననూ పంపవచ్చట. అయితే ఒక పత్రికలో పడలేదనుకో, రెండో పత్రిక్కి పంపాలిట..."

"అదెలా సాధ్యం...!!"

"అక్కడే ఉంది 'చిదంబర రహస్యం. కథను పంపేటప్పుడు కథతోపాటుగా మన సొంత అడ్రస్ ఉన్న స్టాంపులు ఉన్న కవర్ కూడా పంపాలట. ఒకవేళ వాళ్లకు కథ నచ్చలేదనుకో ఆ కథను మన అడ్రస్ ఉన్న కవర్‌లో పెట్టి వెనక్కి పంపుతారట..."

"ఆహాఁ అలాగా. .!!"

"అంతేకాదు. అలా తెలుగు పత్రికలనే వాటన్నిటికీ అదే కథను తిప్పవచ్చట. విసుగుపుట్టి ఎవరో ఒకరు వేసుకోకపోరని చెప్పాడు. అది విషయం."

"అలాగా...!!"

"ఆఁ అలాగే...అన్నీ వ్రాసుకున్నావా...?"

"ఆఁ ముక్కపోకుండా వ్రాశాను..."

"ఇహ నీ ఇష్టం నాపని అయిపోయింది."

"ఎక్కడైపోయింది. ఇప్పుడే మొదలైంది మీ బుర్రకి పదును పెట్టండి."

"నీకేం పిచ్చిగానీ పట్టిందా...? బుర్రకి పదును పెట్టమంటున్నావ్, ఏదో చాకులకు, కత్తులకు పెట్టాలిగానీ పదును..."

"చచ్చాం... పదునంటే అదిగాదు ఆలోచించమని..."

"అలాగా..."

"అవునుగానీ ఐడియా..."

"ఏమిటో...!!"

"మీరు కాలేజీలో చదివారు గదా..."

"అవును..."

"కాలేజీలో చదివే రోజుల్లో మీరు ఎవరినైనా ప్రేమించారా...?"

"ప్రేమా...!!?? సరి. అమ్మాయిలంటేనే ఆవడ దూరం. అడగాలంటేనే భయం."

"నేనేమి అనుకోనులేండి చెప్పండి..."

"శారదా నేను చెప్పేది నిజం..."

"లేదు మీరో అమ్మాయిని ప్రేమించారు.."

## మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఆరువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

## చిదంబర రహస్యం

"అయ్యో... కాలేజిలో చదివేరోజుల్లో అమాయకుడనని పేరు..."

"అమాయకుడా... అమ్మాయికూడానా..!?"

"శారదా ఎందుకు నన్ను హింసిస్తావ్..."

"ప్రేమించానని చెప్పండి ?"

"నేను చెయ్యని పనిని చేశానని ఎలా చెప్పమంటావ్."

"అదే కథండి... మీరు ఓ అమ్మాయిని ప్రేమించారు కాలేజిలో చదివేరోజుల్లో..."

"లేదు..."

"కథలోనండీ..."

"సరే...!"

"ప్రేమ ముదిరి పెళ్లికి దగ్గిరపడుతుంది. మీ అమ్మా నాన్న వాళ్ళు ఆ అమ్మాయితో పెళ్లి వద్దంటారు. మీరు వాళ్లని ఎదిరించి ఆ అమ్మాయినే చేసుకుంటారు. అక్కడి నుండి మీకు కష్టాలు మొదలు. ఉద్యోగం లేదు, తిండి తిప్పలు లేవు. వారం రోజులుగా అన్నంలేక మాడిపోతూ వుంటారు. మిమ్మల్ని రక్షించుకోవడానికి మీ ప్రియాతి ప్రియమైన భార్య, తన శీలాన్ని అమ్మి ఆ డబ్బుతో మీకు భోజనం తీసుకొస్తుంది. అప్పటికే అరగంట క్రితమే మీరు టిక్కెట్ తీసుకుంటారు..."

"అప్పుడేనా..."

"కథలోనండీ..."

"ఏం కథో... ఇదేదో సినిమాలో చూసి నట్లుగా ఉంది."

"అలాగే ఉంటాయండీ... కథల్ని బట్టే గదా సినిమాలు తీసేది..."

"అంటే ఇదే కథ ఉండి ఉంటుందన్న మాట."

"ఇహ మీరు గొడవ చేయక ఈ కథకు డైలాగులు అవి వ్రాయండి. మేడమీద లైట్ అరేంజి చేసుకోండి. ఇవాళ నుండి వ్రాయండి. వెన్నెల్లో మీరు కథ వ్రాస్తూ కూర్చోండి. మిమ్మల్ని చూస్తూ నేను కూర్చుంటా. ఎక్కడన్నా అవసరం అయితే వెంటనే నేను మీకు ..."

* * *

అతి కష్టం మీద వారం రోజులలో కథ తయారైంది. దానికి తర్జన భర్జనలు జరిగాక కథ పేరు కోసం రామకృష్ణ చెప్పినట్లే లాటరీ వేసి నాలుగు పేర్లలో ఒకటి తీసి కథకి పెట్టారు.

"రాదూ రాదూ అంటూనే మంచి కథ వ్రాశారు గదండి. అనవసరంగా మిమ్మల్ని తిట్టాను క్షమించండి."

"కథ తయారైంది. ఆదే గదా నీకు కావలసింది. భార్య కోర్కె తీర్చడమే గదా భర్త పని ."

"దీనికి పెద్ద రాద్ధాంతము చేశారు గదా.." అంది శారద చిలిపిగా.

## ఫోటో వోల్టాయిక్ సెల్స్!

సూర్యరశ్మినుండి విద్యుచ్ఛక్తిని తయారుచేసే పద్ధతిని ఫోటో వోల్టాయిక్ పద్ధతి అని అంటారు. ఈ విధంగా విద్యుత్తును తయారుచేసే బ్యాటరీలను ఫోటో వోల్టాయిక్ సెల్స్ లేక సోలార్ సెల్స్ అని పిలుస్తారు. ఈ పద్ధతివలన అనేక లాభాలున్నాయి. ఆలశ్యం లేకుండా సూర్యరశ్మినుండి విద్యుచ్ఛక్తిని తయారు చేయగలవు. వీటిలో కదిలే భాగాలు లేవు కనుక ఇవి చాలా ఎక్కువ కాలం పని చేస్తాయి. ఎక్కువ బరువు ఉండవు. చిన్నసైజు కేలిక్యులేటర్లలోనూ, గడియారాలలోనూ, పెద్ద విద్యుత్ కర్మాగారాలలోనూ ఉపయోగించటానికి వీలవుతుంది. విద్యుచ్ఛక్తిని అందచేయటానికి వీలుకాని మారుమూల ప్రాంతాలలో విద్యుచ్ఛక్తిని తయారు చేయటానికి ఇదే ఒక పద్ధతి కాగలదు.

"ఆఁ సరిసరి... ఇహ నేను ఆఫీసుకి వెళుతున్నాను ..."

"అరెఁ... ఉండండి... హామీ పత్రం వ్రాయండి."

"మరిచే పోయాను ..."

"అందుకే నేను పాయింట్ వారిగా వ్రాసి పెట్టుకుంది ..."

"తెలివిగల దానివి. నిజంగా నీలాంటి భార్య దొరకడం నా అదృష్టం... ఇహ వెళతాను టయిమవుతోంది."

"ఇది పోస్టు చేసి వెళ్ళండి. నేను ఈ వీధికి చెప్పి వస్తాను ..."

"అప్పుడేనా ...!!"

"అందరికీ కాదు. మన వీధి వరకే ..."

"నాకు టయం లేదు. పోస్టాఫీసు అటు. మా ఆఫీస్ ఇటు. అందుచేత నువ్వే ఒక పని చెయ్యి. ఈ వీధి తిరగాలి గనుక పోస్టాఫీస్‌కి వెళ్లి పోస్టు చేసి వచ్చి మన వీధి వాళ్ల సంగతి చూడు... సరేనా..."

"సరే..." అంది శారద నవ్వుతూ.

ఇన్నాళ్లకి మళ్లీ శారద ముఖంలో నవ్వు కనబడేసరికి కుషీ కుషీగా వెళ్లాడు ఆఫీసుకి సుబ్బారావ్.

శారద భోంచేసి పోస్టాఫీసుకి వెళ్ళి ఒక కవర్‌మీద పత్రిక అడ్రస్, రెండో దానిమీద సుబ్బారావ్ అడ్రస్ వ్రాసి స్టాంపులు అంటించి డబ్బాలో వేసి వాళ్లవీధి ఆ చివరనుండి ఈ చివరిదాక తిరిగింది.

సాయంకాలం సుబ్బారావ్ ఇంటికి వచ్చేసరికి






బులుసు వేంకటరమణయ్య

# హరిశ్చంద్రుని సత్యనిష్ఠ

తన ప్రాణం, ధనం, మానం పోవనున్నప్పుడు వానిని కాపాడుకోడానికి అబద్ధమాడినా, దానివల్ల పాపం రాదని పూర్వులే అసత్యానికి ఒక అనుమతిని ఇచ్చారు. ఇట్టి స్థితిలో హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని వల్లా, నక్షత్రకుని వల్లా తీరని కష్టాలు ఎందుకు అనుభవించాలి? రాజ్యం ఎందుకు పోగొట్టుకోవాలి? అనే ప్రశ్న కలగవచ్చును. నిత్య సత్యవ్రతులైన నలుడు మొదలైనవారు ఉండగా హరిశ్చంద్రుడికే సత్యహరిశ్చంద్రుడు — అనే పేరు ఎందుకు రావాలి? అని కూడా అడగవచ్చు. వీటికి సమాధానంగా ఒక కథ చెప్పడం ఉన్నది.

సమస్త సంపదలతో తులతూగుతూ, రాజ్యాన్ని పాలిస్తున్న హరిశ్చంద్రునికి చాలా కాలం వరకూ సంతానం కలగలేదు. అతడు దానికి చాలా విచారిస్తూ తన కుల గురువునకు విన్నవించగా "రాజా! నీవు వరుణ దేవుణ్ణి గురించి యజ్ఞం చేస్తే, అతని అనుగ్రహం వల్ల పుత్రుడు కలుగుతాడు" అని చెప్పాడు. హరిశ్చంద్రుడు యథావిధిగా వారుణ యాగం చెయ్యగా, వరుణుడు "ఏమికావాలో కోరుకో" అని అన్నాడు. ఆ దేవత ప్రత్యక్షమైనందుకు హరిశ్చంద్రుడు, తొందరపాటున, ముందు వెనుకలు ఆలోచించక "దేవా! నీవు నాకు పుత్ర సంతానం అనుగ్రహిస్తే, ఆ కుమారుణ్ణి యాగ పశువుగా చేస్తాను" అని, సంతోషావేశంతో అన్నాడు. "సరే! అలాగే నీకు పుత్రుడు కలుగుతాడు" అని చెప్పి వరుణుడు మాయమైనాడు.

హరిశ్చంద్రుని భార్య చంద్రమతి గర్భవతియై చక్కని కుమారుణ్ణి ప్రసవించింది. వెంటనే వరుణుడు వచ్చి, ఆ బిడ్డను ఇచ్చివేయమన్నాడు. రాజు తన పొరపాటు గ్రహించి, పుత్రుణ్ణి విడవలేక, వాయిదాలు వేసి, చాలాకాలం జరుపులుపెట్టి, వరుణుని బాధనుండి తప్పించుకోవాలని, ఒక అడవిలో పుత్రుణ్ణి దాచి, వరుణుడు రాగా, తన పుత్రుడు మరణించాడని అసత్యం పలికాడు. సర్వమూ ఎరిగిన వరుణుడు కోపించి "తథాస్తు" అన్నాడు. ఆ బాలుడు చనిపోయాడు. హరిశ్చంద్రుడు వరుణుని కాళ్లపై పడి, అపరాధాన్ని క్షమించి, బాలుణ్ణి బ్రతికించాలని వేడుకోగా, అతడు దయతలచి "రాజా! ఇక మీద ఎన్ని కష్టాలు వచ్చినా, రాజ్యం పోయినా, సత్యమే పలుకుదునని దృఢమైన ప్రతిజ్ఞ చేస్తే నీ కుమారుడు బ్రతుకుతాడు. సూర్యదేవుడు సాక్షిగా ఆడి తప్పనని ప్రమాణం చెయ్యి. తీరని కష్టాలు, రాజ్య నాశనం కలిగినా — చివరకు నీక్కు మేలు కలుగుతుంది. నీ రాజ్యం నీకు లభిస్తుంది" అన్నాడు. హరిశ్చంద్రుడు ఆ విధంగానే ప్రతిజ్ఞ చేశాడు. సత్యవాక్పాలన కోసం రాజ్యం కోల్పోయి, నానా కష్టాలూ పొందాడు. ఇలా కష్టాలుపడి తన ప్రతిజ్ఞను నిలుపుకొన్న కారణం వల్లనే అతనికి సత్య హరిశ్చంద్రుడనే పేరు వచ్చింది. చివరకు కష్టాలన్నీ గట్టెక్కి సుఖపడ్డాడు. 

---

తలుపుకి తాళం కనబడటంతో వరండాలో కూలబడ్డాడు.

ఏడుగంటలకి తిరిగ్గా వచ్చింది.

"అరెరె మీ సంగతే మరిచిపోయాను..."

"అంటే ఇళ్ళన్నీ తిరిగింది నా గురించి చెప్పడానికే గదా...!!"

"అవును. మీరు ఆఫీసునుండి వచ్చి ఉంటారన్నవిషయం."

"సరే కాఫీ ఇవ్వు తల పగిలేట్టుంది..."

ఇదిగో పదినిముషాలు అంటూ తాళంతీసి వంటగదిలోకి పరుగెత్తింది శారద.

రాత్రి మేడమీద పడుకున్నారు.

"వెన్నెలరాత్రులు చాల వేస్టయ్యాయి..." అన్నాడు సుబ్బారావ్ శారదను దగ్గరికి తీసుకుంటూ...

"నిజమే బలవంతంగా కథ వ్రాయించాను గదా మీతో..."

"బలమో... వంతమో... నాకు తెలియదు. కనీసం ఈ రోజైనా నాకీ అవకాశం... ఇచ్చినందుకు శ్రీమతిగారి పాదములకు వెన్నెల్లో...

* * *

"శారదా నీ ముఖంలో కొత్త కళ ఉట్టిపడుతోందోయ్."

"అవుమా... ఓ రచయిత భార్యనని గర్వంగా చెప్పుకోబోతున్నాను గదా..."

"ఇవ్వాళ కూడానా ...!!??"

"ఆఁ ఇవాళకూడ. నిన్న కొన్నిళ్ళు మిగిలిపోయాయి. పూర్తిచేసి వస్తాను."

"ఈలోపు నువ్వు చెప్పినవాళ్ళు నీకా అవకాశం లేకుండా చేసే ఉంటారు. అయినాసరే వెళ్ళాలంటావ్—సరే నేను ఆఫీసుకెళుతున్నాను.."

"నేను వీధిన పడుతున్నాను..."

"ఇద్దరూ నవ్వుకుంటూ బయటికి వచ్చారు. శారదా ఈరోజు త్వరగా వస్తే. పిక్చర్‌కి వెళదాం."

"సరేనండి..."

"విన్నట్లాగా..."

"కాదుగదా..."

"వస్తాను..."

"అలాగే..."

శారద ఇళ్లన్నీ పూర్తిచేసుకుని వచ్చేసరికి ఐదైంది. సుబ్బారావ్ నిన్నటిలాగానే కూర్చొని ఉన్నాడు.

తలుపు తీసింది నవ్వుతూ.

బరువైన కవర్ ఒకటి కనబడ్డది గుమ్మంలో. ఇంట్లోకి అడుగుపెట్టిన సుబ్బారావ్ వంగి కవర్ అందుకున్నాడు తన అడ్రస్ ఉంది కవర్ మీద.

"ఏమిటండీ అది..."

"అదేఁ..."

"ఏది..."

"అరెఁ ఇదా నేను వ్రాసిందేనండి. అప్పుడే తిప్పి పంపారా పత్రికవాళ్ళు...!!??"

సుబ్బారావ్‌కి నోట మాట రావడంలేదు. కవర్ చింపాడు వణుకుతూనే.

అందులో కథ, ఓ కవర్ ఉంది. ఆ కవర్ మీద పత్రిక వాళ్ల అడ్రస్, స్టాంపులు ఉన్నాయి.

అలాగే కూలబడిపోయాడు సుబ్బారావ్ కుర్చీమీద.

శారదకి నోటి వెంట మాట రాకుండా పోయింది. 

# ఫాలాక్షుని డైరీ



## క్యారెట్ వరం!

మన ఎదుట నవనవలాడే క్యారటు దుంప మనిషికి భగవంతుడిచ్చిన వరంగా వైద్యులు చెప్తున్నారట. ఇందులో విటమిను ఎ. చాలా ఎక్కువ మోతాదులో వుంటుందట. అంతేకాక బివన్ ($B_1$) అనబడే థయామైన్ బి$_2$ అనబడే రిబోఫ్లేవిన్ కూడా యిందులో అధికంగా వున్నాయట. విటమిను ఎ కంటికి మంచిదయితే యీ విటమిను బి$_1$, బి$_2$ జీర్ణశక్తికి తోడ్పడతాయట. "ఎ" విటమిను తక్కువయితే రేచీకటి, శాశ్వత మలబద్ధకం, విరేచనములూ అనే రోగాలు వస్తాయట. బి$_1$, బి$_2$ తక్కువయితే బెరిబెరి అనే వ్యాధి, గుండె వుబ్బరం, గుండె వేగంగా కొట్టుకోవడం, పక్షవాతం వంటి వ్యాధులొస్తాయట. క్యారటులో మెగ్నీషియము కూడా వుంటుందట. ఇది మలబద్ధకాన్ని రానీయదట. ఆవుపాలలో వుండే ఖనిజాలన్నీ యిందున్నాయట. ఇన్సులిన్ వంటి పదార్థమిందులో వుండటంవల్ల చక్కరవ్యాధి నిరోధకంగా కూడా పని చేస్తుందట. ఇందులో ఇనుము కూడా వుండడంవల్ల అనీమియా అనే వ్యాధి నివారణ క్కూడా వుపయోగిస్తుందట!

## దొంగల నాయకుడి వయస్సు పదమూడేళ్లు!

హేమ్బర్గ్‌లో కుర్రగ్యాంగొకటి ఎంచక్కా దోపిడీలు చేస్తోందట. ఈ గ్యాంగులో అందరూ పదేళ్ళపయిన, యిరవైయ్యేళ్ళ లోపువారేనట. ఈ గ్యాంగుకు 13 ఏళ్ళ డిర్క్ నాయకుడట. వీరు రాజమార్గాలలో చేరి అడ్డదారులుకాసి, ఎనిమిదొందల కార్లను యిటీవల కొల్లకొట్టారట. ఈ గ్యాంగులో ఆడామగా చేరి సుమారొంద మందున్నారట.

## నూటనాలుగో ఏట అయిదో పెళ్ళి!

బంగ్లాదేశ్‌కు చెందిన ఫతేబాగ్ వాసి ముల్లా అలీ ఆజామ్‌కు నూటనాలుగేళ్ళట. ఆయనకు లోగడ నాలుగు పెళ్ళిళ్ళయి, తన 104వ ఏట అయిదో పెళ్ళికో 16 ఏళ్ళ బాలామణిని ఎన్నుకున్నాడట. ఇస్లాం మతం అయిదో వివాహాన్ని సమ్మతించదు కనుక యీతడు యీ అయిదో పెళ్ళి చేసుకో వీల్లేదు. మతధిక్కారం చేసినందుకీ తనిని వివస్త్రుణ్ణి చేసి దండించవలసినదని మతాధికారులు ఆవేశపడ్డారట.




## బట్టతలలకి నష్టపరిహారం!

అమెరికాలోని పిట్స్‌బర్గ్‌కు చెందిన యునైటెడ్ లెబొరేటరీస్ అనే ఒక సంస్థ బట్టతలమీద జుట్టు రాబట్టవచ్చు. రాబట్టగలము అని తత్సంబంధమైనవారిని రాబట్టి నైలాన్ వెంట్రుకలను ప్లాస్టిక్ సర్జరీ ద్వారా ప్రవేశపెట్టిందట. దీంతో ఆ బట్టతలలు వారి చేతిలో పెట్టినవారికి భయంకర తలపోటు అదనమై జుట్టురాని బట్టతలతో మెలికలు తిరిగి, అంతా చేరి ఆ సంస్థమీద విరుచుకుపడేసరికి కోర్టు కొద్దు, మీకెంత కావాలి అని లోపాయికారీగా వారందరికీ నష్టపరిహారం ముట్టజెప్పిందట.

## హత్యకి దారితీసిన భూమి తగాదా!

పార్రైయూరులో చిత్తన్ అనే అతనికి కుప్పన్ అనే అతనికి పొలం గొడవలు వచ్చి, తన్నులాడుకుని ఆనక పంచాయితీ పెట్టి తీర్పడిగితే కుప్పనదే తప్పని పంచాయితి అతనికి అపరాధం కూడా విధించిందట. దాంతో ఆ అవమానాన్ని భరించలేని కుప్పన్ నేరుగా చిత్తన్ ఇంటికి వెళ్ళి ఆ చిత్తన్ను చిత్తుగా తన్ని పీక నొక్కి చంపేసి, శవాన్ని భుజాన్నేసుకుని తీసుకుపోయి కాలవలో పారేసి, తాను అంతర్థానమైపోయాడట!

## లంఖణం పరమౌషధం!

మలబద్ధక మున్నా, జ్వరముగా వున్నా, ఎక్కువ జలుబూ, తలనొప్పి వున్నా, భయంకర తలనొప్పి వున్నా కడుపు బరువుగా వున్నా, కాళ్ళూ, చేతుల్లో నొప్పులూవున్నా, ఎగనాయాసం, చెమటలు పట్టుతున్నట్టున్నా, ఏదో కారణం తెలీని అసంతృప్తిగా వున్నా, ఏదో పిచ్చి ఆనందంగా వున్నా, వేయేల. మామూలు స్థితికి భిన్నస్థితిలో వుంటే ఆ పూట ఆహారం మానివేయడ మంత పరమౌషధం లేదని నేను నిస్సంశయంగా చెప్పగలనని గాంధిమహాత్ముడు తాను రాసిన "ఆరోగ్య మార్గము" అనే పుస్తకంలో క్రోడీకరించారట— మన పెద్దలు లంకణం పరమౌషధం అననే అన్నారుగా.

## విషాలో హత్య!

విల్లుపురానికి చెందిన పూతోట్టం వీధిలో వున్న ఒక యింట్లో వంటవానిగా పని చేసే ముత్తుకరుప్పన్ జులై 12వ తేదీ రాత్రి తొమ్మిదింటికి తనింటి ముందు నిలబడి ఆ యింటి గుమస్తాతో మాట్లాడుతూండగా, ఎదురింటి మేడ మీదుంటున్న 30 ఏళ్ళ డాక్టర్ గౌతమన్ అతి పూటుగా తాగి, ఆ మైకంలో పిస్టలు తీసుకుని, బాల్కనీలోకి వచ్చి, వో అట్టహాసం చేసి దాన్ని పేల్చాడట. అది సరాసరిన ముత్తుకరుప్పన్ గుండెకు తగిలి, దూసుకుపోయిందట. దాంతో అతనక్కడికక్కడే చనిపోయాట్ట.

# హైదరాబాదు నోట్‌బుక్

### రక్తదాన కర్ణుడు :

శ్రీ పెళ్లకూరి గోపీకృష్ణ అన్నట్టు తోటి మానవుల ప్రాణ రక్షణమైన సేవ రక్తదానం. భూదానం, శ్రమదానం, అన్నదానం మొదలయిన దానాలన్నిటికంటే రక్తదానం గొప్ప దానం; ఆదర్శ దానం. స్వచ్ఛంద రక్తదానంతో తోటి మానవుల ప్రాణ రక్షణకు శాయశక్తులా కృషిచేసి, స్వచ్ఛంద రక్తదానోద్యమ వ్యాప్తికి జీవితం అంకితం చేసినవారు శ్రీ గోపీకృష్ణ. "నేను ఈ ప్రపంచంలో బ్రతికి ఉండగా, ఈ జన్మలో ఒక స్త్రీయొక్కగాని, ఒక పురుషుని యొక్కగాని ఒక్క కన్నీటిబొట్టును నా రక్తదానంతో తుడిచివేయగలిగితే, నా జీవితం ధన్యమౌతుందని భావిస్తాను —" అంటారు శ్రీ గోపీకృష్ణ. రక్తదాతలలో గోపీకృష్ణ ఆంధ్రదేశంలో ప్రథమ స్థానం, భారతదేశంలో ద్వితీయ స్థానం సంపాదించారు 50 మార్లు రక్తదానం చేసి, 57 మంది ప్రాణాలు కాపాడి. "మరో జన్మ అనేది ఉంటే, ఆ జన్మలో నేను గొప్ప వైద్య శాస్త్ర ప్రవీణుడనై, బ్రహ్మచారిగా ఉండి, చేరెడు గంజికి కూడ నోచుకోలేని బాధిత, పీడిత ఆర్తజనాలికి రక్తదానంతో ఉచిత సేవ చేయడమే నేను మనసార కోరుకొనేది" — అన్నారు మీ చివరి కోరిక ఏమిటని ప్రశ్నించగా. గోపీకృష్ణ ఎం ఎ., ఎల్. ఎల్. బి; డి. ఎస్; ఎఫ్. ఆర్. ఇ. ఎస్. పట్టాలు పుచ్చుకొన్నారు. నెల్లూరు నుంచి వెలువడే జమీన్ రైతు పత్రికలో ముఖ్య సంపాదకులుగా కొంతకాలం పనిచేశారు. దీనబంధు వారపత్రిక స్థాపించారు. కావలిలోని జవాహర్ భారతి మున్నగు విద్యా సంస్థలలో ఉపన్యాసకులుగాను, సలహాదారుగా ఉన్నారు. ప్రముఖ సంఘ సేవకులు. 1958 డిసెంబర్ 10వ తేదీన మద్రాసు జనరల్ ఆస్పత్రిలో జరిగిన ఒక విషాద సంఘటన ఆయనను రక్తదాన కర్ణునిగా చేసింది. ఆనాడు ఒక స్త్రీ రక్తం దొరకని కారణంగా అకాల మృత్యువు వాత పడింది. ఆనాడు గోపీకృష్ణ ప్రతిజ్ఞ చేశారు స్వచ్ఛంద రక్తదాన సేవను ప్రారంభిస్తానని. అప్పటినుంచి షష్టిపూర్తి జరిగేవరకు రక్తదానం చేశారు. రాష్ట్రంలో ప్రభుత్వ వైద్యశాలలలో కొత్తగా రక్తనిధినిఏర్పాటుచేసినప్పుడల్లా మొదటి స్వచ్ఛంద రక్తదాత గోపీకృష్ణే. భారత రెడ్‌క్రాస్ సంఘం వాకాడు బాలకృష్ణ సేవా క్షేత్రం, నెల్లూరు జిల్లా గ్రంథాలయ సంస్థ, ఇండియన్ సొసైటీ ఆఫ్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ అండ్ ఇమ్యూనో హెమీబాలజీ మున్నగు సంఘాలు ఆయనను సన్మానించాయి. రక్తదానం వల్ల కలిగే ఉపయోగాలను ఆయన పదే పదే వివరిస్తారు.

శస్త్రచికిత్సలలో కొత్తరక్తం అవసరమవుతుంది. క్షతగాత్రులకు, దుర్బలులకు టానిక్కులు మొదలయినవాటివల్ల ఆలస్యంగా కలిగే ప్రయోజనం కొత్త రక్తం వల్ల వెంటనే కలుగుతుంది. "యువకులు, కళాశాల విద్యార్థినీ విద్యార్థులు ముందుకువచ్చి రక్తదానం చేయాలి. ఆంధ్రప్రదేశ్‌లోని బ్లడ్ బ్యాంకులు చాలినంత రక్తం అందనందున ఆశించినంత చురుకుగా పనిచేయడం లేదు. కనుక స్వచ్ఛంద రక్తదాతలు ముందంజ వేయాలి. ప్రతి జిల్లాలోను, తాలూకాలోను రక్తదాతల సంఘాలు ఏర్పాటు చేసి ప్రచారం చేయాలి. సంఘ సేవకులు, యువతీ యువకులు ఇందుకు సర్వ విధాల సహకరించాలి" — అని గోపీకృష్ణ విజ్ఞప్తి. ఇంతటి సేవచేసిన గోపీకృష్ణ ప్రస్తుతం సెంటు భూమిలేక, నిలువనీడలేక, పట్టుమని పదిరూకలు లేక మధుమేహం, కాళ్లనాపు, లవణం, క్షయ మున్నగు వ్యాధులతో బాధపడుతూ నెల్లూరులో గౌతమ నగర్ రెండవ రోడ్డులో ఉన్నారు. ప్రభుత్వం, సంఘసేవకులు, ప్రజలు ఆయనను ఆదుకోవాలి.

### ఎన్. జి. వోలకు ముఖ్యమంత్రి విజ్ఞప్తి :

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాన్‌గెజెటెడ్ ఆఫీసర్ల సమ్మె (జూలై 16వ తేదీన ప్రారంభమయింది.) దురదృష్టకరమైనదనీ, బాధాకరమైనదని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు జులై 15 రాత్రి దూరదర్శన్‌లోను, ఆకాశవాణిలోను ప్రసంగిస్తూ అన్నారు. ఆరుకోట్ల తెలుగు ప్రజలకు ప్రతినిధి అయిన తాను ఆరు లక్షల మంది ఎన్. జి. వో. ల కోసం ఆంధ్ర ప్రజల ప్రయోజనాలను బలిపెట్టలేనని ఆయన విచారం ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ప్రజలు తన మీద ఉంచిన గురుతర బాధ్యతను నిర్వహించాలన్న దీక్షతో ఎట్టి పరిస్థితినైనా ఎదుర్కొనడానికి గుండెను బండ బారించుకొన్నానని ఆయన అన్నారు. ఈ సమ్మె విషయంలో ధర్మనిర్ణేతలు, న్యాయనిర్ణేతలు ప్రజలేనని, వారే తగిన తీర్పు చెప్పగలవారని ముఖ్యమంత్రి అన్నారు. బడుగుజీవుల సంక్షేమం కోసం ప్రభుత్వం పాటుపడుతున్న సమయంలో అంతరాయం కలిగించడానికి ఇలాటి సమ్మెలు ప్రారంభించడం దురదృష్టకరమని ఆయన మరొకమారు చెప్పారు.

### సమ్మెకు వ్యతిరేకంగా ప్రదర్శన

రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సమ్మెకు నిరసనగా తెలుగుదేశం పార్టీ యువజనశాఖ జూలై 15న బాగయాం నుంచి సచివాలయం వరకు పెద్ద ఊరేగింపు జరిపింది; దాదాపు 10 వేల మంది పాల్గొన్నారు. సచివాలయంవద్ద జరిగిన బహిరంగసభలో తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ ఉపేంద్ర, రాష్ట్ర విధాన సభ తెలుగుదేశం సభ్యులు శ్రీమతి కాట్రగడ్డ ప్రసూన, శ్రీ రాజేశ్వరరావు, శ్రీ మాచినేని కిషన్‌రావు, శ్రీకృష్ణ మున్నగువారు ప్రసంగించారు. ఈ సమ్మె వెనుక రాజకీయపు కుట్ర ఉందని, రాజకీయ శక్తులు రాష్ట్రంలో అశాంతి, అరాజకం కలిగించడానికి ప్రభుత్వోద్యోగులను ఉసిగొల్పుతున్నారని, ఉద్యోగుల సమ్మెకు ఒత్తాసుగా కేంద్రం నుంచి లక్షల రూపాయలు రాష్ట్రానికి చేరాయని, ఈ ధనసహాయంతో ఇందిరా కాంగ్రెస్‌పార్టీ రాష్ట్రంలో అరాజకం సృష్టించడానికి ప్రయత్నిస్తున్నదని, ఇది తెలుగుదేశం ప్రభుత్వానికీ, ఇందిరా కాంగ్రెస్ పార్టీకి మధ్య పోరాటమని, ప్రభుత్వోద్యోగ సంఘాల నాయకులు కొందరు స్వార్థపరులైన రాజకీయ నాయకులకు లొంగిపోయారని వారు ప్రసంగించారు.

### ఉపశ్రుతి :

రోడ్డు రవాణా సంస్థవారు మనకు హఠయోగం నేర్పుతున్నారోయ్ !—అన్నాడు మిత్రుడు చిదంబరస్వామి నాతో. ఎలాగా ? — అనడిగాను బస్సులో కూర్చోడానికి కుషన్లు లేవు; ఆనుకోడానికి బ్యాకులు లేవు. నిటారుగా కూచోవాలి. అదిన్నీ కూర్చునే అదృష్టం కలిగినప్పుడు నిలుచుకోవలసివస్తే పైకమ్మీ పట్టుకొని వేలాడుతూ, వచ్చిపోయేవారి ధక్కాముక్కాలు తినాలి. ఇంతకన్నా హఠయోగ పాఠాలు ఏముంటాయి ? — అన్నాడు మిత్రుడు.

— తిరుమల రామచంద్ర ★

రక్తదాన కర్ణుడు శ్రీ గోపీకృష్ణ



# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

22–7–83 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో చంద్రశేఖర్, డి. (కాకినాడ) వారి ఉత్తరము చదివిన తర్వాత ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను. మార్క్సిజంను గూర్చి శ్రీ జయదుబాషిగారికి ప్రాథమిక జ్ఞానం లేదంటూ శ్రీ చంద్రశేఖర్ వ్రాయటం, తను మార్క్స్ మానిఫెస్టో చదవలేదనేదానికి, నిదర్శనం. ప్రపంచంలో ఉన్నవి రెండే జాతులు ఆడా—మగా అనిన్నీ, సామూహికంగా ఆ రెండు జాతులు నివసించాలనిన్నీ, ఈనాటి భార్యాభర్తల వ్యవస్థను నిరసించారు మార్క్స్. ఇక రెండవది మనిషియొక్క తెలివితేటలను, పని వేగాన్ని, నేర్పరితనాన్ని లెక్కించకుండా అతను చేసిన పని గంటలకు మాత్రమే మార్క్స్ విలువకట్టాడు అంటే గాడిదను, గుర్రాన్నీ ఒకే గాట కట్టేసినట్లు. ఆనాటి యూరప్ దేశాలలో (చర్చి) దురంతాలను, ఇంగ్లాండు లైబ్రరీలో కూర్చొని అధ్యయనం చేసేడేగాని, మిగతా సభ్య ప్రపంచాన్ని గూర్చి మార్క్స్‌కి ఏమీ తెలియదు విప్లవము పారిశ్రామికముగా అభివృద్ధి చెందిన దేశాలలో ముందుగా వస్తుందన్నాడు. కాని చైనాలాంటి వ్యవసాయక దేశంలో తన మార్క్స్ విప్లవం వస్తుందని కలగనలేకపోయాడు. ఇవన్నీ మార్క్స్ జ్ఞానానికి హద్దులు నిర్దేశిస్తున్నాయి శ్రీ జయదుబాషిగారికే ప్రాథమిక జ్ఞానం లేదంటే ఇక మార్క్స్‌కో !?

ఎమ్. ఎస్. రామారావు (నూజివీడు)

## ఆంధ్ర సాంస్కృతిక పరిషత్ (రిజిష్టర్డ్) భోపాల్

పరిషత్ సొంత భవన నిర్మాణము కొరకు దేశము నలుమూలల నుండి విరాళములు కోరుచున్నాము. విరాళములు పంపగోరువారు ఈ క్రింది చిరునామాకు పంపగోర్తాము.

జి. రామమూర్తి, కార్యదర్శి, ఇ. డబ్ల్యు. ఎస్. 412, జవహర్ చౌక్, టి. టి. నగర్, భోపాల్. (లేదా) అకౌంట్ నంబరు 2296, ఆంధ్రా బ్యాంక్, భోపాల్. చెక్కులు డ్రాఫ్టులు పంపవచ్చును.

జి. రామమూర్తి, కార్యదర్శి.
ఆంధ్ర సాంస్కృతిక పరిషత్ (భోపాల్) ●


*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 Editor: S Radhakrishna*

# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ

అసలు తల నొప్పి అంటేనే భరించలేని బాధ. దాన్ని పోగొట్టుకోడానికి సులువైన మార్గము. కొంచెము అమృతాంజన్ తీసుకొని కణతల మీద బాగా గట్టిగా నిమిరి పట్టించండి. వెంటనే తల నొప్పి తగ్గిపోయి హాయిగా వుంటుంది.

అమృతాంజన్ ఇతర మందులవలెగాదు. అమృతాంజన్‌లో చేరివున్న శక్తివంతమైన 10 ఔషధాలు అమోఘంగా పనిచేసి రాసిన చోట పై చర్యవల్ల అతి త్వరగా ఇట్టే నొప్పిని నివారిస్తుంది. ఏ అపాయం వుండదు.

85 సంవత్సరాలకు పై బడిన ప్రసిద్ధి కల అమృతాంజన్ వొంటి నొప్పులకు, బెణుకులకు, జలుబులకు గొంతు నొప్పులకు కూడా చాలా అమోఘంగా పనిచేసి నివారిస్తుంది.

ఎప్పుడూ అమృతాంజన్ చేతికి అందుబాటుగా వుంచుకోటం మంచిది. ఎందుకంటే ఎప్పుడు అవసరమొస్తుందో చెప్పలేము.




**అమృతాంజన్**

**శీఘ్రనివారిణి. నమ్మకమైనది. ఏ ఇతర బాధనూ కలుగచేయదు.**

OBM 7652 TG·R